శ్రీరస్తు

ధూర్జటి మహాకవి విరచిత

# శ్రీకాళహస్తి మాహాత్మ్యము

(విపుల లఘు టీకా సహితము)

పరిష్కర్తలు:

శ్రీ వేదము లక్ష్మీనారాయణ శాస్త్రి

శ్రీ బులుసు వేంకటరమణయ్య



ప్రకాశకులు

వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్

26, రామానుజ అయ్యర్ వీధి, చెన్నై - 600 021

ఫోన్: 25951378

*****

8, హస్తినాపురం (దక్షిణం) నాగార్జున సాగర్ రోడ్డు,
వైశాలీ నగర్ పోస్టు, హైదరాబాదు - 500 079.
ఫోన్: 040-24093427



Rs. 100.00

శ్రీరస్తు

ధూర్జటి మహాకవి విరచిత

# శ్రీకాళహస్తి మాహాత్మ్యము

(విపుల లఘు టీకా సహితము)

పరిష్కర్తలు:

శ్రీ వేదము లక్ష్మీనారాయణ శాస్త్రి

శ్రీ బులుసు వేంకటరమణయ్య



ప్రకాశకులు

వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్

26, రామానుజ అయ్యర్ వీధి, చెన్నై - 600 021

ఫోన్: 25951378

*****

8, హస్తినాపురం (దక్షిణం) నాగార్జున సాగర్ రోడ్డు,

వైశాలీ నగర్ పోస్టు, హైదరాబాదు - 500 079.

ఫోన్: 040-24093427

పునర్ముద్రణ 2006
ప్రతులు – 1000 Copies



వావిళ్ల రామస్వామి శాస్త్రులు
(1826 - 1891)



వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులు
(1884 - 1956)

*Printed and Published by*
**ALLADI SWAMINATHAN**
Advocate & Managing Trustee
V.V.S. Public Trust
For V. Ramaswamy Sastrulu & Sons,
26, Ramanuja Iyer Street, Chennai - 600 021.
(Phone: 044 – 2595 1378)





* * *

**Hyderabad Office:**
**V. Ramaswamy Sastrulu & Sons**
**No. 8, Hasthinapuram South Colony,**
**Nagarjuna Sagar Road,**
**Vaishalinagar P.O., Hyderabad - 500 079**
**(Phone: 040–24093427)**

# తొలి పలుకు

శ్రీ కృష్ణదేవరాయలకాలమున వెలువడిన యాంధ్ర ప్రబంధములలో ధూర్జటిమహాకవి రచించిన శ్రీకాళహస్తి మాహాత్మ్య మెన్నికఁగన్నది. సాలెపురుగు, ఏనుఁగు, పాము, తిన్నఁడను కిరాతుఁడు, వేశ్యలును ముక్తి నందిన - శ్రీకాళహస్తిక్షేత్రము మాహాత్మ్య మీప్రబంధమునఁ జక్కఁగా వర్ణింపఁబడినది.

ధూర్జటిమహాకవి గొప్ప శివభక్తుఁడు; ఇతఁడు శ్రీకాళహస్తిమాహాత్మ్యము నేగాక శ్రీకాళహస్తీశ్వరశతకమునుకూడ రచించెను. అది మంచి ప్రచారమున నున్నది. తాను రాయల యాస్థానమునందలి యష్టదిగ్గజములలో నొకఁడయి యున్నను ఈయన తనగ్రంథములను శ్రీరాయల కంకిత మీయలేదు. దీనిం బట్టి యీతనికిఁ గల స్వాతంత్ర్యము వ్యక్తమగుచున్నది. గ్రంథమును తన కంకిత మీయకున్నను రాయ లీతనిపయిఁ గినియలేదు. పైగా 'స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కులకేలగల్గె నీ యతులిత మాధురీమహిమ'—అని యీతని కవిత్వమును ప్రశంసించియుండెను.

ధూర్జటినామమున వెలసిన కవులు ముగ్గు రున్నట్లు తెలియుచున్నది. మహాకవి ధూర్జటియు, నితని మనుమఁడును, కుమారధూర్జటి బిరుదాంచితుఁడును అగు వేంకటార్యుఁ డొకఁడునుగాక - 'కాళహస్తీశ్వరదండకము'ను రచించిన ధూర్జటికవి

యింకొకఁడు కలఁడు. అతనినిగూర్చి ప్రభుత్వమువారి ప్రాచ్య లిఖితపుస్తకభాండాగారమువారు ప్రకటించిన 'యక్షగానములు-దండకములు' అను 8-వ సంపుటమునఁ గొంతవిషయము కలదు. అతఁడు వ్రాసిన దండకములోని 'మాధురీ సాధురీతిన్ రచించెన్ బ్రియావల్లకీ భాతిఁ జేతోభవారాతిపై నూత్న శృంగార మీదండకం బాంధ్ర భాషాకవిగ్రామణిన్ జక్కయామాత్య నారాయణ శ్రీసుధీమాధవాఖ్యావసీదేవతా విశ్వనాథప్రథా నీందు పోలాంబికాపుత్రుఁడున్ ధూర్జటి ప్రాఖ్యుఁడున్ జేసె ముఖ్యంబగున్ మూఁడు లోకంబులన్——'

అను భాగమునుబట్టి యితఁడు పోలాంబికా విశ్వనాథుల పుత్రుఁ డని తెలియుచున్నది. దండకమున నితని పితృ, పితా మహ, ప్రపితామహుల పేరులును ఉటంకింపఁబడిన ట్లున్నది. కాని యాయంశ మిందు స్పష్టముగాఁ గానవచ్చుట లేదు.

మహాకవి ధూర్జటి తన కులగోత్రములనుగూర్చి చెప్పి కొనకపోయినను, ఇతని మనుమఁడును, 'కుమారధూర్జటి' బిరు దాంచితుఁడు నగు వేంకటార్యుఁడు రచించిన 'కృష్ణరాయవిజయ ము'నుబట్టి యీతఁ డాపస్తంబసూత్రుఁ డనియు, భారద్వాజ గోత్రుఁడనియు, పాకనాటి యార్వేలనియోగియనియుఁ దెలియు చున్నది.

మాహాత్మ్యములు ప్రౌఢప్రబంధములుగా రచింపఁబడుట ౧౬-వ శతాబ్దిలోనే ప్రారంభింపఁబడియుండవచ్చును. తెనాలి రామకృష్ణకవి రచించిన 'పాండురంగమాహాత్మ్యము'నకుఁ బిదప కవితావిషయమున నెన్నఁదగిన మాహాత్మ్య రూపప్రబంధము లలో శ్రీకాళహస్తిమాహాత్మ్యమే తొలుతటిది. పెక్కువిషయ

ములలో నీరెండింటికిని పోలికలు కానవచ్చుచున్నవి. ఈ రెండును ప్రౌఢప్రబంధములు; కవు లిరువురును రాయలసభ లోని అష్టదిగ్గజములలోనివారే. రెండింటి కవులును వ్యాకరణ శృంఖలలకు లొంగక స్వేచ్ఛగ సంచరించిరి. రెండును ధనమున కయి వ్రాయఁబడని గ్రంథములే. రెండింటను కీటకములు, మృగములును ముక్తినిపొందిన కథలు కలవు. కథలను చర్విత చర్వణముగఁ గూర్చినను క్రొత్తదనమువలనఁ గ్రొత్తగానే తోఁపించి, చదువరులకు విసువుకలిగింపనిరీతి కూర్పు రెండింటను గలదు. సరిసమానములగు లోకోక్తులు రెండింటను గలవు. ఇఁక భేదమేమన — పాండురంగమాహాత్మ్యము వైష్ణవమత ప్రశస్తి ప్రతిపాదకము; శ్రీకాళహస్తిమాహాత్మ్యము శైవమత ప్రాశస్త్య ప్రతిపాదకము.

ధూర్జటి, రామకృష్ణులకుఁ గొలఁదిపాటి విరోధము ఉండినట్లు —

'స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కుల కేల గల్గె నీ
యతులితమాధురీమహిమ' —

అని శ్రీకృష్ణదేవరాయలవా రిచ్చిన సమస్యయు, దానికి తెనాలి రామకృష్ణుఁ డొసఁగిన —

... ... 'హా! తెలిసెన్ భువనైకమోహనో
ద్ధత సుకుమారవారవనితాజనతాఘనతాపహార సం
తత మధురాధరోదిత సుధారసధారలఁ గ్రోలుటంజుమీ!'

అను సమాధానమును తెలుపుచున్నవి.

పయివిషయమువలన ధూర్జటికవి వేశ్యాలోలుఁ డను ప్రతీతి కలుగుచున్నందున - అట్టి ప్రథను సహింపని ముద్రిత

కాళహస్తిమాహాత్మ్య పీఠికాకారులు - ఇదియంతయును కల్పితమనియు, ధూర్జటిమహాకవి పరమభక్తాగ్రేసరుఁ డనియు, హాస్యగాఁడగు తెనాలిరామకృష్ణుని మాటలను మనము లెక్కచేయరాదనియుఁ దెలిపిరి. [చూ. ౧౯౩౦, ముద్రణము, శ్రీకాళహస్తిమాహాత్మ్యము పీఠిక. పుట. ౫] ధూర్జటిమహాకవి మనుమఁడగు కుమారధూర్జటి తన తాత శ్రీకృష్ణరాయలవలన 'స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కుల కేలగల్గె నీ, యతులితమాధురీమహిమ' అని గొప్పప్రశస్తిని పొందె నని చెప్పినమాటలను పీఠికాకారు లంగీకరింతురు; కాని శ్రీరామకృష్ణుఁడు సమస్యను పూరించె ననుటనుమాత్ర మంగీకరింపకుండుట వింతగనున్నది. ఒక పద్యమునఁ గొంతభాగము సత్యమయి, కొంతభాగమసత్యమయి యుండ నేరదుగదా!

ధూర్జటిమహాకవి వేశ్యాలోలుఁ డైనంతమాత్రమున అతని భక్తికిఁగాని, వాక్శుద్ధికిఁగాని, కీర్తికిఁగాని ఎట్టిభంగము కలుగదు. ఈవిషయమున మనము శ్రీనాథాదులను తార్కాణలుగా గ్రహింపవచ్చును. వేశ్యాస్నేహము సుకవులకు గుణాధాయకముగాని, దోషావహము కానేరదు. రక్తిపరిపాకము పొందినపిదపనే భక్తి.

'విషయా న నివర్తన్తే నిరాహారస్య దేహినః'

అను భగవద్గీతోక్తి ననుసరించి 'కామి గాక మోక్షకామి' యగుట యసంభవ మనుట స్పష్టము.

మఱియు ధూర్జటికవి గొప్ప రసికుఁడు; వర్ణింపవలసిన పట్టుల నీతఁడు శృంగారము నద్భుతముగ వర్ణించెను. ప్రథమాశ్వాసములోని 42, 43, 47 పద్యము లీవిషయమును జాటఁ

గలవు. పరమభక్తాగ్రేసరుఁడగు నీకవి శృంగారమ్మువంక చూడఁ డనిన చో___

ఉ. 'మంచెలమీఁద నెక్కి కటిమండలిఁ జుట్టిన పాఱుటాకు లిం
చించుక సంచలించి మరునిల్లు బయల్పడఁజేయఁ బిట్టలన్
జెంచెత లార్చి ప్రేయుదురు చిత్రముగా నొడిసెల్ల బాహుమూ
లాంచితదీధితుల్ చిఱుతనైన చనుంగవమీఁదఁ బర్వఁగన్.'

అను [ఆ. ౨. ప. 10] పద్యమును గూర్చుట యసంభవమే యగునుగదా!

దీనింబట్టి ధూర్జటికవి యొనర్చిన వర్ణనమును, అతని వేశ్యాప్రియత్వమున భక్తి కెంతమాత్రము ప్రతిబంధకములు కాఁజాల వని గ్రహింపనగును.

ధూర్జటికవికృత కాళహస్తిమాహాత్మ్యమే కాక, ఇతని మనుమని కుమారుఁడు లింగరాజకవి వ్రాసిన శ్రీకాళహస్తి మాహాత్మ్య మింకొకటి కలదు; అది ముత్తాతగారి గ్రంథము ననుసరించి విపులముగ 12 ఆశ్వాసములలో వ్రాయఁబడిన పెద్ద ప్రబంధము. అందు ధూర్జటిగ్రంథమునకంటె కొన్ని మార్పులు కలవు.

సంస్కృతమునను శ్రీకాళహస్తిమాహాత్మ్యము కలదు; అది లింగరాజకవికృత గ్రంథమునకు సరిపోవును. ధూర్జటిగ్రంథమునకు సరిపోదు. కావున అది ధూర్జటిగ్రంథముకంటె చాల అర్వాచీనము; తెలుఁగులో నున్న క్షేత్రమాహాత్మ్యములకు ప్రసిద్ధిని; ప్రాశస్త్యమును గూర్పఁగోరి మనవారు సంస్కృతమున ఆకథలను గూర్చుట యొక యాచార మైయున్నది. ప్రసిద్ధ ప్రబంధమగు 'పాండురంగమాహాత్మ్యమునకును ఇట్టి నకలు

సంస్కృతమున ఒకటి కలదు; అది ఆంధ్రసాహిత్యపరిషత్తువారి గ్రంథాలయమున నున్నది. ఈ సంస్కృతీకరణములు ప్రబంధముల పౌర్వాపర్య నిర్ణయమున ఎంతమాత్రము ప్రమాణములు కాఁజాలవు. వీనివలన ఆంధ్రప్రబంధముల ప్రశస్తియుఁ గొఱవడఁజాలదు.

శ్రీకాళహస్తిమాహాత్మ్యము తొట్టతొలుత 1395-వ సంవత్సరమున ముద్రింపఁబడినది. దీనిని 'శ్రీజ్ఞానప్రసూనమాలిక-ప్రథమప్రసూనము'గ శ్రీ క్రొత్తపల్లి పద్మనాభశాస్త్రిగారు ప్రకటించిరి. పీఠికలో దీని విషయ మిట్లు వ్రాయఁబడినది. 'దీని ప్రతి చిక్కుట యరుదు. బ్రహ్మశ్రీ, మ-రా-రా-శ్రీ, పూండ్ల రామకృష్ణయ్యగారు సదయులై తమయొద్దనున్న ప్రతి నొకటిని మాకొసంగిరి. దొరతనమువారి లిఖితపుస్తకభాండాగారంబునందు మెస్తరు బ్రౌను దొరగారిచే సేకరింపఁబడి కడు హెచ్చరికతో వ్రాయింపఁబడిన ప్రతి యొకండును మాకు దొరకె. ఇవి రెండును దోడుగా మఱియును రెండసముగ్రగ్రంథములం బరిశీలించి యొక ప్రతిని వ్రాసికొని దానిని ముద్రింపించినారము.

ప్రథమముద్రణము వెలువడినపిదప, అందలి ముద్రణస్ఖాలిత్యములు మున్నగువానిని వెల్లడించుచు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రులుగారు తమ 'శారదాకింకిణి' పరంపరలో 'శ్రీకాళహస్తిమాహాత్మ్య ముద్రణవిమర్శనము'ను ప్రత్యేకగ్రంథముగ ప్రకటించిరి. దానిని గమనించియే కాఁబోలు 1914సం॥ లో వెలువడిన ద్వితీయముద్రణమున ముద్రణస్ఖాలిత్యములు చాలవఱకు సరిచేయఁబడినవి. ఈముద్రణమున శ్రీ వావిలికొలను సుబ్బరావుగారు వ్రాసిన 12 పుటల 'లఘుటీక'యును చేర్పఁబడినది. శ్రీ

సుబ్బరావుగారు ద్వితీయముద్రణమునుగూర్చి ముచ్చటించుచు 'దొరకిన తాటియాకుపుస్తకము లసమగ్రములుగా నుండుటచేఁ గొలుతటికూప్పన దోషములు మెండుగా నుండఁ గారణ మయ్యె....దీనిని సంస్కరించుటయం దాంధ్రసాహిత్యపరిషత్తు వారు సేకరించిన యొక కాళహస్తిమాహాత్మ్యపుస్తకము జీర్ణము నసమగ్రమయ్యు నాకు మిక్కిలి యుపయుక్తమయ్యెఁ గావున వారికిఁ గృతజ్ఞతచే నమస్కరించుచున్నాఁడను?' అని వ్రాసి యున్నారు.

శ్రీసుబ్బరావుగారు శ్రీవేంకటరాయశాస్త్రులుగారి పేరు స్మరింపకపోయినను, వారి గ్రంథవిమర్శనమును చూచియుందు రనియు, దానినిబట్టి కొన్నితప్పులు దిద్దుకొనియుందు రనియు తేటపడుచున్నది. మఱియు ప్రథమముద్రణమున ఉపకరించిన శ్రీ సి. పి. బ్రౌన్ పండితుఁడు తయారుచేయించిన ప్రతిలోనే చక్కని పాఠములు కానవచ్చుచున్నవి. అవి ద్వితీయముద్రణ మునను విడువఁబడుట విచారకరము. మచ్చునకుఁగాను 1-3, 1-111, 2-99, 3-27, 3-35, 3-90, 3-167, 4-35, 4-154. సంఖ్యల పద్యములను గమనింపఁదగును. ముద్రిత లిఖితప్రతుల ప్రాశస్త్యాప్రాశస్త్యములు విజ్ఞులే నిర్ణయింతురుగాక !

ధూర్జటికవి తమిళవాఙ్మయములోని నక్కీరునికథను గ్రహించెను; పేరుమాత్రము 'నత్కీరుఁడు' అని మార్పఁబడి నది. 'శా. నత్కీరాది కవీంద్రులన్ దివిష దన్నప్రాయవాగ్గుంభ సంపత్కావ్య ప్రతిపాదకప్రతిభులన్—' అని ప్రాసమునందును, 'మాత్సర్యంబువాటించి నత్కీరుండూరక తప్పుపట్టెనఁట యే - దీలక్షణంబో—' అని యతిస్థానమునందును కూడ 'నత్కీర'

శబ్దమే ఉపయోగింపఁబడినది. తమిళమున నక్కీరపదమునకు మంచివాక్కులు కలవాఁడని యర్థము; తెలుఁగున ఆయర్థము కుదురకున్నది; దీనిని కేవలము రూఢపదముగనే గ్రహింపవలెనేమో!

ఆకాలము శైవమతము దక్షిణదేశమున గొప్ప ప్రచారమున నున్నట్లు ఈగ్రంథమువలనఁ దెలియవచ్చుచున్నది. శైవకవులవలెనే ధూర్జటియు పెక్కు స్వతంత్రప్రయోగములను చేసియున్నాఁడు.

ఉదంత తద్ధర్మార్థకవిశేషణములయి నుగాగమము రాని ప్రయోగములు '(జాలు+ఒప్పున) = జాలొప్పున' [2-57] '(చింపు+అమృతంబు) = చింపమృతంబు' [2-135] అనునట్టివి కానఁబడుచున్నవి. 'స్రుక్కుక గ్రావి, కూడుక, పెట్టుక, మోకారించుక' వంటి ప్రయోగములలో 'కొని' నకు 'క' అను నాదేశము ధారాళముగా వాడఁబడినవి. 'నిమ్మపండుపులుసు (నిమ్మపండుపులుసు)' [3-110] 'సొంగలు (సొంగల్)' [4-69] 'అందియ్యన్' [3-93] 'అతనికి విని (అతండు చెప్పినవానిని విని యను నర్థమున)' [3-102] 'కెంగేలునన్ (కెంగేలన్)' [2-102] 'మాఁటిపెంపునన్ (మాఁటి యొసంపునన్)' [4-101] మొదలగు ప్రయోగములు కానవచ్చుచున్నవి.

ప్రాచీనగ్రంథములను వీలగునంతవఱకు వ్రాతప్రతుల సాయమున పరిశుద్ధముగ తయారుచేయించి, ముద్రింపఁ గంకణముకట్టుకొనిన, భాషోద్ధారక బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులుగారు 'శ్రీకాళహస్తిమాహాత్మ్యము' సంస్కరించుభారము నాపైని వైచిరి. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములో

శ్రీబ్రౌన్‌పండితుఁడు వ్రాయించి ప్రత్యంతరములలోని పాఠాంతరములతోఁ జక్కఁజేసిన ప్రతి ఏతత్సంస్కరణమున నెంతయు నుపయోగించినది; అయినను కొన్నియెడలఁ గల పాఠములంతగా తృప్తికరములు కాకున్నవి. దీనిప్రతి తంజావూరిలోని శ్రీసరస్వతీమహాల్ లైబ్రరీయందును కలదు. అందు కొన్ని మంచి పాఠము లుండవచ్చునేమో! అవకాశము లేనందున తంజావూరిప్రతితో దీనిని సరిచూడ వీలుకలిగినదికాదు.

శ్రీవావిలికొలను సుబ్బరావుగారు రీప్రబంధమునకు 12 పుటల లఘుటీకను వ్రాసియున్నారు. కాని యది యిట్టి ప్రబంధమునకు సరిపోదు. కావున శ్రీవేంకటేశ్వరశాస్త్రులవారి యానతిమేర కిందు కొంత విపులమగు 'లఘుటీక'యును వ్రాసి చేర్పఁబడినది. అందు అవసరము లని తోఁచినవానికిమాత్రము కొన్నిటికి అర్థము, కొన్నియెడల భావార్థము ఈయఁబడినది. దీనివలన నేమైన ప్రయోజనముకలిగినయెడల టీకాకరణము ప్రయోజనకారి కాఁగలదు.

బ్రహ్మశ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారు నాయం దభిమానముంచి, యీకార్యమును నాకప్పగించి గౌరవించినందుల కనేక కృతజ్ఞతాభివందనములు. దేవదేవుఁడు శ్రీశాస్త్రులుగారి కాయురారోగ్యసౌఖ్యములనొసంగి యితోఽధికముగ ఆంధ్రవాఙ్మయ సేవనుచేయుట కనుగ్రహించునుగాక!

బుధవిధేయుఁడు,

బులుసు వేంకటరమణయ్య,
ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు,
కెల్లెట్ హైస్కూలు, మద్రాసు.

మదరాసు.
10-6-1949.

# మలిపలుకు

ధూర్జటిమహాకవి కృష్ణదేవరాయలయాస్థాన మలంకరించిన యష్టదిగ్గజకవులలో నొకఁ డనుట నిర్వివాదాంశము. అతని కృతులు శ్రీకాళహస్తిమాహాత్మ్యము, కాళహస్తిశతకమనునవి రెండుమాత్రమే యైనను కవి శ్రీరాయలవారిచే

'స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేల గల్గె నీ
యతులితమాధురీమహిమ'

యని పొగడ్తనందినట్లు లోకవిదితము. శ్రీరాయలయాస్థానమున ఆంధ్రభాషాకవులేగాక తమిళ కన్నడ సంస్కృతకవులును వెలసియుండినట్లు చారిత్రికులు నిశ్చయించియున్నారు. అందఱిలోను మాధురీమహిమ ధూర్జటిపల్కులకే కలిగెను. అట్టి మహనీయునిఁగూర్చిన యంశములు మన కాతనికృతియందు లభింపనందున నతని మనుమలు రచించిన కృష్ణరాయవిజయము, శ్రీకాళహస్తిమాహాత్మ్యములనుండి కులగోత్రాదివిషయముల నెఱుఁగఁగలిగితిమి. కాని వారును అంతకంటె విపులవిషయములు ప్రస్తావించినవారు కారు. ఇఁక నతని కాళహస్తిశతకమును పరికించిన నతని జీవితాంశము లనేకములు సువిదితములగును. ఏల యన: "తమ యిష్టదైవములఁగూర్చి యప్పుడప్పుడు ఆశువుగఁ గవులు తమతమ కష్టసుఖములు నివేదించుకొనుటయు, నట్టివి యతని జీవితకాలమునుబట్టి యొక శతకమునకు మించియో తక్కువయో యుండుటయు" సహజమనియు ననుభవజ్ఞులకు తేటపడిన యంశమే. కావున శతకమునుండి

మనము గ్రహింపఁదగు నొక కొన్నియంశముల నిట ప్రస్తా వించెదను.

తనశతకమున ధూర్జటి సుఖదుఃఖాది ద్వంద్వములకు పొంగిపొరలెడు హృదయావేదనను నిర్భయముగా చాటి యున్నాఁడు. ఆత్మవంచనకును లోకవంచనకును పాలుగాక ఆత్మభావమును విస్పష్టముగా చాటుటయే భావకవిత్వ మగు నెడల నీ కాళహస్తిశతకమునకు మించిన భావకవిత్వ మాంధ్ర భాషలో నింకొకటి కానరాదు. మఱియు ప్రవృత్తినుండి నివృత్తికి, భోగమునుండి త్యాగమునకు నీకవి మరలుటకై యెంతో ప్రాధేయపడుచు తత్సిద్ధికి స్వశక్తిచాలమి ఆఫలము ననుగ్రహింప వలసినదిగ భగవంతుని యాతురముతో కవి పలుపద్యముల వేఁడి యున్నాఁడు. ఇది యీశతకమందలి పరమార్థము. రోసీరోయని కామము, విడిచీవిడఁవని విరోధము, తిరస్కరించుచునే యాక ర్షించు రాజద్వారములు మున్నగు బంధములఁ జిక్కి వానినుండి తెగతెంపులు చేసికొనుటకై కవి యొనర్చిన అంతర్యుద్ధములు అంతర్యాగములతో నీశతకము నిండియున్నది.

ఇందు కవి యాత్మసంస్కారమునకై మొఱపెట్టుకొనెనే గాని లోకమును దిద్దుపూనిక లేదు. ఆత్మదోషముల వెలిపఱు చుటయే గాని లోకమునకు ధర్మోపదేశయత్న మగుపడదు. ఆ యత్నమున నతనికి ఈశ్వరునిముఖమే తోఁచుచుండెను గాని తన తోడిలోకము చూపట్టలేదు. సర్వాంతర్యామియు సర్వ సాక్షియు నగు భగవంతునకు తన తప్పులన్నియు మున్నే యెఱుకపడియుండుటచే తనతప్పుల నొప్పుకొని వానికై ప్రాయ

శ్చిత్తము చేసికొనుటయే తనవిధి యనుభావము ప్రకటించుట కితఁడు జంకలేదు. ఇట్లు ఋజుభావములను వ్యక్తీకరించుటలో నితని కితఁడే సాటిగ కన్పట్టును.

ధూర్జటిరచనలు రెండును శివపరములే యగుటచే నితఁడు వీరశైవుఁడని తోఁచును గాని సోమనాథునివంటి వీరశైవుఁడు కాక శివారాధనపరుఁడైన అద్వైతి యనుట నిస్సంశయము. ఈయంశమున నితఁడు శ్రీనాథు ననుకరించును. ఇతని కావ్యరచనాపద్ధతియు భాషాసరణియు శ్రీనాథుని పోకడలకు ప్రతిబింబము లనవచ్చును. శ్రీకాళహస్తిమాహాత్మ్యము భీమేశ్వరపురాణమువంటిది. త్రిలిఙ్గదేశ మనునామమున కాధారమయిన దాక్షారామమును ప్రశంసించునది భీమేశ్వరపురాణము; శ్రీ కాళహస్తిని వర్ణించునది శ్రీకాళహస్తిమాహాత్మ్యము. రెండును శివపారమ్యమును బోధించు క్షేత్రమాహాత్మ్యములు. రెంటను భక్తిపారవశ్యమున కవులు చేసిన స్తుతులే చెవులకు పండువు గావించును. శ్రీనాథుఁ డెంత యోగశాస్త్రవేదియో ధూర్జటియు నంతే. బ్రహ్మవిద్యయం దిరువురును నిష్ణాతులు. ఇరువురును ఆమరణాంతము సంసారతాపత్రయమున చిక్కియుండినవారే. శ్రీనాథుఁడు తన బ్రహ్మవిద్యాపాండిత్యము నాయాపరిభాషలతోనే తన గ్రంథముల చొప్పించెను గాని ధూర్జటి యట్లుచేయక కథాసందర్భముల నారహస్యముల చొరనీయలేదు. కనుక నీ కాళహస్తిమాహాత్మ్యకథ సందర్భోచితముగా పరిణామ మందియున్నది.

శ్రీకాళహస్తిమాహాత్మ్యము నాలుగాశ్వాసముల కావ్యము. ఇందున్న కథలలో మూఁడవయాశ్వాసములోని

తిన్ననికథయు నత్కీరునికథయు, నాలవదానిలోని వేశ్యకన్యా వృత్తాంతమును అతి మనోహరముగ రసవంతములుగా వర్ణింపఁబడినవి. ఈకథలలో కవి తనకుఁ గల లోకజ్ఞానమునంతయు కుమ్మరించియున్నాఁడు. ఇట్లు మతేకవియును చేసియుండలేదు. లోకముతోఁడి సునిశితపరిచయము రాజాస్థానములందే మెలఁగుచుండు కవులయందుఁ గన్పట్టుట యరుదు. అసలే యుండదనుటయు సత్యదూరముగాదు. ధూర్జటి నగరవాసియైనను అడవి నడుమ నివసించు కిరాతుని జీవితచరిత్రమునంతయు విపులీకరించినాఁడు. తిన్ననికథలో నితఁడు ఆటవిక జీవితము నెంతో స్వాభావికముగ నిజమునకు దూరముకాక యథాస్థితిగా చిత్రించినాఁడు. వారి యాచారవ్యవహారములు, వారి వేష భాషలు, వారి యాహారవిహారములు, పాఁడిపంటలు, కొలుచు దేవతలు మొదలగు విషయములెల్ల కవి మనయెదుట నిల్పఁ గలిగినాఁడు. ఇఁక వేశ్యాకుటుంబ వర్ణనను పరిశీలించినచో నది ఆటవిక కుటుంబవర్ణనమున కేవిధమునను తీసిపోవునది కాదు.

వేశ్యమాత కేవలము ధనముగడించుటకనియే యాఁడుపిల్లను పెంచుననియు, ఆపిల్లకు ధనసంపాదనమార్గ మొక్కటి మాత్రమే బోధించుననియు, వంచనాబుద్ధిని ఉగ్గుపాలతోడనే పెట్టుటతో ఋజువర్తనమును త్యజింపవలసిన గుణముగా తలఁచుననియు వర్ణించి కవి తన లోకానుభవమును వెల్లివిరియించియున్నాఁడు.

కేవల మీవర్ణననుబట్టియు, శతకమందలి కొన్ని నుడుల నాధారముచేసికొనియు కవి వేశ్యాలోలుఁడను వాదమును లేవఁదీసి కొందఱు ఊర్జితపఱచుచున్నారు.

ఇత్వసంధులు, రేఫద్వయమైత్రి, ఇంచుయతులు, అఖండ యతులు మున్నగునవి యితనికి సమ్మతము లనియే యూహింపఁ దగియున్నది. ఇతఁడు అతి స్వతంత్రుఁడైన కవి. అవశముగా నోట వెలువడు స్తుతివాక్యములను హాని యిచ్చుచోఁ ప్పాన పోనిచ్చెను. కాని వ్యాకరణకశమునకు జడియలేదు. కనుక నే కవిత్వమును ద్రాక్షాపాకమున ముంచి మృదుపదసంయుతము చేసి ధారాపాతముగ భక్తిరసము కురిపించి దానిని చూఱఁ గొననిచ్చినాఁడు. ఇతని రచనలు రెంటిని చదువువారికి నితని భాషాస్వతంత్రత,శివునకు హృదయార్పణము, రసభావస్ఫూర్తి, సంసారవిషయములపట్ల విరక్తి అనువానిచే నవి వాఙ్మయమున నెంతటి యుత్తమస్థాన మలంకరించియున్నవో వేఱుగాఁ బలుక నక్కఱలేదు.

బహుకాలము మాఱుమూల నెటనో దాఁగియుండిన యీ లఘుటీకను వెలుఁగులోని కీడ్చి పరిష్కర్తకృతజ్ఞతకును, పరిష్కర్తతోపాటు నా యల్పభాషాసేవ సైతమిందుఁగూర్చి నా యభివందనములకును పాత్రులై, ఇతోధికముగా సంస్థ యభివృద్ధియే తమకర్తవ్యముగ భావించు శ్రీవావిళ్లసంస్థనిర్వాహకు లిటులే భాషాసేవకు ముందంజవేయుచుందురుగాక యని వేఁడుచున్నాఁడను.

బుధవిధేయుఁడు,
వేదము లక్ష్మీనారాయణశాస్త్రి.
9-9-1966.

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము


| విషయము. | | పుట. |
|---|---|---|
| షష్ఠ్యంతములు | ... | 4 |
| శ్రీకాళహస్తిపురవర్ణన | ... | 5 |
| మాయాజంగమస్వరూపము | ... | 9 |
| కపటజంగమరూపియైన శివుఁ డొక దాసియింట విడియుట | ... | 10 |
| దాసిని రాజు శిక్షించుట | ... | 12 |
| శిక్షిత దాసిని శివుఁ డనుగ్రహించుట | ... | 14 |
| మాయాజంగమును యాదవరాజు దర్శించుట | ... | 15 |
| శివుఁడు యాదవరాజునకుఁ గాళహస్తిమాహాత్మ్యం బుగ్గడించుట | | 17 |
| వసిష్ఠునకుఁ బరమేశ్వరుఁడు ప్రసన్నుఁ డగుట | ... | 18 |
| ప్రమథులు పార్వతి భూమికి వచ్చుట | ... | 25 |
| ఈశ్వరవిహారము | ... | 26 |
| సువర్ణముఖరీజననప్రకారము | ... | 27 |


## ద్వితీయాశ్వాసము


| | | |
|---|---|---|
| బ్రహ్మకు సరస్వతివలనఁ గుమారు లుద్భవిల్లుట | ... | 45 |
| బ్రహ్మకొడుకుల దుష్టచేష్టలు | ... | 51 |
| బ్రహ్మకు సుగ్రుఁ డను కొడుకు కలుగుట | ... | 53 |
| బ్రహ్మపంపున సుగ్రుఁడు తన యన్నలగు రక్కసులఁ జంపుట | | 54 |

| విషయము. | పుట. |
|---|---|
| బ్రహ్మ పుత్రహత్యాదిదోషపరిహారార్థము తపంబు సేయుట ... | 61 |
| ఈశ్వరుఁడు ప్రత్యక్షమై బ్రహ్మకు వరమిచ్చుట ... | 64 |
| బుభువునిజననము ... | 65 |
| చెలఁదిపురుగు శివైక్యముఁ బొందుట .. | 68 |
| కాలసర్పము నేనుఁగును శివసాయుజ్యము నొందుట ... | 72 |

## తృతీయాశ్వాసము

| | |
|---|---|
| కన్నప్ప యను తిన్నని జన్మభూమివర్ణనము ... | 87 |
| తిన్ననిజననము ... | 92 |
| తిన్నఁడు విలువిద్య నభ్యసించుట ... | 97 |
| తిన్నఁడు పరిజనంబులతోడఁ గూడి వేటకు వెడలుట ... | 101 |
| స్వప్నముచేతను వేటమిషను నీశ్వరుఁడు తిన్నని వశీకృతుం జేసికొనుట ... | 103 |
| తిన్నఁడు శివలింగమునకు సేవఁజేయుట ... | 105 |
| తిన్ననిఁ గని బోయలు దుఃఖించుట ... | 107 |
| తిన్నఁడు శివుని కనుదినంబు నాహారం బొసంగుట ... | 110 |
| శివబ్రాహ్మణుఁ డాలయమందలి రోఁతలఁ గని చింతించుట ... | 111 |
| శివుఁడు తిన్ననిభక్తిని శివబ్రాహ్మణునకుఁ జూపుట ... | 113 |
| తిన్నఁడు పరమేశ్వరు నేత్రరోగమునకుఁ జికిత్సలం జేయుట | 115 |
| శివుఁడు తిన్ననికిఁ బ్రత్యక్షమగుట ... | 117 |
| నత్కీరుని కథ, మధురాపురవర్ణన ... | 119 |
| శంఖఫలకము పుట్టిన క్రమము ... | 122 |
| దుర్భిక్షవర్ణనము ... | 123 |

| విషయము. | | పుట. |
|---|---|---|
| ఈశ్వరునిపద్యముఁ గొని చనిన వారద్విజుని నత్కీరుఁడు తూలనాడుట | ... | 125 |
| ఖిన్నుఁడైన బ్రాహ్మణుని శివుఁ డూరార్చి నత్కీరునితో వాదునకుఁ గడంగుట | ... | 126 |
| శివుఁడు నత్కీరుని శపియించుట | ... | 128 |
| శివుఁ డిచ్చిన శాపమునకు నత్కీరుఁడు దుఃఖించుట | ... | 129 |
| నత్కీరునితీర్థయాత్ర | ... | 130 |
| నత్కీరుఁ డొక భూతమునకుఁ జిక్కుట | ... | 134 |
| నత్కీరుని సుబ్రహ్మణ్యస్వామి రక్షించుట | ... | 136 |
| నత్కీరుఁడు సాయుజ్యము వడయుట | ... | 138 |

## చతుర్థాశ్వాసము

| | | |
|---|---|---|
| మధురాపురవర్ణనము | ... | 141 |
| మాణిక్యవల్లి యను వారవనిత శివభక్తి పారవశ్యలగు కూఁతుల నిర్వురం గని పెంచుట | ... | 142 |
| దాసికూఁతులచేష్టలు | ... | 146 |
| వేశ్యమాత కూఁతులకు వారధర్మ ముపదేశించుట | ... | 147 |
| వేశ్య లిర్వురును వారధర్మమును రోయుట | ... | 151 |
| కూఁతులవిరక్తికై వేశ్యమాత చింతించుట | ... | 152 |
| ఈశ్వరుఁడు త్రోవలో వేశ్యలం గాపాడుట | ... | 153 |
| వేశ్య లిర్వురును గాళహస్తికిఁ బయనం బగుట | ... | 155 |
| దొంగల యత్నంబులనెల్లఁ బరమశివుఁడు వారించుట | ... | 158 |
| వాలి పూజించిన శివలింగకథ | ... | 159 |

| విషయము. | | పుట. |
|---|---|---|
| సూర్యాస్తమయాదివర్ణనము | ... | 162 |
| దొంగలు విఫలమనోరథులై చనుట | ... | 165 |
| ఇద్దఱు స్త్రీలును సాయుజ్యంబు వడయుట | ... | 167 |
| వారకన్యలు ముక్తినందిన వార్త నశరీరి ప్రకటించుట | ... | 176 |
| చెలఁది పూర్వజన్మము వృత్తాంతము | ... | 179 |
| కాళంబు పూర్వజన్మము కథ | ... | 181 |
| హస్తి పూర్వజన్మకథ | ... | 185 |
| తిన్నని పూర్వజన్మవృత్తాంతము | ... | 187 |
| లఘుటీక | ... | 195 |

శ్రీరస్తు

# శ్రీకాళహస్తి మాహాత్మ్యము

## ప్రథమాశ్వాసము



విద్యానిధి యై మహామహిమచే
జైనై ర్వసిష్ఠాజ లూ
తా వాతాశన సామజాటవిక గో
త్రాదేవ [1]నత్కర రా
జీనాత్మీయుగ యాదవాధిపులకు
న్నైశ్రేయస్కరం బై నయా
ర్యావామాంగము దివ్యలింగము మదీ
యాభీష్టము ల్సల్పెడున్. 1

సీ. హిమధరాధరమండలేశ్వరకులపాలి
కామణితనువల్లి కాప్రసూన
యసితకంధరసింధురాజనాంబరఘోర
గంధబంధన[2]కరగండలహరి
సంతతశివ[3]భక్తిసామరస్యజ్ఞాన
సారమరందనిష్యందధార

1. సత్కర. 2. కథా. 3. శక్తి.

పరమహంసోత్తంసభావభృంగవ్రాత
తన్మయావస్థ[1] ప్రదానకేళి

తే. నిఖిలవిద్యారహస్యవాణీపరాగ
[2]పాలికాపూరితాఖండపద్మజాండ
పేటి యై యొప్పుచంద్రార్ధజూటకోటి
[3]జోటఁ గొల్చెద జ్ఞానప్రసూనకలిక. ౨

శా. వ్యాకీర్ణస్థితి నాలకించి నకులీవారాహు లూటాడఁగా
నాకారాక్షరమంత్ర[4]వర్ణముల కాద్యం బైన వర్ణంబుతో
నేకగ్రీవము [5]నేసి పల్కెడుతురంగేంద్రంబుపై నెక్కువి
ద్యాకల్పుం బ్రణుతింతు భైరవుని లీలాహార్యలీలాలయున్

సీ. కాసరాసురరాజకంఠనిర్గతరక్త
పంకంబు శ్రీపాదపద్మలాక్ష
చండముండాహవసంభ్రమస్తనజాత
ఘర్మవాఃకణరాజికంఠమాల
రక్తబీజాదిమర్దనసమయాట్టహా
సము మోమునకు లోధ్రసుమరజంబు
[6]శుంభనిశుంభవక్షోవీరసంహార
వేళఁ గప్పిన ధూళి మేలు[7]ముసుఁగు

తే. గాఁగ నేదేవి వీరశృంగారమూర్తి
యగుచు శోభిల్లు నట్టిదుర్గాంబఁ గొలుతుఁ

---

1. ప్రధానకేళి. 2. పాలికాపూర. 3. యొంటిఁగొల్చెద. 4. మర్మముల. 5. ఁజేసి. 6. శుంభనిశుంభ. 7. ముసుకు.

గనకముఖరీసమాఖ్యగంగాప్రతీర
హాటకాచలతుంగశృంగాగ్రగేహ. 4

శా. సద్గ్రంథత్వపహారకర్తనవ[1]దీక్షావేళ బ్రహ్మాస్వభూ
భర్గుల్ విఘ్నములేక సాగుటకునై ప్రార్థింపఁగాఁ దత్క్రియా
దౌర్గత్యంబు నడల్చి సంస్మరణమాత్రం బ్రాప్తిఁ గావించు దృ
క్ష్మిద్గచ్ఛత్కరుణాకదంబుఁ గొలుతున్నిత్యంబు హేరంబునిన్.

క. ఈరీతి నిష్టదేవస
మారాధన మాచరించి యస్మత్కృతిక
న్యారత్నమునకు విద్యా
పారంగతుఁడైన [2]వరునిఁ బరికించి మదిన్. 6

శా. వాగర్థంబులు శ్రోతృవక్తలు జగద్వంద్యాంశు నద్వైతవి
ద్యాగోష్ఠిన్ వివరింప నీశ్వరుఁడ కాఁడా మత్ప్రబంధాధిప
త్యాగణ్యార్హుఁడు వేఱొకండు గలఁడే యామాట లేలం
చుఁ జేతోగ[3]మ్యుం డగు కాళహస్తిపతి నాథుం గా సమ
ర్థించితిన్. 7

ఉ. ఈశుభకావ్యరత్నమున కీశు [4]నధీశునిఁ జేసినన్ మహా
దేశికసార్వభౌముఁడు మదిం బ్రముదంబు వహించి ధూర్జటీ!
నీశివభక్తి కావ్యసరణిం గడు ధన్యతఁ [5]బొంద నవ్యభా
షాశతధానిగుంభనరసస్థితి నొప్పు దలిర్పఁ జెప్పుమీ. 8

క. అని గురుఁ డనుపమకరుణా
వనధి యనుగ్రహముసేయ వరమానిమనో

1. రక్షావేది. 2. హరుని. 3. గమ్యుండు. 4. నధీశ్వరు.
5. నొంది, నొందె.

వనజవనరాజహంసము
ననుభవగోచరుఁ గృతీశు నభివర్ణింతున్. 9

మ. తనయిల్లా లఖిలైకమాత, తనసంతానంబు భూతవ్రజం,
బనులాపంబులు వేదము, లనపిహారాగారము ల్మానిహృ
ద్వనజంబు, లనసేవకు లమలజాతశ్రీధరు లాఁ జెలం
గిన [1]దేవోత్తము నమ్మహాత్ముఁ దరమే కీర్తింపఁగా నేరికిన్?

షష్ఠ్యంతములు

క. ఏతత్కల్యాణగుణో
పేతున కఖిలప్రపంచ భిన్నాభిన్న
జ్యోతికిని నాదబిందుక
ళాతీతేశునకుఁ గాళహస్తీశునకున్. 11

క. బహుముఖసువర్ణముఖరీ
లహరీశీతలశిలాతలస్థితమునిహృ
ద్బహిరబహిఃపరిపూర్ణున
కహరహరుదితునకుఁ గాళహస్తీశునకున్. 12

క. పంచేంద్రియ[2]మత్తద్విప
పంచాస్యకిశోరమునకు భవఫణిఖగరా
ట్పంచాక్షకోటికి సదయదృ
గంచలనటనునకుఁ గాళహస్తీశునకున్. 13

క. జ్ఞానప్రసూనకలికా
పీనకుచగుళుచ్ఛమత్త భృంగమునకు సం

1. వేదోక్తము. 2. విషయ.

ధ్యానటనపటువిహారమ
హానటహంసునకుఁ గాళహస్తీశునకున్. 14

క. సతతత్రైగుణ్యవశా
చ్యుతకేళిజగత్సృష్ట్యుత్సృష్టిర్నిర్మాణ
స్థితిభంజన[1]కర్తృదునకు
హతభవపాశునకుఁ గాళహస్తీశునకున్. 15

వ. [2]సమర్పితంబుగా నాయొనర్పం బూనిన శ్రీమత్కాళహస్తి [3]మాహాత్మ్యం బను మహాప్రబంధంబునందుఁ దదీయ కథా సంవిధానంబునకుఁ బ్రధానస్థానం బైన మహాపురం బెట్టి దనిన.

—— శ్రీకాళహస్తిపుర వర్ణన ——

సీ. సంసారపారదోచ్చాటనానలకీల
కలుషసంచయతామ్రగంధకంబు
కామలతామూలకందకుద్దాలంబు
సంకల్పపాషాణటంకముఖము
రాగశాలివనాంకురకడంగరీయంబు
శంకాకళంకభు[4]జంగనకులి
నవమనోగోరాజనాసికారజ్జువు
కోపనేక్షణవిశిఖోపలంబు

తే. దివ్యదేశికహంసోపదిష్టమార్గ
నిర్గుణధ్యానసంధాన నిరుపమాన

---

1. కరణునకును. 2. అనేక దండనమస్కారము లాచరించి, నా రచియింపం బూనిన. 3. మహాత్మ్యంబను కథావిధానంబునకుఁ బ్రధానస్థానం బైన పురం బెట్టిదనిన. 4. జగనకులము.

సౌఖ్యసంపన్న సాధక జననివాస
మమృతలింగాకరము కాళహస్తిపురము. 17

శా. ఆడం జిత్రము వాడవాడ ఘనకుడ్యస్వర్ణరత్నద్యుతుల్
చూడం జూడఁగ షణ్ముఖీకరణతేజోరూఢి చిత్తేక్షణ
శ్రీడాదుస్తరమార్గసౌఖ్యరసవార్ధిం దేల్చుఁ దత్పట్టన
క్రోడక్షోణి నటన్న నున్నపురముల్గొండాట కర్హంబులే?

మ. అతులైశ్వర్యపరంపరావిలసితంబై నట్టి తత్పట్టన
[1]ప్రతిబింబం బనఁ జంద్రకాంతరచిత ప్రాకార మొప్పారు న
ద్భుతమాయాబహువిభ్రమభ్రమితవస్తువ్రాతలోకోదయ, స్థితి
లోఁగొన్న శివుం డనంగ హృదయాచింత్యప్రభావంబునన్.

మ. జనలోకోన్నత మైన తత్పురము తూచా తప్ప కుండంగ వ
ర్ణన సేయన్ వశ మౌనె? గీటమునకైనం జక్రికైనన్
మదాంధునకైనన్ బహుజీవహంతకయినన్ దుర్వాసనం
బాసి మోక్షనిధిం గొల్ల గొనంగవచ్చునఁట పైజాడన్ విలో
కించినన్. 20

మ. ఎలదోఁట ల్వనము, ల్వధూకుచము లద్రీంద్రంబు లాకం
టికి, న్ఫలము ల్వాతెర లంగజాగమకళాబంధంబు లిచ్ఛా
సనంబులు కోపంబునఁ బాయుటల్ తపము సంభోగంబు
కైవల్య మందుల లీలావతి నుండు మానవుల కెందుం గాన
మీచిత్రముల్. 21

చ. అమితములైన జంతువుల కక్కడ నుత్తమ మధ్య మాధమ
త్వము లరయంగఁ గాన మపవర్గరమాసతిఁ బెండ్లియాడుచో

1. ప్రతిబింబంబుగ.

సమతయె కాని తత్పురముసాటిగ నన్యపురంబు లెన్నఁగా
నమరు నటన్న హస్తిమశకాంతర మింతియ వాసి చూచినన్.

సీ. నైజంబు లగు నిత్యనైమిత్తికంబులు
నడుపుచో బ్రహ్మార్పణంబు సేసి
సంగరహితబుద్ధి శాంతనవస్ఫూర్తి
వైరివర్గంబు సంహారమాడి
ప్రబలమహార్థప్రభాసమానస్థితి
కోశంబు లుండెడు కొలఁదు లరసి
యాతపశీతవాతాదుల సమముగా
నాత్మప్రయత్నంబులందుఁ దలఁచి
తే. సంచరింతురు బ్రాహ్మణ క్షత్ర వైశ్య
శూద్రు లవ్వీట సంతతభద్రహృదయ
నిరుపమానందవిహరణోన్నిద్రు లగుచు
రాజయోగైకసామ్రాజ్యరతులభంగి. 23

చ. పరిచితబంధనైపుణి నపారకళానుభవప్రసక్తి నా
దరసవివేకసంపద సదాశుకవాక్యసుధానుభూతి మో
హరహితవృత్తిఁ బ్రస్ఫురదనంగరహస్యవిచారబుద్ధి న
ప్పురమునఁ గామినీజనులు పొల్తురు యోగిజనంబుపోలికన్.

మ. అరగంటం గనుగొంట మందగతిఁ బూర్ణాహంకృతిం బ్రార్థనా
కరభుక్తిస్థితి ముక్తలోకభయశంకావృత్తి నున్మత్తన
వ్యరతి న్సత్త్వసమగ్రత న్మదితపద్మాభ్యున్నతి న్గంధమం
ధరదంతావళకోటి యొప్పు నవధూతప్రక్రియం దత్పురిన్.

క. ఆపురి తేజులవేగ
వ్యాపారము గెలువ నోప మనుసిబ్బితిఁబో
చాపలవిరహితసౌఖ్యం
బాపాదించుకొను మానవావళిమనముల్. 26

వ. అప్పురంబున కధీశ్వరుండు. 27

సీ. తనయాజ్ఞ జంగమ స్థావరజంతుసం
తాన మెన్నఁడు జవదాఁట వెఱవఁ
దన తేజమున నర్బుదన్యర్బుదోపర్బు
ధార్క చంద్రములైన నడఁగిపోవఁ
దనదు శక్తిత్రయంబున సమస్తప్రపం
చంబుల కభివృద్ధి సంభవిల్లఁ
దన మహాప్రకృతి పెద్దల చిత్తవృత్తికి
నగణితాశ్చర్యంబు నావహింపఁ
తే. జెలఁగె విశ్వేశ్వరుఁడు రాజశేఖరుండు
కమఠ శరభ కిటి పరివృఢ కరటికుధర
విషధరాధీశ హరి[1]ముఖ వివిధభువన
భారవహులకుఁ [2]బ్రాణంబు ప్రాణ మగుచు. 28

క. శ్రీకాళహస్తినాయకుఁ
డీశైవడి జగము లెల్ల నేలుచు నొకనాఁ
డాకస్మికంబ యాదవ
భూకాంతునిభక్తిఁ [3]దెలియఁ బూని కడంకన్. 29

---

1. ముఖ్య. 2. ద్రాణంబు. 3. జూడఁబూని.

### మాయాజంగమస్వరూపము

సీ. అడుగునెత్తమ్ముల నపరంజిపావాలు
కరమునఁ గేదారకంకణంబు
[1]బంగారువ్రాఁతచెఱంగులగోణాము
గళమున రుద్రాక్షకంఠమాల
యొక [2]కేల భసితభస్త్రికతోడిబెత్తంబు
సందిగట్టిన తరుణేందుధరుఁపు
మాణిక్యరుచుల[3]యొడ్డాణంబు భూతిపైఁ
బెట్టినకస్తూరి బిళ్లబొట్టు
తే. సార్వకాలికతాంబూలచర్వణార్ద్ర
రాగసౌభాగ్యమునఁ బద్మరాగమణులఁ
దృణముగాఁ జూచుదంతపంక్తియును గలిగి
యంగజారాతి యొకమిండజంగ మగుచు. 30

క. ఆరాజునిజపురం బగు
నారాయణవనముఁ జేరి నానాజనముల్
గారవమునఁ గనుఁగొన నొ
య్యారంబున [4]రాజవీధియందుఁ జరింపన్. 31

మ. తన సౌందర్యముఁ జూచి కామశరసంతాపంబునుం బొందకుం
డినకాంతామణిఁ దాల్మిదూలని వధూటిం గౌఁగిలింపం దలం
పని శంపాలలితాంగిఁ బోటులకుఁ జెప్పంబోని పంకేరుహా
ననఁ గీర్తింపని లేమ మందునకునైనం గాన మూహింపఁగన్.

1. బంగారుప్రాఁత. 2. చేత. 3. యొడ్యాణంబు. 4. రాజవీథులందు.

కపటజంగమరూపియైన శివుఁ డొక దాసియింట విడియుట

శా. ఆవేళం బురపల్లవప్రకరనేత్రానందబాష్పాంబుధా
రావర్షాగమచంచలాలతిక దుర్వారప్రసూనాస్త్రతే
జోవైశ్వానరసామిధేని రశనాసూత్రస్థితస్వర్ణపే
టీవిన్యస్తకపర్ది యొక్కకలకంఠీరత్నమే తెంచుచున్. 33

చ. కపటకుమారజంగమవికారమునం జనుదెంచు శైలజా
ధిపుఁ గని భక్తిపూర్వకమతి న్శరణార్థి యొనర్చి యొక్కచేఁ
బ్రపదము లంటి తన్మృదులపాణిసరోరుహదత్తభూతి నిద్ద
పునుదుటం ధరించి ప్రమదామణి యిట్లనియెం బ్రియంబునన్.

సీ. బిజమాడు దేవరు నిజకృపాదృష్టిఁ జె
న్నారునాయిల్లు [1]బిడార మీకు
నాకు మీపాదార్చనము సేయ నడలింగ
మూర్తి చేకుఱె వచ్చి మూర్తమాడి
యొడయ చిత్తేశ నాయునికిని మజ్జనం
బాడి శివార్చన మూడఁబేకు
విచ్చేయుఁడు విభూతి వీడియంబందఁకో
జంగమస్వామి నా సదనమునకు
తే. నోగిరంబులు మంచివే లోగిరములు
నావటించెదఁ బదఁడు మీ రారగింపఁ
బ్రతిదినంబును జంగమార్చనము లేక
తనివుపడనొల్ల విజితకందర్ప యనుడు. 35

1. బిడారు.

శా. సంతోషించి మహాత్ముఁ డా లిది శివాచారైక సంశీల య
శ్రాంతాపాదితజంగమార్చనకళాసామర్థ్య కందర్పశు
ద్ధాంత శ్రీపరిహాసకృన్నిఖిలలోకాతీతసౌందర్య యి
క్కాంతారత్నము దీనిభక్తికి మనఃకంజంబు [1]రంజిల్లదే! 36

క. అని కాంతా! నీయింటికిఁ
జను దెంచెద నీదు గుబ్బచనుఁగొండలసం
దునఁ దెరు వెఱుఁగక తిరిగెడి
మన సను తెరువరికి దప్పి మాన్పంగలవే? 37

క. అనవుడు నోడమ్మని కిట్లను
వనజానన నీదు మనసు వచ్చినరీతిం
బనివినియెద మాటల కికఁ
బనిలే దీతలఁపు నాదు భాగ్యముగాదే? 38

ఉ. నావుడు సంతసిల్లిన మనంబున జంగమలింగమూర్తి పా
రావతకంఠి కోకిలవిరావయు ముందరఁ బోవఁ జంద్రికా
శ్రీ వెనువెంట నేఁగునల శీతమయూఖునిరేఖఁ బోలి నా
నావిధభోగ్యవస్తుకలనం దగు తన్నిలయంబుఁ జేరుచున్.

క. ఆజలజేక్షణ నేసిన
పూజలు గైకొనుచు మెఱుఁగుఁబోఁడి స్వదనాం
భోజమునఁ జిఱునగవులు
రాజిల్లఁగ సన్న నేసి రతి కెలయింపన్. 40

క. అంతకు మునుపే మరువిరి
కుంతంబుల[2]ఁ జిక్కువడ్డ కోమలి మిగులన్

1. రంజిల్లెడిన్. ముద్రితపాఠము. 2. నేటు-పా.

సంతోషమంది యొకయే
కాంతగృహములోని కరిగి యలరులసెజ్జన్. 41

ఉ. తానుఁ గుమారజంగమసుధాకరమౌళియుఁగూడిమాడి యిం
పైనరతిప్రసంగములు నర్ధనిమీలితనేత్రపద్మముల్
మాననిచుంబనంబులును మాటలచొక్కులు వీడివీడిపో
నీవికవుంగిలింతలు ననేకవిలాసములుం జెలంగఁగన్. 42

ఉ. ఎక్కడఁ బట్టినం గళల యిక్కువ లెక్కడ నోరు సోఁకినన్
జక్కెర లప్ప లేమనిన సారసుధారస మెట్టు లుండినన్
జక్కఁదనంబు పెన్నిధులు సంభ్రమ మొప్పఁగ నేమి నేసినన్
మక్కువచెయ్వులై మెఱయు మన్మథకేళి యొనర్చునంతటన్.

దాసిని రాజు శిక్షించుట

క. ఆనీలవేణి యాదవ
భూనాయకుఁ డారగింపఁ బోయెడువేళన్
దానయిపళ్లెర మీఁదియెడుదానఁ గదా
యనక తపసి తగులున నుండెన్. 44

క. భూపాలరత్న మంతటఁ
గోపంబునఁ బళ్లెరంపుఁ గోమలిఁ బిలువన్
బోపొందు పట్టి తెండన
నాపడఁతుకకడకు వేత్రహస్తులు కడఁకన్. 45

ఆ. [1]ఒకతెఁ బట్టఁ బలువు రుద్ధతి నేతెంచి
పిలువ నదరిపడుచు బెదరి లేచి
భయము రాజుకడకు రయమునఁ దివియంగఁ
దగులు తపసికడకు మగుడఁ దివియ. 46

1. ఒకరి.

సీ. వడిఁగొల్పి యొకకేల ముడిచిన క్రొమ్ముడి
గొబ్బునఁ గటిఁ జుట్టుకొన్న చేల
మొండొంటఁ బెనఁగొని యున్న హారంబులు
నిద్ర దేఱెడు నేత్రనీరజములు
వాడఁబాఱినతీఁగవంటి చక్కని మేను
చిన్ని కెంపులతోడి చిగురుమోవి
పిఱుఁదుభారంబున బెణఁకెడు పదములు
చను గవ వ్రేఁగున జడియుకౌను
తే. కలిగి కలఁగని మనముతోఁ గాళహస్తి
విభునిఁ దలఁచుచు దిక్కు నీవే యటంచు
సరగ నేతెంచి యూర్పులు సందడింప
రాజుముందర నిలిచె నంభోజవదన. 47

చ. నిలిచినఁ జూచి మండి ధరణీపతి నిష్ఠురభాష లాడి వే
ల్పుల [1]భ్రమయించు నీచిగురుఁబోఁడిమనోహరమూర్తి రేఖకున్
వెలితి యగుం గదా యనక వేగమ నిర్దయచిత్త [2]వృత్తిమైఁ
దల గొఱిగింపఁ బంచె నొకతప్పును గావరుగా నృపాలకుల్.

క. పంచిన జలదమువాసిన
చంచల యనఁ జంచరీకసంబంధవిహీ
నాంచితలత యన లజ్జా
చంచలగతి నేఁగి తపసి చరణంబులపై. 49

చ. పడి బిగువైనపీనకుచభారమువంక ధరిత్రి మోవకుం
డెడుతనువల్లితోఁ గటికిడెందముభూపతి చూచుచున్ వడిన్

1. బ్రమయించు. 2. వృత్తిమై.

వెడలుదృగంబుపూరములు వెల్లిగొనం బలవించె దైవమున్
దడవుచుఁ బంచమధ్వనుల తానము లీనుపికాంగనాగతిన్.

శిక్షితదాసిని శివుఁ డనుగ్రహించుట.

సీ. ఓయనురోదనం బోంకారమనువుగాఁ
గనుఁగవనీరు మజ్జనము గాఁగ
నిడువాలుఁగన్నులు నీలోత్పలములుగా
నెమ్మోము గ్రొత్తనెత్తమ్మి గాఁగఁ
గమ్మని నిట్టూర్పు గాడ్పు[1]ధూపంబుగా
దంతకాంతులు దీపతతులు గాఁగ
నధరోష్ఠ మమృతోపహారంబుగాఁ
బదాబ్జంబులఁ బడుట దండంబు గాఁగ
తే. నవధరించెనో కాక లోకైకవిభుఁడు
భక్తజనముల ముంగిటి పారిజాత
మేల యేడ్చెదు మానవే చాలు ననుచు
హస్తమస్తకసంయోగ[2]మాచరించి. 51

ఉ. ఎత్తిన నింద్రజాలగురుఁ డెత్తిన బర్హ మనంగ మన్మథుం
డెత్తినపువ్వువింటి మద మెత్తినతుమ్మెదపింఛనారి నాఁ
జిత్తజరాజ్యలక్ష్మి కభిషేకముసేయ శివుంపు[3]కాంతకై
యెత్తిననీలకుంభరుచిహిండనమో యన నద్భుతంబుగన్. 52

క. నెఱిమిగులఁ గలిగి నలుపై
తఱచై మదన ప్రతాప దావాగ్ని శిఖల్
మెఱయు నవధూమ మనఁగాఁ
దెఱవకుఁ గచభరము వచ్చె దేవునికరుణన్. 53

1. ధూమంబుగా. 2. మాచరించె, మాచరింప. 3. కాంతయై.

సీ. వచ్చిన నానంద వారిధిలోఁ దేలి
జంగమయ్య పదాంబుజముల కెరఁగి
యతని యానతి మీఁదఁ జతురలంకారంబు
లాచరించి మహేశ్వరార్చనంబుఁ
జేసి యొప్పటియట్ల చిత్తజాక్షుఁ బాసి
చనుదెంచు రతి యన మనుజ విభుని
సన్నిధి కేతెంచి సముచితస్థితి మ్రొక్కి
లేచిన నెఱఁగంచి చూచి విభుఁడు

తే. ఆజ్ఞ వెట్టించి చేతడి యాఱిదిపుడు
దీని కెబ్భంగి మోహనం బైన వేశె
కలిగె? నిమాయ మంగలికతన గాదె
వానిఁ బెమ్మన్నఁ గ్రమ్మఱ వనిత మ్రొక్కి. 54

ఉ. విన్నప మావరింపు పృథివీవర! మంగలి మాయ లేవియుం
బన్నఁడు మీమహాజ్ఞకొక భంగము గల్గునె? సర్వమంగళా
సన్నమనోహరాంగ మొక జంగమలింగము నాగృహంబులో
నిన్నటినుండియుం గరుణ నివ్వటిలన్ వసియించి యుండుటన్.

ఉ. నీకృపలేక భంగపడి నేఁ జని యాతని దివ్యపావనా
లీకయుగంబులం బడి ఫలించె మదీయ తపం బటంచు బా
ష్పాకులనేత్ర నై పొగుల నాకరుణాంబుధి నాశిరంబుపై
శ్రీకరపల్లవం బిడినఁ జిత్రముగాఁ జనుదెంచె వెంట్రుకల్.

మాయాజంగమును యాదవరాజు దర్శించుట.

వ. అనవుడుఁ గనుంగొనలఁ గొనలుసాగుకనలున కనుకూలంబైన
హృదయంబు సదయంబుగా నొనరించి చతురుదధివలయిత

క్షితిపతి కతిపయహితపురోహిత సచివసహితంబుగా నమ్మచ్చె
కంటి యింటికిం జని జంగమలింగంబు పదాంభోజంబులఁ
గరాంభోజముఖాంభోజముల బూజించి వినయవినమితోత్త
మాంగుం డై యి ట్లనియె. 57

శా. అయ్యా! యెక్కడనుండి యిక్కడికి లీలార్థంబు విచ్చేసినా?
రియ్యబ్జాననమీఁద నింతదయ మీ కెట్లయ్యె? నేఁ డెద్ది నేఁ
జెయ్యంగాఁ గల యూడిగం బని ప్రశంసింపన్ ఫణిగ్రామణీ
శయ్యాస్త్రుండు ప్రసన్నమూర్తి యయి రాజన్యు [1]న్విలోకిం
పుచున్. 58

ఉ. జంగమ[2]నామధేయము నిజంబుగ నిచ్చఁ జరించి కాళహ
స్తిం గల చోద్యము ల్బుధులు సెప్పఁగ వచ్చి కనుంగొన న్మహా
లింగనివాస మేమియును లేమికిఁ జొక్కి 'నమశ్శివాయ' సే
యం గల కార్య మెద్దియొకో యంచు విచారము సేసి యా
త్మలోన్. 59

ఉ. నీ కెనయైన భక్తవరునిం బొడగానను గాన నీకు నే
నీకథఁ జెప్పవచ్చి జలజేక్షణ భక్తికి మెచ్చి పాయఁగా
లేక నిను న్మహాకపటలీల వశీకృతుఁ జేసినాఁడ రా
జా! కల ధౌతశైలశిఖరాలయగేహముఁ గట్టఁ [3]బంపవే. 60

చ. అనవుడు భూవరుండు వినయంబున ని ట్లను మీర లానతి
చ్చినగతిఁ గాళహస్తి శశిశేఖరు దివ్యనివాసపంక్తి మో
హనముగఁ గట్టఁబంచెదఁ దదాదిపురాణకథాప్రసంగముల్
వినవలతుం గృపాంబుధి! సవిస్తరవైఖరిఁ జెప్పవే యనన్. 61

1. విలోకించుచున్. 2. నామధేయమ. 3. బంపరా.

శివుఁడు యాదవరాజునకుఁ గాళహస్తిమాహాత్మ్యం బుగ్గడించుట

మ. అగుఁగాకంచుఁ బ్రపంచభర్త యనుకంపాలింగితస్వాంతుఁడై
జగతీనాథునితోడ నిట్లనియెఁ దచ్చారిత్ర మాలింప నిం
పగు నేని న్వినుమమ్మహత్త్వము పురాణాబ్ధి న్మథింపంగఁ బూ
ర్ణగతిం బుట్టిన మోక్షలక్ష్మికి విహారస్థానమై యొప్పుగున్. 62

చ. జముదెస వెండికొండ ఘనసాల-మగస్త్యధరాత్మజాలలా
మము పరిఖాబ్ధి రాజ్యగరిమఁ బసవర్గసుఖంబు రాజరత్నము
పరమేశ్వరుండు వటునాథుఁడు కావలికాఁడు తన్మహత్త్వముఁ
గొనియాడఁగా హరిపితామహశేషుల కైన శక్యమే? 63

మ. శమనాశారజతాద్రి మేను శిర మాశంభుండు దుర్గాద్రి నీ
లమహాద్రుల్చనుదోయి పొన్నుఖరి లీలావేణి బాహాంఘ్రులిం
ద్రమయూరాఖ్యసహస్రలింగపదభారద్వాజతీర్థంబులై
యమరుఁ గా ముక్తివధూటి కన్నగరమాహాత్మ్యంబు సామా
న్యమే? 64

ఉ. అక్కడఁ దొల్లి సింహశరభాదిమృగాకులమై పునఃపునః
పక్కణనిక్వణశ్రవణబంధురమై శబరీకిరాతస
మ్యక్కృతమన్మథశ్రమవిహారమహాఖురళీకుడుంగమై
వాక్కబళీకృతేతరదవజ్వలనోగ్రవనంబు చెల్వగున్. 65

ఉ. వారణకుంభముల్శబరవల్లభు లమ్ముల వ్రక్కలించి ర
క్తారుణమౌక్తికావళిఁ గుచాంతరవీథు లలంకరించి నీ
రేరుహపత్త్రనేత్రలకుఁ బ్రీతి యొనర్తురు తీఱె నింక వ
క్షోరుహసామ్యగర్వ మిభకుంభయుగంబుల కంచు నచ్చటన్.

వ. అన్వర్థాభిధానంబు గజకాననం, బందుఁ దొల్లి వసిష్ఠునకుం
బరమేశ్వరుండు ప్రసన్నుండై నవిధంబుఁ జెప్పెద వినుము. 67

### వసిష్ఠునకుఁ బరమేశ్వరుఁడు ప్రసన్నుఁ డగుట

చ. తనయులు గాధినందనుకతంబున నూర్వురుఁ జచ్చినన్ మనం
బునఁ గడలేని దుఃఖమును బొంది వసిష్ఠుఁడు గొండ యెక్కి-
క్రూలినఁ బడకుండఁగాఁ బుడమి లేమ కరంబునఁ గందుకంబుఁ
బట్టినగతిఁ బట్టి నిల్పి మునిడెందము గుం దెడలింప నిట్లనున్.

శా. ఓ వెఱ్ఱీ! సుతు లందఱుం దెగిన నయ్యో దుఃఖివై యీ
గతిన్, జావం బుట్టువు దీఱునే? మనములోఁ సంసారమున్
రోసినన్, దేవోత్తమునిఁ బార్వతీరమణు భక్తిం గొల్వ
మీ చేకుఱున్, జీవన్ముక్తి యటంచు ధాత్రి యుపదేశింపం
బ్రమోదంబునన్. 69

క. నానాముఖవాసవలకుఁ
దానక మగుచున్న హృదయతామరస ముమా
జానికి నర్పించి తపో
ధీనుండై యతఁడు బ్రహ్మతేజము మెఱయన్. 70

సీ. శ్రీగురుపాదరాజీవ[1]యుగాతప
త్రచ్ఛాయ నెండకుఁ దల్లడిలక
తరుణేందుభూషణధ్యానసుధాధార
ఘోరక్షుధాబాధఁ [2]గుటిలపడక
సకలాంగభసితకంచుకమున విషపుచ్ఛ
విషధరాగుల భీతి వెగడు పడక
ఘనభక్తిగర్తనిర్ఘాతచిత్తస్తంభ
తను గేహమున గాలి దలఁకు లేక

---

1. యుగ్మాతపత్ర. 2. గుతిల.

తే. బహువిధోపాయములఁ జిక్కుపడక తిరుగు
ప్రకటసంసారమోహజంబుకముఁ బట్టి
యుద్ధవిడిఁ జంపుటకు రాజయోగజాల
మాసపడి చేసె నత్యుగ్రమైనతపము. 71

శా. దావానేకపముల్ గరాపహృతపాథఃపూరముల్ దెచ్చి యి
చ్ఛావృత్తిం జలకంబు లార్పఁ జమరీజాలంబు వాలంబులన్
వీవం గ్రోఁతులు పండ్లు గానుకలు గావింపం గిరాతాంగనల్
సేవ ల్సేయఁ జెలంగె నమ్ముని తపస్సింహాసనాసీనుఁడై. 72

శా. శుండాలార్భకషండగండతలఖర్జూభర్జనోపార్జనా
ఖండగ్రావము చండకుండలివిశంకవ్యాప్తి కింపైన శ్రీ
ఖండస్థాణువు శారికాశుకవిహంగవ్రాతపుం డ్రేఁకుకో
దండక్రీడకు నీడమై తప మతిస్థైర్యంబునం జేయఁగన్. 73

ఉ. వాకిటఁ గాచియున్న హరివారిజసంభవముఖ్యదేవతా
నీకమునుం దలంప కవనీధరజావరహాసలోలతం
బోక సమీపవర్తు లగుపుత్త్రులఁ జూడక భక్తభక్తిక
న్యాకరపంకజగ్రహణనైష్ఠికుఁడై కడుసంభ్రమంబునన్. 74

వ. మనోదృష్టిదురభివేశనిరవకాశీకృత దశదిశాప్రదేశం బగు
దివ్యప్రకాశంబునఁ బంచభూత పంచేంద్రియ పంచవిషయ
పంచక్లేశ పంచకోశాది పంచవర్గప్రాయ ప్రపంచంబుఁ బంచు
కొని భక్షింపం బాలువడిన పంచముఖంబులతోడి ముక్తకం
చుకాకారంబునఁ బంచశరభంజనుండు పరమశివలింగరూపం
బునఁ బశ్చిమాభిముఖంబునం బ్రసన్నుం డై. 75

మ. మునిచూడామణి! నీతపంబునకు సమ్మోదంబునం బొందినాఁ
డ నరుణ వేదము నీమనంబునకు నిష్టంబెద్ది నే నిత్తు న
న్న నిజస్వాంత విచింత్యమాన గిరిజానాథస్వరూపంబు వ,ల్కి
నయప్లైన భయంబు భక్తియుఁ బిసాళింపం బ్రహర్షంబునన్.

ఉ. కన్నులు విచ్చి చూచి పురఘస్మరు దిక్పరిపూర్ణదీప్తిసం
పన్నతరుణ భయాకులితపద్మనిరీక్షణుఁడై వడంకు పై
కొన్న శరీర మంతయు గగుర్పొడువంగఁ బ్రమోదసంభ్రమ
స్విన్నలలాటభాగమునఁ జేతులు సేర్చి మునీంద్రుఁ డిట్లనున్.

క. విశ్వపతి విశ్వకల్పక
విశ్వాత్మక విశ్వసాక్షి విశ్వంభర యో
విశ్వజనిస్థితిలయకర
విశ్వాధిక యనఁగ నిన్ను విందు మహేశా. 78

క. ఇరువదినాలుగుతత్త్వము
లరయఁగ నీయంద పుట్టి యణఁగెనన జగ
త్పరిపూర్ణుఁడ వన దృశ్యే
తరమూర్తి వనంగ విందుఁ దత్త్వజ్ఞులచేన్. 79

క. స్వానుభవంబునఁ దథ్యము
గానఁబడుఁగాని నీయఖండాద్వైత
జ్ఞానమయాకృతి బహుభా
షానైపుణిఁ [1]దెలియునది యశక్యముఁట శివా. 80

క. ఇటువంటి నిన్నుఁ దెలిసిన
పటుబుద్ధికి భవపయోధి పశుఖురజనితా

1. దెలియనది; తెలియవిది.

వటమాత్రంబఁట యిల్లా
లఁట ముక్తిప్రమద యిది మదభిమత మభవా. 81

తే. భక్తవత్సల కాలసంభవము లగుచుఁ
గాలభుక్తంబు లయ్యెడి కమలజాది
పదవు లే నొల్లఁ గాలంబుఁ బట్టి మ్రింగ
నోపు నీచిన్మయాకృతిఁ జూపు మీశ. 82

ఉ. ఆదిగృహస్థశేఖరుఁడ వైననిరూఢ భవతాపనక్షుధా
వేదనచేఁ దపఃకుతపవేళఁ గనుంగొనఁ గల్గె బ్రహ్మవి
[1]ద్యాదనభిక్షు నామహృదయం బనుపాత్రమునందుఁ బెట్టవే
యాదర మొప్పఁగాఁ బునరయావితవృత్తి సుఖంతు నీశ్వరా.

క. మన్ననతో నా కిచటఁ బ్ర
సన్నుఁడవై నట్ల ఘోర సంసారగదా
పన్నౌషధగుటికామహి
మోన్నతిఁ బూజఁగొనవయ్య యుగముల నెల్లన్. 84

క. [2]ఈ రెండును నామదికిం
గోరం దగినయవి నేత్రకోణములఁ గృపా
పూరంబు దొరఁగ నీవే
బోరన నన భక్తకల్పభూరుహ మగుటన్. 85

సీ. తన్నులోనుగఁజుట్టు కొన్న[3]వటచ్ఛాయ
నిజదీప్తి మొగులు నా నింగిఁ బర్వ

1. వి,ద్యాధన - ఇందు దథప్రాసమగుచు. 2. ఈరీతిని. 3. పటచ్ఛాయ.



బ్రహ్మా[1]సంహననామరద్రుపల్లవశిఖా
చ్ఛటలు నాఁ గుఱుచకెంజడలు దనర
[2]నీశ్వరోహ మ్మను నీరహస్యము దెల్పు
మురువున సుజ్ఞానముద్ర మెఱయ
మనము చిద్రసములో మునిఁగిన మాటాడ
నెఱుఁగఁడో యన మౌన మెసక మెసఁగ

తే. నమ్మహాలింగ మధ్యంబునందు నుండి
దక్షిణామూర్తిరూపంబుఁ దాల్చి శివుఁడు
యౌవనశ్రీసమేతుఁ డై యవతరింప
శక్తితండ్రియు నత్యంతభక్తితోడ. 86

క. పౌనఃపున్యప్రణతివి
ధానుం డై మ్రోల నిలువఁ దడయక కారు
ణ్యానూనాపాంగుం డై
యానిఖిలేశుఁడు భవార్తి యడఁచెడుకొఱ కై. 87

శా. చింతాంతస్థల మై ప్రకాశితజగచ్చిత్తక్రియాభోగ మై
భ్రాంతిప్రాపిత[3]జీవతాప్రథిత మై పద్మప్రసూత్యాదికీ
టాంతవ్యాపక మై మనోవిషయదూరానంద మై సంహృతా
ద్యంతం బై నరహస్యముం దెలిపి పాశానీకముం గోయుచున్.

వ. ఆక్షణంబ దక్షిణామూర్తియు నంతర్హితుం డయ్యె. వసిష్ఠుం
డును నిజప్రతిష్ఠిత దివ్య లింగోపకంఠంబున నకుంఠితానందం
బున నెందేనియుం దిరుగుచుండె పరమేశ్వరియుఁ బరమేశ్వర
చిరవిరహాభారంబు సహింపఁజాలక. 89

1. సంవనన. 2. నీశ్వరోహంబను. 3. జీవిత.

మ. ప్రమథు ల్గాంచనదండము ల్గొని చతుర్భాగంబులం గొల్వఁ
దద్రమణుల్ డగ్గఱి సేవఁ జేసి నడువన్ బ్రహ్మాచ్యుతుల్
దేవబృందముతో దూరమునందు ముందటఁ బిఱుందన్
సందడింపంగ వచ్చె మహాదేవి విమాన మెక్కి విభునిన్
సేవింప నచ్చోటికిన్. 90

ఉ. శంబరసూదనాహితుని శాసనముం దల మోచి వచ్చి లో
కాంబ తదీయసన్నిధిఁ బ్రియంబున నిల్చె సమస్తభక్తభృం
గంబులఁ జిన్మరందరసగాఢసుఖాత్ములఁ జేసి జ్ఞానసూ
నాంబ యనంగఁ గీర్తిఁ గని యవ్యయభూభువనైకవాసనన్.

క. ఆదిమదంపతు లీగతి
సాదరత వసిష్ఠతాపసాశ్రమవనలీ
లోదవసితు లగుటయు [1]సవి
షాదస్వాంతమున రజతశైలం బంతన్. 92

క. జననీజనకులఁ బాసిన
తనయునిగతి నొంటినుండఁ దగవగునె జగ
జ్జననీజనకుల హిమగిరి
తనయేశులఁ బాసి దీనతామతి ననుచున్. 93

శా. కైలాసం బగజేశులం గొలువ రాఁగా భక్తితో దేవతా
శైలంబుం జనుదెంచెఁ గూడి ధనదాశం బుట్టి జోడై యమా
శాలీలాగమనంబునన్ శశదినస్వాముల్ వియద్వీథి రాఁ
గాలం బిట్లగు నేలొకో యనుచు లోకం బద్భుతం బందఁగన్.

క. ఆదంపతులకుఁ బూర్వది
శాదేశంబున విహారసదనం బగుచున్

1. సువిషాద.

దాదక్షిణకైలాసము
నాదేవ[1] ప్రమదసేవన ప్రథ నిలిచెన్. 95

క. ఆగిరివరునకు నుత్తర
భాగంబునఁ బసిఁడికొండ భైరవ దుర్గా
నాగ ముఖ రక్షితం బై
యోగిజనాకీర్ణ వైభవవోన్నతిఁ దనరెన్. 96

మ. అణిమాదిప్రదమై పురాణకథితంబై మోక్షదం బైన ద
క్షిణకైలాసమువిూఁదికూరిమి వితర్కింపఁగా శివాజ్ఞానికిన్
గణనాతీత మనంగ నేల ? గిరిజాకర్ణోత్పలధ్వంసితో
ల్బణగండస్థలఘర్మవారియయి తత్ప్రాంతంబునం ద్రిమ్మరున్.

సీ. విహరించు నొకవేళ విపినామ్రపల్లవ
చ్ఛాయల గిరిజాసహాయుఁ డగుచుఁ
గ్రీడించు నొకవేళ గిరిదరీ నిర్ఝర
ధారావనీతనిదాఘుఁ డగుచుఁ
జరియించునొకవేళ శబరవేషవిశేష
మృగయావిహార [2]సమీహుఁ డగుచు
విచ్చేయు నొకవేళ విధురితరతిపరి
శ్రమచంద్రికావృతోత్సంగుఁ డగుచు

తే. [3]మందరాచల హిమనగా నందవిపిన
రజతగిరి నీలకంఠాదినిజనివాస
వైభవోన్నతి మఱచి దేవతలతోడ
హరుఁడు దక్షిణకైలాసధరమునందు. 98

---

1. ప్రమథ. 2. సమీహు. 3. మంథరాచల.

—॰ ప్రమథులు పార్వతి భూమికి వచ్చుట ॰—

చ. తన కెటువంటి వేడుకయొ తద్గిరిమీఁద వినోదకేళి స
ల్పునపుడు పార్వతీచరణపుష్కరము ల్గఠినాశ్మఘట్టనం
బునఁ గసుగందకుండ నవభూరుహపల్లవరాజి మెత్తఁగా
ధనదసఖుండు దేవవనితాతతిచేఁ బఱపించు ముందటన్. 99

మ. అలమం[1]దీఁగెలు పుష్పగుత్తులు కురంగాలోకము ల్పల్లవం
బులు పంచాననమధ్యము ల్మదుకరంబు ల్బింబము ల్దాడిమీ
ఫలబీజాదులు నద్రిజావయవసౌభాగ్యంబుతో నీడురాఁ
గలవో లేవో యటంచుఁ జూచుగతి నాగ్రావంబునం ద్రిమ్మ
రున్. 100

సీ. శిష్టనీవారముష్టింపచాశ్రమముల
మెలఁగు సంయమిగృహమేధి యగుచుఁ
గాంతారమధ్యపక్కణవిహారంబులఁ
జలుపుఁ గిరాతసంసారి యగుచు
సంతతాంతర్యాగసాధకస్థలముల
నలరారు సిద్ధగృహస్థుఁ డగుచు
లలితచతుర్విధాలంకారములఁ దాల్చు
నవభోగరతిగృహనాథుఁ డగుచు

తే. మంచుగుబ్బలిరాజుకుమారిఁ గూడి
వేలుపులపెద్ద జముదెస వెండికొండఁ
దన్నుఁ దెలిసిన వారికి నన్నిదెసలఁ
దాన యగురీతి బహువేషధారి యగుచు. 101

1. దీవెలు.

## ఈశ్వరవిహారము

ఉ. ఆసగణేశవాస మగునగ్గిరి నల్దెస నామదర్ యమ
గ్రాసమహార్హదేహులకుఁ గాలము సేయువరైన దీర్ఘని
శ్వాసము హంసమంత్రమణి చక్షులు మూయుట యోగ
నిద్ర మూర్ఛాసమయంబు దత్పరవశత్వము సచ్చుట మో
క్షమగాఁ దుదిన్. 102

చ. జడలు ధరింప, రంగజునిఁ జంపరు, పూయరు బూదిపూఁత మై
నెడుగరు భిక్ష, కట్ట రజినాంబరము, ల్చరియింపఁబోరు పే
రడవుల నగ్గిరీంద్రమహిమాతిశయం బిఁక నేమి సెప్పదుర్
బడయుదు రూరకుండియును బ్రాణులు చిత్రముగా శివత్వ
మున్. 103

మ. భవదావాగ్ని విదాహముం జెఱుచు నాపై జాడ నేతెంచి
నర్, బవమానంబులు నిర్ఝరోభయతటీపాటల్యశోకాటవీ
నవమల్లీ నవమాలికా వకుళ పున్నాగామ్రచాంపేయగా
లవనీపప్రసవాదిగంధలహరీలక్ష్మీమదప్రోద్ధతిన్. 104

చ. అమరమనుష్యదైత్యభుజగాదులు గూడి చరింతు రగ్గిరీం
ద్రమున నఖండసౌఖ్యరసదాయకమైన శివాగమప్రభా
వముఁ దమలోనఁ దాము సరి వచ్చెఁగదా యని శంక దీఱ భా
వముల మథించి చూచి తరువాత సమాధినిమీలితాక్షులై.

ఉ. వేలుపుఁగొమ్మ లంపుఁ జలవృక్షములర్ వివరింపలేక యు
య్యాలలు గట్టియాడ నవియల్లన దవ్వుగఁ బోయినర్
మహాం,దోళనమంది మున్ను దమతోడనె కొప్పులనుండి
చాలుగా, రాలిన దివ్యపుష్ప నికరంబుల చొప్పున వత్తు
రిండ్లకున్. 106

వ. తదనంతరంబ సువర్ణముఖరీజననప్రకారంబు సెప్పెద వినుము.

—ో సువర్ణముఖరీజననప్రకారము ో—

సీ. తనపెండ్లిఁ జూడంగ దక్షిణదిక్చరా
చరభూతములు హిమశైలమునకుఁ
జనుదేర నుత్తరాశాభూమి గ్రుంగి ద
క్షిణభూమి కడు నొడ్డగెడవు గాఁగ
నెగసిన నిది మాన్ప నీకైన నేనైనఁ
గాని సమర్థులఁ గాన మెందుఁ
బొమ్మన్న ఘటసూతి భూతేశ్వరునియాజ్ఞఁ
దలమోచి యిల్లాలుఁ దానుఁ గదలి
తే. వింధ్యపర్వతగర్వంబు విఱుగఁ ద్రొక్కి
గౌతమీ కృష్ణ[1]వేణ్యవగాహనములు
సేసి శ్రీశైలనాథు దర్శించి జ్యోతి
సిద్ధవటనాథుఁ గొల్చి విచ్చేయునపుడు. 108

మ. ప్రణతుల్ సేయుచుఁ గాంచె కుంభజుఁడు లోపాముద్రతోఁ
గూడి దక్షిణకైలాసము, నంబికాహారకృతశ్రీపాదుకాన్యా
సమున్, మణిమంత్రౌషధ వాసనున్ భవమహామాయా
విపర్యాసమున్, గణనాతీతనటీవిలాసము సమగ్రశ్రీ సముల్లా
సమున్. 109

క. కాంచి మునీంద్రుఁడు జలనిధి
కాంచీవలయప్రసిద్ధ కాశీమధురా

1. వేణ్యావగాహనములు.

కాంచీముఖపురలక్ష్మీ
కాంచీమణి యామ్యభాగకైలాసగిరిన్. 110

క. దగ్గఱి వెనఁగొను దురితపుఁ
బ్రగ్గంబులఁ ద్రెంచివైచి ప్రమదాశ్రుతతుల్
దృగ్గోళంబులఁ దొరఁగఁగ
[1]దగ్గుత్తికతోడఁ [2]దనపడంతియుఁ దానున్. 111

శా. కాంచెన్ వంచితపాంచభౌతికసుఖాకారాంగమున్ జిన్నటీ
సంచారాంచితరంగమున్ మునిమనస్సమ్యక్పరిష్వంగమున్
బంచాస్త్రాసుమసుద్భుజంగము కృపాపాణింధమాపాంగమున్
బ్రాంచన్మౌక్తికకళత్రసంగము [3]ఫణారాజన్మహాలింగమున్. 112

క. కాంచి వధూయుతుఁడై పుల
కాంచిత దేహమునఁ బ్రణతుఁడై ధ్యానించెన్
గించిన్ముకుళితనయనయు
గాంచలుఁడై మౌని దర్శనానందముతోన్. 113

సీ. అర్చించె శివుని సహస్రనామంబుల
వివిధవాక్ప్రౌఢిఁ గావించె నుతులు
సేసెఁ బెక్కులు ప్రదక్షిణములు జపియించెఁ
బంచాక్షరంబు సప్రణవముగను
ధ్యాననిష్ఠాబుద్ధి మౌనముద్ర వహించె
నానందపరవశుం డయ్యెఁ బిదపఁ
దలఁగిపోఁ జాలక నిలిచి చూచుచు నుండెఁ
దలయూఁచి వెఱఁగందెఁ దనకుఁదానె

1. దగ్గుత్తిక. 2. దనదుదయితయు. 3. మణీ.

తే. కాశికానాథ విప్రయోగవ్యథావి
దూరుఁ డగుచు వసిష్ఠతపోరమాను
భావ మాత్మవధూటితోఁ బ్రణుతిఁ జేసె
మునిశిఖామణి దక్షిణామూర్తిఁ గొలిచె. 114

స్రగ్ధర. పంచాశద్వర్ణమూర్తిం బరశివరమణిం బంచభూతాత్మపీ
ఠం, బంచక్లేశప్రణాశప్రఘుటనచతురం బంచవిద్యాస్వరూపం
బంచాశత్కోటిపృథ్వీభరణచణమహాభాగ్యలక్ష్మీప్ర[1]దాత్రీన్
సంచారాగారయోగీశ్వరజనహృదయన్ జ్ఞానపుష్పాంబఁ
గొల్చెన్. 115

తే. ఎక్కెదుర్గాంబకొండ మునీశ్వరుండు
మ్రొక్కెఁ దత్పాదనీరేజములకు భక్తిఁ
జొక్కెఁ దద్దివ్యరూపంబుఁ జూచినపుడ
డక్కె నతనికి ముక్తితాటంకవతియు. 116

వ. మఱియు నమ్మునీశ్వరుండు గణేశ్వర భైరవాదులఁ గొల్చి
మునీశ్వరులసన్నిధిని నిల్చి చంద్రికాకంపళితంబుగాని నిండు
చందురుచందంబున మందాకినీసుందరం బగు పుణ్యనదీప్రవా
హంబు లేనికతంబున నిమ్మహాస్థలంబు దుఃఖంబు నావహించు
చున్నయది. పరమేశ్వరు నుద్దేశించి తపం బొనర్చి యిక్కడ
నొక్కనదిఁ బ్రవహింపఁ జేయవలయు నని యా సంకల్పంబు
నిర్విఘ్నంబుగా ననుగ్రహింపుఁ డని వారలచే ననిపించుకొని
దక్షిణకైలాస గోత్రంబునకుం జతుర్యోజనమాత్రంబున
రాత్రించరదిశాభాగంబున నొక్క మహాశైలంబుఁ గని. 117

1. ధాత్రీన్.

ఉ. చేరఁగఁ బోయి యాత్మసరసీరుహలోచన కేలు వట్టి వ
క్షోరుహకుంభభారమున సూక్ష్మవలగ్నము పీడఁ బొందఁ బొం
దారయువృత్తి రమ్మనుచు నాదరణంబునఁ దోడుకొంచు విం
ధ్యారి తదగ్రభాగమున కల్లన నెక్కె ఘరాంబుధారలన్.

క. స్నానంబుసేసి నిజక
ర్మానుష్ఠానంబు దీర్చి యభిమతపుణ్య
స్థానమునఁ దపము సేయఁగఁ
బూని సుఖాసనదృఢత్వమునఁ గూర్చుండెన్. 119

చ. తపమొనరింతుఁగాక హిమధామకిరీటునిఁ గూర్చి తన్మహా
కృపఁ [1]బ్రభవించుఁగాక భవకిల్బిషవిద్విషదభ్రసింధు పీ
విపుల జనంబులెల్లఁ గడు వేడుకఁ బొందఁగ నంచుఁ బల్కె న
త్తపసి కభీష్టసూచనవిధాయక వాక్యము నభ్రవాణియున్.

శా. శంకాతంకముమాని మానినియు సహర్షస్వాంతుఁడై చంద్ర
మో,లంకారుఁ జగదేకనాయకు మహా[2]శ్లాఘావరస్థాను మీ
నాంకధ్వంసకు నీశ్వరుఁ హృదయపీఠాసీనుఁ గావించి సా
యంకాలానలమూర్తియై తపముసేయం జొచ్చె ధైర్యంబు
నన్. 121

సీ. దూరీకృతస్తనభారకంచుకవధూ
జనము మానవకరాంచద్వ్యజనము
గంధసారాచలగంధవాహరిరంసు
జన్య ముష్టీకృతశ్వాసచయము
విక్షిప్తజలసమావిర్భూతబాష్పభూ
తల మధ్యగాసూసదాయకంబు

1. బ్రవహించుఁగాక. 2. శ్లాఘావధిస్థాణు; శ్లాఘావధిష్ఠాను.

ప్రాణేశ్వరీపరిరంభణప్రత్యూహ
కారి ఘర్మోదకోద్గమనకర్త
తే. యంబరాంతర విశ్వంభరాంబుపూర
సంచరిష్ణుపరస్పర స్థలవిహార
సమభిలాష ప్రవర్ధిష్ణు చటులశాఖ
మంత నేతెంచె దారుణోష్ణాగమంబు. 122

ఉ. ఎండెఁ గోలంకులెల్లను మహీధరముల్ దవవహ్నికీలలన్
మండె ధరాతలం బినుప మంగలముంబలె [1]నుండెఁ గాలి యా
యెండల నేమి సెప్పఁ బరమేశ్వర యావరణాంబురాశిలే
కుండిన నాఁడె పొక్కి వడ కుండునె పద్మభవాండభాండముల్.

సీ. దేవతాచక్రవర్తిత్వంబు [2]వొందిన
నహుషుఁ గోపించెఁ బన్నగము గాఁగ
నూర్ధ్వాండకర్పరం బొరయు వింధ్యాద్రికూ
టంబులు నేలమట్టంబు సేసె
బడబాగ్ని వడికి లోపడని పాథోరాశి
బోరనఁ గొనియె నాపోశనముగ
ఖలుల వాతాపి నిల్వలుని లోకైకదు
ర్మదులను నహామన్న మనుచుఁ గొనియె
తే. నితని తెరువేలపో నని యినుఁడు వెఱచి
తన్నుఁ జెనకఁడొ యాతపస్తంభనంబు
నేర్చెనో కాని యమ్ముని నిష్కళంక
చిత్తుఁడై నిండువేసవిఁ జేసెఁ దపము. 124

1. నుండి. 2. ఁజెందిన.

శా. అతీవ్రాతపవేళఁ బంచశిఖి మధ్యక్షోణిఁ గూర్చుండి ఖ
ద్యోతన్యస్తనిరీక్షణుం డగుచుఁ దద్ద్యోతప్రతాపప్రభా
స్ఫీతుం డై తప మాచరింపఁగ దిశాబృందారకాధీశ్వరుల్
భీతిం బొందిరి స్వాధికారగరిమల్ వేడెత్తునం చాత్మలోన్.

శా. అంతం బూర్వపు వైరముం దలఁచి వింధ్యగ్రావకూటంబు ల
భ్రాంతం బంతయుఁ గప్పెనో జలధి యాత్మారాతిపైఁ బోయి ని
ర్జింతుం గా కని యెత్తివచ్చెనొ తనుం జెండాడు భాస్వంతు
మా, యింతుం గా కని నిల్చెనో యిరులు నా నేతెంచెఁ గా 126
లాభ్రముల్.

తే. మొగులుమొగులున మెఱుఁగులు నిగుడఁ దొడఁగె
మెఱుఁగుమెఱుఁగుననుఱుములు మెండుకొనియె
నుఱుమ నుఱుమంగఁ బిడుగులు నుప్పతిల్లె
నింతకంటెను వర్షంబు నెక్కుడయ్యె. 127

సీ. ప్రళయవేళాసముద్భవ పుష్కలావర్త
కాది పయోదవర్షాంబు వనఁగ
నూర్ధ్వాండకర్పరం బుఱుములచే వ్రక్క
లై కాఱు నావరణాంభ మనఁగఁ
జండాంశుకరములు జలరూప మై ధరా
భువనంబు నొక్కటఁ బొదివె ననఁగ
ధరణిపైఁ బాఱంగ సురలు దీర్చిన యభ్ర
గంగాప్రవాహంపుఁ గాల్వ లనఁగ

తే. వాయువును మిన్నుఁ దేజంబు వసుమతియును
జీవనాకారముగను వర్షింపఁదొడఁగె

నీరు నేలయు మెఱుఁగును నింగి గాడ్పుఁ
దాన యై ముని యోడక తపము సేసె. 128

మ. తెలుపుం దేజము నంత టంతటఁ దంచి తీవ్రప్రభాపుంజ మై
తలచూపున్ ధర మేదినీధరశిఖాసంభంబునన్ గర్జగా
నెలుఁగిచ్చున్ గగనంబు వర్షసఖుఁ డై యేతెంచు గాడ్పున్
దముం, జలదాసార మణంచెనో యని జను ల్శంకింపకుండ
న్మదిన్. 129

ఉ. ఆతరువాత జంతునివహంబు వడంక నణంకు వేఁ యో
షాశతి ప్రాణవల్లభుల సంతతముం బరిరంభణంబులన్
ప్రీతులఁ జేయ సూర్యశశిబింబ మటంచుఁ జకోరదంపతుల్
భీతిఁ దొలంగ వచ్చె నతిభీకర [1]శీతము శీతకాలమున్. 130

ఉ. నింపమనంబుతో విజితనీరధి కుత్తుకబంటినీటిలో
నుండి తదుగ్రశైత్యమున కోర్చి తపం బొనరింప నంత నా
ఖండలముఖ్యు లవ్విధికి గ్రక్కునఁ జెప్పిరి వారిఁ గూడి యా
తంతునుఁ బోయి శంకరు సదాశివు సోముని. గాంచె భక్తి
తోన్. 131

శా. క్రోడాకారముఁ దాల్చి పోత్రమున వైకుంఠుండు భూఖే
దన, క్రీడాలంపటుఁ డయ్యు నీపదము వీక్షింపంగ లేఁ
డయ్యె నేఁ, జూడం గంటి పఠించె నాశప మటంచున్
మ్రొక్కెన్ కన్నీరు దోడ్తోడన్ ఉప్పుఁ జిప్పిలంగ బునరు
క్తుల్ గాఁగఁ బ్రార్థించుచున్. 132

1. శైత్యము.

శా. ఓ దేవోత్తమ! భక్తవత్సల! యగస్త్యుం డుగ్రవృత్తిం
దపం, బేదేవాధిపతిత్వముం బడయనో యేకాంతి యై చేయ
నిం,ద్రాసుల్ నా కెఱిఁగింప విన్నపము సేయన్ వచ్చితిన్
మాకుం జిం,తాదుఃఖంబులు దీఱ నమ్మునికిం జేతఃప్రీతిం
గావింపవే. 133

చ. అనవుడు శంకరుండు దరహాసము మోమున నంకురింప న
వ్వనజభవాదిదేవతలవంకఁ గనుంగొని మీకు భీతిఁ బొం
దను బనిలే, దగస్త్యముని దక్షిణశైల్యదరాధరంబుదా
పున నది లేనిసుఃఖమునఁ బూనె మహాతప మాచరింపఁగన్.

క. ఇది నే నెఱుఁగుదు నమ్ముని
మది నుండినయట్లు నాదుమనమున నుండున్
జదలే అనిపెద నీబడి
నది యాతని కొసఁగి మరలు మంబుజగర్భా! 135

ఉ. ఏమిటి కింతమాత్రమున కే నరుగన్ జని నీవు సంయమి
గ్రామణితోడ నే నచుపఁగాఁ జనుదెంచితి నంచుఁ బల్కి త
త్కామితవస్తు విమ్ము చిరకాలకృతోగ్రతపస్సమాధిని
ష్ఠామితఖేద మెల్ల నిమిషార్ధములో నుడివోవ గ్రక్కునన్.

వ. అని కృపారసతరంగితాంతరంగుం డై మహాదేవుం డనుపుట
యును. 137

సీ. దేవతాపతి శచీదేవిఁ గూడఁ దలంచె
హవ్య మాహరింప నగ్ని గోరె
జముఁడు ధర్మాధర్మసరణి విచారించె
నరభోజనాపేక్షఁ బొరలె నసుర

దేశకాలము లెన్నఁ దివిరె నంభోభర్త
కసువలి తనయిచ్చఁ దిరుగఁ దొడఁగె
ధనపతి సంతతత్యాగ మిాఁ దలపెట్టె
నీశానుఁ డేకభూతి కేన యనియె
తే. నఖిలలోకైకనాథుని యాజ్ఞవలన
నిరుపమానంద విహరణగరిమ మెఱయ
వారియుల్లాసమునకు భావమునఁ బొంగి
యజుఁ డగస్త్యునిమొహటఁ బ్రత్యక్షమగుచు. 138
ఉ. ఏ నజుఁడన్ మునీంద్ర! పరమేశుఁడు నీకు నభీప్సితంబు న
న్నీ నియమించి పంపె వరమెయ్యది వేఁడు మటన్న నభ్రగం
గానదిఁ దెచ్చి యిచ్చుట నఖండగతిం బ్రవహింపఁ జేయవే
దాన మనోరథంబు ఫలితం బగు నాకుఁ బయోజసంభవా.
ఉ. నావుడుఁ దమ్మిచూలి గగనంబుఁ గనుంగొనఁగా సువర్ణశో
భావిభవంబుతో బహుళభంగమహాముఖరత్వసంపదన్
దేవనదీఝరంబు సనుదెంచినఁ గాంచి విరించి తద్గుణ
శ్రీ వెలయన్ సువర్ణముఖరీప్రథ దానికిఁ గల్గఁజేయుచున్.
శా. అంతర్ధానము సేసె సంయమికులాధ్యక్షుండు సంతోషిత
స్వాంతుం డయ్యె వహించె నగ్గిరి యగస్త్యగ్రావవిఖ్యాతి నా
శాంతంబుల్ పగులంగ మ్రోయుచు నభంబాద్యంతమున్ శీక
రాక్రాంతంబై మెఱయన్ సువర్ణముఖరీగంగానదీరత్నమున్.
వ. పవనాశనభవనభువనం బోరయుచుం బ్రవహింపం దొడంగె;
నప్పుడు హరినఖరముఖవినిర్దళితకుంభికుంభగళితముక్తాఫలం
బులు నిజగర్భశుక్తిముక్తముక్తాఫలంబులుఁ గాలపరి
పక్వసమాగతమరణచమరీమృగ నీలవాలంబులు శైవా

లంబులు వళక్షచామరజాలంబులు డింఢీరికాధవళితకల్లో లంబులుఁ గుసుమశరపరితాపపరవశవశానిమిత్తమత్తవేదండ భండనక్రీడాఖండితదండకాండంబులు బిసకాండంబులుఁ బ్రవాహవేగంబునం గూలి తేలు పుష్పితరసాలసాల శాఖాకదంబంబును గాదంబాడంబరంబునుం గలిగి కరి గిరివజ్రపాతమహానినదంబునం బెకలిపఁపు కొండలచప్పు ళ్లకు నప్పటప్పటికిఁ బెదరి యుప్పరం బెగయు జల పక్షుల పక్షవిక్షేపంబులం బరఁగు తుంపరలపరంపరల నిలింప దంపతులకు రతిలంపటంబున మోములు చెమరింపకుండ నింపు సేసి పూర్వదుర్వాసనాసక్తులై ముక్తులు గాక లోకంబుల వారు రారో యని [1]చీరుతెలుంగున నభంగభంగపరంపరా ఘోషంబున నుద్రేకించి యరుణధరణీభాగయోగంబున శోణ భద్రాకారంబును శ్వేతభూతలసమేతస్రోతంబులవలన క్షీర తరంగిణీ శృంగారంబును నీలక్షోణీతల ప్రవాహశ్రేణివలనఁ గృష్ణవేణీవిలాసంబును నడ్డంబుగ నుండుకొండలఁ దాఁకి తిరిగితిరిగి యరుగుదెంచుటంజేసి పునఃపునఃప్రవాహమోహ నంబునుం దనరఁ దనయందు నివి మొదలయిన తీర్థంబులు గల వని యవనీజనంబులకుఁ దెలుపు మెలపున వెలుంగుచు యోగీశ్వరభావ స్వభావంబునుంబోలె యమందబిందుసముద యంబును నిరంతరనాదప్రసాదమేదురహృదయంబును సంసార వారాకరతరణకారణకళాప్రకాశంబును లంఘితాలంఘ్య విషయప్రదేశంబును యథేచ్ఛవ్యాపారజీవనంబును లోకైక పావనంబును నై, వాసుదేవలీలావిలాసంబునుంబోలె మత్స్య

1. పీఱు.

కచ్ఛపాద్యవతారవిహారంబును శంఖచక్రశోభితాకారంబును బర్వతోత్పాటన పాటవాటోపంబును వినిర్మూలితపలాశకలాపంబును నపారగోరక్షణహేతుభూతంబును విదళితనరకసంజాతజననఖేదసన్నిపాతంబును నై, మహాదేవవిభ్రమవిహారంబునుంబోలె నిరవశేషీకృతార్జునశరసమూహంబును మథితమన్మథసముత్సాహంబును గగనతరంగిణీసంగతసముత్తుంగపురభంగురప్రభావంబును నిజాశ్లేషనిమగ్నశివాభాగంబును నై భిల్లవల్లభులపల్లియలపై వెల్లివాఁడిచినం దల్లడపడి వెడలునెడ నిఱుపేదనడుములకు నెడరు వాఁడము నను వడువునం బుడమి నపుంగిడ నోఁడు పడంతులవెఱ పుఁపు నొసంబున నుపనాథు లెత్తుకొని గుత్తంపుంజనుగుబ్బలయొత్తునం జిత్తంబులు చిత్తజాయత్తంబులై తత్తఱపడఁ గొండనెత్తంబుల కెక్కిన మక్కువలం గలసి మెలసి వినోదించుటకు నిదానం బగుచు రాజహంస రథాంగ సంకులంబునకుఁ బ్రతిఘటించు నుభయతటాటవికరిఘటబృంహితంబు లసహ్యంబు లగుటయు గహ్వరంబులనుండి మ్రోయు సింహనాదంబులం బ్రోదిసేయు తరంగతురంగగళగళారావంబు నొండొండ రోదసీకుహరంబులు నిండం జండతరంబులైన దురితంబులపై దండువెడలు చందంబునఁ గనుపట్టుచు వేంకటాచలాలంకారం బై పరశురామేశ్వర క్రీడారంగంబునకు రంగవల్లిక యై కాళహస్తిపురలక్ష్మీ బాలికామణికి మణిమాలిక యై యోంకారపుటభేదనభాగ్యదేవతాలలామం బై పరస్పరవీచీకరోత్థిప్తశీకరమౌక్తికాక్షతజాలంబుల వారాకరవరుం బరిణయం బయ్యె. ఘట

సూతియుఁ ద త్తటినీతటంబుల శివలింగప్రతిష్ఠలు సేయుచు
దక్షిణకైలాసంబుఁ జేరం జనుదెంచి. 142

శా. లోపాముద్రయుఁ దాను హేమముఖరీ లోలోర్మి డోలాం
తర, వ్యాపారంబులఁ దేలి భూతియును రుద్రాక్షంబులుం
బూని వి,ద్యాపుంరూపములో యనంగ నతిశాంతాకారులై
దివ్యలిం,గోపాంతంబున నిల్చి తాపసజనం బోహో యనన్
భక్తితోన్. 143

క. పంచేంద్రియపథముల వ
ర్తించుమనోధ్వగుని శివుని తెలివునఁ బో బో
ధించిరి వంచించిరి ప్ర
పంచికసౌఖ్యములఁ బరమ పరవశు లగుచున్. 144

తే. ఎట్టకేలకుఁ జూపు బహిర్గతంబు
గాఁగ నిట్లని వినుతించెఁ గలశభవుఁడు
దేహ ముప్పొంగ వాక్యప్రవాహసరణి
దివ్యమును లెల్ల [1]నిది యుపదేశ మనఁగ. 145

దండకము. శ్రీమన్మహాదేవ! దేవాదిదేవా! నిమగ్నీకృతా
జాండభాండప్రకాశా! మహేశా! మహాయోగిపుంయోగ
నిద్రాసమున్నిద్రితానందరూపా! భవార్ణోనిధానాంతరా
పన్నరత్నాంతరీపా! జగద్దీప! నిర్లేప! బ్రహ్మాండపిండాండ
బాహ్యాంతరాళంబులం బూర్ణమై సూక్ష్మసూక్ష్మార్థమై స్వార్థ
మైయున్న నిన్నుం మహామాయచే జీవునిం జేసి మహ్యాది
తత్త్వాత్మకంబైన దేహంబు గేహంబుగా నిల్పి త్రైగుణ్యముం

1. విని.

గణ్యముఁ బుద్ధ్యహంకారచిత్తంబులుఁ జ్ఞానకర్మేంద్రియం
బుల్ షడంతర్విరోధుల్ ఘనక్లేశముల్ పాశముల్ కోశ
ముల్ జన్మనాశాద్యవస్థల్ వృథా నీకుఁ గల్పించి సత్కర్మ
దుష్కర్మబంధంబులం జిక్కి తా నైహికాముష్మికానంద
దుఃఖంబులం బొంది నిన్నాత్మ భావించుచో నిన్నియుఁ లేమి
యూహింపఁగా లేక లోకుల్ దమోంధీకృతాలోకులై
పోవఁ బ్రోవం గృపామూర్తివై కౌబేరదిగ్భాగకైలాస
శైలంబునన్ దివ్యలింగాకృతిన్ భూమిఁ బ్రత్యక్షమై వేద
వేదాంతవిద్యాదితర్కోక్తులం గంఠశోషంబుగా వాదముల్
సేయుచున్ బుద్ధివైదగ్ధి నే దర్శనం బిచ్చుకున్ వచ్చు దానిం
బ్రతిష్ఠించుచున్ మంత్రశాస్త్రార్థ చింతాపరిశ్రాంతిమైఁ
గొంతకాలంబు నానావిధారాధనల్ సేయుచున్ సిద్ధ నీరేజ
కూర్మాసనాభ్యాస నాడీసదాశోధనాయాసముం బొంది
యాధారజాలంధరోడ్డీన బంధంబులం బట్టుచుం గుండలీశక్తి
వక్త్రం బవక్రంబుగాఁ జేసి షట్చక్రవీథిం జేతస్సమేతం
బుగా వాయువున్ ద్రోలుచుం, దన్మనోగంధవాహంబులన్
బ్రహ్మరంధ్రోపరివ్యాపకం బైన సంవిన్మయాకాశదేశాంత
రోద్యత్పరబ్రహ్మచంద్రోదయజ్యోత్స్నలోఁ దాదాత్మ్యముం
బొందఁగాఁ జేయుచుం బుత్రపుత్రీకళత్రంబులన్ శత్రు
మిత్రంబులన్ శీతవాతాతపాది వ్యవస్థాదిభేదంబు ఖేదంబు
మోదంబు కృత్యం బకృత్యంబు హేయం బహేయంబునున్
లేక లోకంబు లెల్లం బరబ్రహ్మరూపంబుగాఁ జూచుచున్
స్వేచ్ఛఁ గ్రీడించువారల్ దుదిం బొందెడు లాభంబు నీవై
హరిబ్రహ్మకీటాంతజంతువ్రజంబుల్ వినోదంబుగా నిన్ను

దర్శించినన్ ముక్తులం జేయుచున్ సత్యమై నిత్యమై
జ్ఞానమై జ్ఞేయమై జ్ఞాతవై యున్న నిన్నుం బ్రశంసింప
నే నెంతవాఁడన్ మదీయాపరాధంబు లేపట్టునన్ బట్టకే
పూర్ణకారుణ్యదృష్టిం గ్ననుం జూడవే భక్తవత్సానుగచ్ఛ
న్మరున్నైచికీ! భక్తలీలావనీకల్పకా! భక్తసంతానచింతా
మణీ! భక్తసంతోషవారాశి చంద్రోదయా! భక్తకోటీవిప
ద్గోత్రవజ్రాయుధా! భక్తసందోహసంతాపహా! భక్తసంకల్ప
సంసిద్ధిరూపా! నమస్తే నమస్తే నమః. 146

మ. అని కీర్తించి తపస్వికేసరి యఖండానందదుగ్ధార్ణవం
బునఁ గ్రీడించుచు ఫాలభాగమున మోడ్పుంగేలు గీలించి
యంగనయుం దాను బ్రదక్షిణంబులు నమస్కారంబులుం
బెక్కు లీశునకుం జేసి సువర్ణపర్వతధనుశ్శుద్ధాంతకాంతా
మణిన్. 147

క. జ్ఞానప్రసూనకళికన్
మానస మత్యంతభక్తినుగ్నంబుగఁ గ
న్గోనల బాష్పోదకములు
సోనలుగాఁ గురియఁ గుంభజుఁడు దర్శించెన్. 148

క. ఆపిమ్మట నక్కడఁ గల
తాపసబృందంబుతోడ దంపతు లాశై
లోపాంతహేమముఖరీ
ద్వీపవతీతటశిలాప్రదేశమునందున్. 149

క. కూర్చుండి మునుల కభవునిఁ
గూర్చి తపం బాచరింపఁ గోరిక లపుడీ

దేర్చిన విధంబు పీనులఁ
జేర్చి వినఁగ వినయగరిమఁ జెప్పఁగ వారున్. 150

సీ. నీ వీశుమహిమంబు నిశ్చయింపఁగ నిశ్చ
యించు నీమహిమ మీాహేమవర్ణ
నీవు శంకరపాద నీరేజములఁ గొల్వఁ
గొలుచు నీపదము లీ కులవధూటి
నీవు సర్వేశ్వరునిత్యంబు భావింప
భావించు నిన్ను నీపరమసాధ్వి
నీవు శివైక్యంబు నిర్వహింపఁగ నిర్వ
హించు నీయైక్య మీాయిందువదన
తే. శైవచూడామణివి నీవు నీ వెలంది
ప్రథమగణనీయ యగుఁ బతివ్రతలలోనఁ
గాన మీాకు [1]నసాధ్యము ల్గలవె జగతి
మావశంబయ్య మీాయనుభావ మెన్న? 151

క. నీతపము కల్పధరణీ
జాతము తత్ఫలము నీదు సాధ్వీవిలస
త్పాతివ్రత్యము లోక
వ్రాతమునకు మిమ్ముఁ బొగడ వశమే మాకున్? 152

క. శితికంఠుఁ డద్రికన్యా
పతియై సుఖి యయ్యె భువనభవనంబునఁ ద
త్ప్రీతిగా లోపాముద్రా
పతివై సుఖివైతి వీవు పరమమునీంద్రా. 153

1. నసాధ్యంబుగలదె.

క. మీ కిరుపురకే దొరయుం
గాక భవత్సదృశు లెన్నఁ గలరే నానా
లోకంబుల ? మీమహిమము
మీకే తెలియు న్వశంబె మిమ్ముం బొగడన్? 154

చ. అన విని కుంభజుండు వినయంబున నిట్లను మీ రనుగ్రహిం
చినఁ దృణమైన మేరువగుఁ జిత్తము వేఱొకరీతి నున్న న
య్యనిమిషశైలమైనఁ దృణ మౌ నటుగాన ఫలించె నాతపం
బనఘచరిత్రులార! నను నాదరణంబున మీరు గన్గొనన్.

క. అది యట్లుండఁగ[1]నిం డీ
నది యిక్కడ నుత్తరంబునకు నభిముఖమై
నదియును శివునకుఁ గృహమై
నదియుం దలపోయ నిదియ యవిముక్తంబున్. 156

క. కీటం బయినను నీనది
నీటం [2]దోఁగుటయుఁ గాలనియతి మృతంబై
యాటవికాధిపు పుక్కిటి
నీటం [3]దోఁగును బురాణ నిశ్చయ మెందున్. 157

ఉ. ఏమని చెప్ప నిచ్చటియహీనమహత్త్వము దోమ చచ్చినన్
సామజపూజఁ గాంచు మఱిసామజ మీల్గిన సామజారియై
సేమముఁబొందుఁ గాముకుఁడు చెల్వకుఁగా మరుచేతఁ
జచ్చినన్, గామునిఁ జంపుఁ దా మగుడఁ గామినితో నొడఁ
గూడి [4]యుండియున్. 158

1. నిండిన. 2. దొరగుటయు. 3. దోఁచుచు. 4. యుండినన్.

క. ఇటువంటిచోట నెప్పుడు
నుటజంబుల నధివసించియుండెడు మీా యు
త్కటభాగ్యం బేమని చె
ప్పఁట దేవుం డెఱుఁగు మౌనిపుంగవులారా! 159

తే. పోయి వచ్చెద దక్షిణపుణ్యతీర్థ
రాజములు చూడ న న్ననుగ్రహము సేసి
యనుపుఁ డనుటయు వారలు ననుపఁ దపసి
యిందువదనయుఁ దాను నిజేచ్ఛఁ జనియె.  160

మ. అనఁగా వీరనృసింహ యాదవుఁడు మాయాజంగమాకారభ
ర్గునకుం గ్రమ్మఱ మ్రొక్కి భక్తనిధి! నాకుం జెప్పవే విశ్వనా
థునియారాధన సేసి యగ్గిరిని జంతుశ్రేణిలో మున్ను గో
రినయర్థంబులు గాంచి రెవ్వరన గౌరీనాథుఁ డారాజుతోన్.

శా. పాశక్లేశగుణేష ణేంద్రియ తను ప్రత్యర్థితాపోర్మికా
కోశాదివ్యతిరిక్తమూర్తి! త్రిజగత్క్రీడాకపాకార! మా
యాశృంగారవతీవిలాసవిభవ వ్యావిద్ధ[1]ముగ్ధాంత వే
శ్యాశర్మావహ! తారకాక్షరమహోలాపోపదేశప్రదా.  162

క. శాంతాకార యిదంతా
హంతాచింతావిదూర యపవర్గరమా
కాంతాకాంత దిగంతా
భ్రాంతాభ్రాంతాంతతాండవాభినయకరా.  163

---

1. ముక్తాంత.

పంచచామరము. అపారతా గభీరతామృతాది హేతుభూతతా
తపస్విసంగృహీతతా విధాతృముఖ్యదేవతా
ధిప ప్రమథ్యమానతా నదీమహానుజీవన
ప్రపాతజాతమగ్నతాభిరామచిత్పయోనిధీ.

గద్యము. ఇది శ్రీమత్కాళహస్తీశ్వర చరణకమల సేవా
పరాయణ సింగమరమానారాయణ జక్కయ నారాయణ
తనూభవ భవపరాఙ్ముఖ ధూర్జటి ప్రణీతం బైన
శ్రీకాళహస్తిమాహాత్మ్యంబునందుఁ
బ్రథమాశ్వాసము.

---

శ్రీ ర స్తు

# శ్రీ కాళ హ స్తి మాహాత్మ్యము

## ద్వి తీ యా శ్వా స ము



ఖండాచలమారుత
లేఖాస్పర్శాదివిషయలీఢాకృద్వి
ద్యాఖని మునిజనకల్పక
శాఖి శ్రీకాళహస్తి సదన మహేశా! 1

ఆ. అవధరింపు డిట్లు భవదీయకథ విన్న
వింతు భక్తజనుల వీను లలర
మారు యాదవునకు గారుణ్యరసపూరి
తేక్షణముల నానతిచ్చినట్టు. 2

బ్రహ్మకు సరస్వతివలన గుమారు లుద్భవిల్లుట

వ. తదనంతరంబ యొక్కనాడు. 3

సీ. అఖిలవిద్యారహస్యములశంకలు దీర్ప
సరస నుండెడు మునీశ్వరులు వొగడ
స్వస్తికహస్తులై సమ్ముఖంబున బరా
బరిగాగ సర్వసుపర్వ లుండ

గరతలయుగళి వక్త్రములు [1]గప్పుక విన్న
పంబులకొఱకు దిక్పతులు సేరఁ
బూర్వదేవతలు కింకుర్వాణులై తన
కనుసన్న వలసిన పనులుసేయ
తే. గరుడగంధర్వభుజగకిన్నరపిశాచ
భటులు చావడి ముంగటి బట్టబయలఁ
జటులతరవృత్తిఁ గోటులసంఖ్య లెసఁగ
నబ్జగర్భుండు గొలువున్న యవసరమున. 4

మ. నవలావణ్య రసాలయంబు గుణరత్నస్థాన మాస్యక్షపా
ధవబింబోదయ మున్నతస్తనగిరీంద్రవ్యక్తి వాచాసుధా
భవదేశంబు వళీతరంగము తనూభద్రప్రభాఫేనదీ
ప్తివిలాసం బగుతత్కళత్రము సుధాబ్ధింబోలి సద్భక్తితోన్.

మ. చెలికత్తె ల్గయిదండఁ బట్టఁగ సురస్త్రీ లెంకలైన న్గెలం
కుల సేవింపఁగ వజ్రనిర్మితతులాకోటిద్వయంబుల్ ఝళం
ఝళనాదంబుల సీన మానికపుఁగెంజాయ ల్దువాళించు పా
వలు పాదంబుల మెట్టి ప్రాణవిభుఁ గొల్వం గొల్వుమోసాల
కున్. 6

సీ. బ్రహ్మకుఁ బట్టంపు రాణివాసం బయ్యు
రాజసక్రీడాభిరతులఁ బోక
జగదేకసౌందర్యసౌభాగ్య యయ్యును
నణుమాత్రమును గర్వగుణము లేక

---

1. కప్పుగ.

సంపూర్ణ యౌవన సంపద గలిగియు
మదవికారస్ఫూర్తి పొందలేక
వ్యాహారసింహాసనారూఢ యయ్యును
బహువిధవ్యాహృతిఁ బ్రౌఢగాక
తే. మగనిముందఱఁ దన మహామహిమ లెల్లఁ
గానఁబడకుండ నడఁకువ గలిగి కించి
దవనతాననయై పాలుపారఁ గన్ను
గండుమీలకు నిలుకడఁ గఱపి కదిసె. 7

క. ఏతెంచునపుడు పాదుక
[1]లాతలికతూర్యాంతరమున నటు విడిచి కరా
నీతవిపంచీమదశుక
పోతస్ఫటికాక్షసూత్రపుస్తక యగుచున్. 8

క. పరిజనుల ననిపి నాథుని
పరిసరమున కేఁగి యతనిపంపున సుఖపిం
జరిత భగద్ధగితం బగు
సరిగద్దియ నుండునట్టి సమయమునందున్. 9

సీ. మోముపున్నమచందమామను వెన్నెలఁ గాయ
డెందంపుఁ గెందమ్మి డిందుపడెనొ
వాలుఁజూపనిమొన వేలుపుఁతేని కై
దువచాయగుట్టుగ ట్టపియఁబడెనొ
కొప్పనుచీఁకటి గుంపు గప్పుకొనంగఁ
దలఁపుఁదెర్వరిత్రోవఁ దప్పి పడెనొ

1. లాతలి.

రాయంచనడపుల రాయిడిఁ దాల్మి తా
మరతూఁడు దుమురుగా మరలఁబడెనొ

తే. నలువ తనుఁ గొల్వవచ్చిన పలుకుఁజెలువ
చెలువ మరయుచు వలరాజు చిలుకుములికిఁ
దలఁకి మిన్నక యొకకొంత తడవు నిలిచె
మునులు దమతమ మొగములు గనుఁగొనంగ. 10

తే. అదియుఁ దాఁగాంచి సభ్యు లాహ్లాదమందఁ
దగవుఁ దలపోసి చిత్తంబు బిగియఁబట్టి
స్వస్వరూప విచారైక సౌఖ్యదృష్టి
మఱుఁగు వెట్టుచు నొకకొన్ని మాటలాడి. 11

తే. సరస సల్లాపములఁ బ్రొద్దు చాలఁబోయె
ననుచు వేల్పుల మునుల నెయ్యమున ‘ననిపి
తాను వాణియు లోని సౌధంబుమీఁది
కరిగి యచ్చట నిట్లని యానతిచ్చె. 12

శా. వాచాగోచర మప్రతర్క్యము వినిర్ద్వంద్వం బసాధారణం
బాచోద్యం బతిలోక మప్రతిమపర్యాయంబు వర్ణింపఁగా
నీచెల్వం బిది నిక్క మట్లయినఁ గానీ నాకు నీవంక వాం
ఛాచాపల్యము దీఱనేరదు మనోజక్రీడలం గోమలి. 13

క. నాకోరిక లీడేరఁగఁ
గైకొనవలె నీవు ప్రమదగౌరవకృతభా
షాకృతులు నూటి నలువలెఁ
గైకొంటివయేని చెప్పఁ[1]గల దే మనినన్. 14

---

1. గలవే యనినన్.

క. తనపాతివ్రత్యమునకు
ననుకూలముగాఁగ మగనియాజ్ఞకు లోనై
కనుపట్టె వాణి శతవా
గ్వనజానన లగుచు నలువవడిఁ దేరంగన్. 15

ఉ. అందున కొంతయుం బ్రమదమందుచుఁ బుష్పితవల్లులందు నిం
దిందిరశాబకంబు పువుఁదేనియఁ గ్రోలెడు రీతి నూర్వశిన్
బొంది సుధాధరగ్రహణభూరి సుఖంబుల నొందుచున్ శతా
నందుఁ డనంగ నొప్పెసఁగె నాఁడు మొద ల్కథల న్విధా
తయున్. 16

శా. ఆరామంబులఁ గేళిశైలముల సౌధాగ్రంబులన్ స్వర్ణదీ
తీరోపాంత నికుంజ పుంజములలో దేశంబుఁ గాలంబు నా
చారంబు న్వివరింపఁగా మఱచి హృజ్జాతాంధకారాంధుఁడై
నీరేజాసనుఁ డిచ్చ నుండె శతవాణీభోగ నిర్మగ్నతన్. 17

సీ. మ్రొక్కిన నొకతెను మోమెత్తఁగాఁ జేయుఁ
దిట్టుఁ గూరిమి నొక్క తెఁగఁబోఁడి
తలపట్టుకొను నొక్క తరుణీలలామంబు
హుమ్మని యదలించు నొక్కయింతి
పట్టకు మని యానపెట్టు నొక్క వధూటి
యేడ్చుచు నొక్క పూర్ణేందువదన
ముసుఁగు పెట్టుచు నొక్క ముద్దియ పవళించు
పిగ్గు లేదను సేమఁ జెలువ యొకతె

తే. మఱియుఁ గోపించి పలికిన మూఢిక నుంత
వారిజాక్షులఁ దగినట్లు గారవించి

రతిసుఖంబులఁ జొక్కి నోరంతప్రొద్దు
నజుఁడు మన్మథ రాజ్యసింహాసనమున. 18

క. తరుణీశతకము బింబా
ధరమాధుర్యంబు లానుతఱిఁ దమలోనన్
బరమేష్ఠి నాల్గు[1]మోములు
వరుసలు వెట్టుకొనుఁ జెప్ప వశమె కూర్మిన్. 19

సీ. అధరపల్లవ మాన నంగంబు మఱచు దం
తక్షతంబునఁ గొంత తలంపు గలుగుఁ
బరిరంభణంబునఁ బరవశుఁడగు నఖం
బులు నాటఁ జెనకినఁ దెలివి నొందు
బహుబంధరతికిఁ [2]లోఁబడి చొక్కు గళరవ
శ్రవణంబుచేత [3]హెచ్చరిక నొందు
సురతాంత సుఖమున సోలుఁ దాంబూలంబు
సేయింప నించుక సేదదేఱు

తే. జలకమాడును దివ్యవస్త్రములు గట్టు
దివ్యగంధంబు లలఁదును దివ్యపుష్ప
మాలికలు దాల్చు నమృతంబు గ్రోలు మగుడ
బాలికాసంగసౌఖ్యాబ్ధి నోలలాడు. 20

ఉ. తోరపుఁగోరిక ల్మగవుతోడి మొగంబును జిక్కువడ్డ శృం
గారపుఁగొప్పు క్రొంజెమటగాఱెడు గండము సందడించు ని
ట్టూరపు గాడ్పు వేడుకలనుబ్బెడు దేహము సోలుచూపు నొ
ప్పారుట గాని నల్వకొకయప్పుడు నూఱట లేదు కూటమిన్.

---

1. మొగములు. 2. లోఁబడి. 3. హెచ్చరిక.

క. ఈమాడ్కి నిదియ పనిగాఁ
గామాంధుం డగుచు నున్న కార్యము లెల్లన్
బో మొత్తి పుణ్యపాపము
లేమియుఁ దలఁపక సుఖించు నెడ వారలకున్. 22

శా. క్రూరు ల్ధూర్తులు దోషకారులు జగద్ద్రోహుల్మహాభీషణా
కారు ల్ధర్మవిరోధు లన్యరమణీకామాంధకారాంధు లా
చారభ్రష్టులు లోకకంటకులు శశ్వద్వ్యగ్రబాహు ల్కృపా
దూరుల్మున్పదికేఁ రక్కసులు దోష్ఠోఁ బుట్టుచుం దండ్రితోన్.

బ్రహ్మకొడుకుల దుష్టచేష్టలు

సీ. చెఱపట్టి తెత్తుమో శ్రీమహాలక్ష్మిని
బిండి గావింతుమో వెండికొండ
మ్రింగుదుమో పట్టి మిహిరమండలమును
ద్రావుదుమో సముద్రంబు లెల్లఁ
* బన్నగకులసార్వభౌము నాడింతుమో
పెకలింతుమో ధాత్రిఁ బెకలిపడఁగఁ
దన్నుదుమో మృత్యుదంష్ట్రలు విఱుగంగ
నరగునఁ జెఱుతుమో జమునిలజ్జ
తే. నేఁడుకొండలుఁ బెఱికి వేఁటాడి కడిమి
గగనమండల మొరయంగ నెగురవైచి
బంతులాడి చరింతుమో పసుపుసుమ్ముఁ
దండ్రి! వలసిన పనికన్నఁ దమ్మిచూలి. 24

* 2 ... త్తార్లారుగ నున్నవి.



వ. నెమ్మనంబున నుమ్మలించి కమ్మవిల్తుని యలరమ్ములం జిమ్మచీఁకట్లు
గ్రమ్ముటం జేసి దుర్మదులుఁ గ్రూరకర్ములగు కొడుకులం గంటి నే
యని కటకటంబడి భువనంబులకు వెక్కసులగు రక్కసుల
దిక్కుఁ గనుంగొని గగనకర్పర పరివేధి తుంగ శృంగ
శృంగాటకంబును నుదీచ్యవాచీ ప్రాచీ ప్రతీచీ సమీచీన
పరిఖీభూత గంగా గౌతమీ సముద్రముద్రిత దుర్గంబును
నిరర్గళ నానామృగ సంకులమధ్యంబును నగు వింధ్యంబునకుం
బొం డని నియమించిన. 25

ఉ. మించినవేడ్క రక్కసులు మీసలు దీటుచు దిక్కడంగ
ముల్, [1]చించుక పాఱ నార్చుచు మషీమలినాంగ వినీలిమ
చ్ఛటా, వంచిత భాను లై కయిదువల్జళిపించుచు లోకమెల్ల
భక్షించెద మంచు వింధ్యగిరిఁ జేరఁగ వచ్చిరి దండ్రి
పంపునన్. 26

ఉ. అందొక దుర్గమస్థలమునందు నివాసము సేసి జంతురా
శిం దెగటార్చి మ్రింగుచు ఋషిప్రమదావళిఁ బట్టుకొంచు
సంక్రందనముఖ్య దేవనగరంబులఁ గాల్చుచు నాత్మబోధ ని
ష్ఠం దపమాచరించుమునిసంహతి డెందము గందఁ జేయుచున్.

మ. పురుషుం డన్న వధించి కాంత యనిన న్భోగించి యర్థంబులన్
సరగం జేకొని మత్తచిత్తు లగుచున్ సర్వంబు నేకంబు సే
సిరి వర్ణాశ్రమధర్మము ల్బుధుల గాసిం బెట్టి చార్వాకమా
ర్గరతుల్వోలె శరిరసౌఖ్యపరతం బ్రత్యక్షసిద్ధాంతు లై. 28

1. చించుచుఁబాఱ.

మ. కులశీలంబులు [1]జాతిభీతులు ననుక్రోశత్రపాహేయశం
కలు దూరంబులు సేసి యిచ్చల సమగ్రస్ఫూర్తి వర్తించువా
రల రై పోయిరి కాని రక్కసు [2]లసారక్రూరసంసారమో
హాలతాబద్ధులు గాక యున్న నపవర్గానందముం జెందరే. 29

శా. భాండాగారము లెల్ల నన్యధనము ల్బందీగృహప్రాపితా
చండాలావధికాంత లాత్మకులయోషారత్నముల్ సత్క్రి
యల్, చండక్రీడలు సర్వజంతువులు భోజ్యశ్రేణి కాదంబరీ
భాండవ్రాతము పేయమై దనరఁ బాపస్వాంతులై త్రిమ్మరన్.

శా. ఆబాధల్ పడలేక భూరమణి శోకాక్రాంతయై మూర్ధనవీ
థీబద్ధాయణపాణిపద్మములతో దేవా! జగంబెల్ల ర
క్షాబుద్ధిన్ వివరింపు నీసుతులచేఁ [3]గాలెంజుమీ యంచు భా
షాబద్ధుం డగు బ్రహ్మదేవుఁ గని విజ్ఞాపించె ఘోషించుచున్.

క. ఆయార్తనాదమునకుం
దోయజగర్భుండు కరుణతో భూదేవిన్
డాయంగఁ బిలిచి యోడకు
మీ యీనిమిషమున నీకు మెచ్చొనరింతున్. 32

—బ్రహ్మకు నుగ్రుఁ డను కొడుకు కలుగుట—

క. అని కొడుకులపైఁ బుట్టిన
కినుక సహింపంగ లేక కెరలినఁ గోపం
బున నుగ్రుం డనుతనయుఁడు
జనియించె సమస్తభూతజాలము బెగడన్. 33

1. జాతినీతులు. 2. లపార. 3. గాలంజుమీ.

చ. అతనికి నుగ్రసింహరథమస్త్రచయంబును వజ్రకంచుకా
న్వితముగ నిచ్చి నాసుతులు నీసహజన్ము లటంచుఁ జూడ కు
ద్ధతగతి నందఱం దునిమి దైవతకోటులు నింగిఁ బొంగ భూ
సతికిఁ బ్రియం బొనర్పు మని సారసగర్భుఁడు పంప నాతఁడున్.

బ్రహ్మపంపున నుగ్రుఁడు తన యన్నలగు రక్కసులఁ జంపుట

ఉ. కోపన నార్చినం దెసలఁ గుంజరము ల్బెదరెం ధనుర్గుణా
రావమునం గలంగె జలరాశి వడంకె రథాంగతీవ్రసం
రావమునం గులక్షితిధరంబులు రథ్యమృగేంద్ర సాంద్ర హే
షావలి వ్రక్కలయ్యె హరిదంతము లే మని చెప్ప నత్తఱిన్.

తే. తన్ను ధరణికిఁ బొమ్మన్నధాత నోటి
మాట నోరనె యుండ భూమండలంబుఁ
జేరఁ జనుదెంచె సింగంపుఁదేరిజోదు
వింధ్యగిరి నున్న రాక్షస వితతిమీఁద. 36

శా. ఆఘోరాసురు లంతయుం దెలిసి గంధానేకపానేకవా
హౌఘ స్యందన బృందము ల్గొలువఁ జిత్రాయత్తమై కార్ముకా
మోఘాస్త్రంబులు దాల్చి హేమరథముల్మోదంబుతో నెక్కి గం
గౌఘుం బెత్తిన ధూళిచే నడుసుగా నత్యంత గర్వాంధులై.

క. బలములు దీర్చిరి నడిచిరి
బలవంతుం డైన యుగ్రుపై నేచి బలా
బలచింత లేక రాక్షస
బలములు రఘురాముమీఁదఁ బైకొనురీతిన్. 38

క. ముందటఁ గాలుబలంబు పి
ఱుందం దురగంబు లాపిఱుందం గరుల్

స్యందనము లందుపిఱుఁదం
గ్రందుకొనఁగ [1]నిలిపి నడుపఁగా వెఱఁగయ్యెన్. 39

మ. గరళం బుద్ధతి వారగింపఁ జనునుగ్రవ్యగ్రవిస్ఫూర్తి సా
గర మాపోశన మెత్తుకుంభజుని రేఖం ధ్వాంతసంతాన సు
స్థిరతం దీర్చు దినేంద్రు చందమున నాసేనం గనుంగొంచు భీ
కర వేగంబునఁ దాఁకె నుగ్రుఁడపు డుగ్రంబైన రూపంబునన్.

క. చదిపెం గాలుబలంబులఁ
గదిమెం గుఱ్ఱంపు పౌఁజు గగ్గులకాఁడై
చెదరంగ గంధగజముల
మదమడఁచెం జండవీరమండలిఁ దాఁకెన్. 41

క. విడువక పట్టిన మునుముం
గడ దేఱిచి బలము రెంటఁగా నొనరించెం
వడి నా రెంటికి నడుమన
వెడలెం మఱిసోమసూర్యవీథులు గాఁగన్. 42

క. చెదరిన సేనల నన్నిఁటిఁ
గుదురుకొనం దోలి చుట్టుకొని వడి నేసెం
మదకరుల హయల భటులను
గదనంబున మడిసి చాపకట్టుగఁ గూలన్. 43

శా. ఆయోధాగ్రణిచేత నిట్లు తమసైన్యంబు ల్పటాపంచలై, పా
యల్వాఱియు నేటుపోటుల భయభ్రాంతంబు లయ్యెం సమి
ద్వ్యాయుక్తాంగములయ్యుఁ దమ్ము శరణంబు ల్వేఁడియుం

1. నిలిచి నడువఁగా.

దూలఁగా, సాయంసూర్యసమానవక్త్రములతో సక్రోధులై
రక్కసుల్. 44

క. విఱిగిపఱచు సైన్యంబుల
వెఱపెల్లను దీర్చి చటుల విక్రమగరిమల్
మెఱయంగ నుగ్రుఁ దాఁకిరి
యుఱవడి నార్పులును బొబ్బ లుఱుములఁ దెగడన్. 45

క. ఆ తుములమునకుఁ జెమలక
భూతలము దలంక నలువఁకుత్తుం జెడునై
యా తెఱఁగున నసుపలు ని
ర్ఘాతసమశరపరంపరలు వడిఁ గురియన్. 46

క. ఏసిన శరములు దుముపగఁ
జేసి యరణ్యంబు దావశిఖ వొదిచినయ
ట్లాసురసైన్యము వీరా
గ్రేసరుఁ డుగ్రుండు విశిఖకీలలఁ బొదివెన్. 47

క. తా నేసిన శరములు దా
వానలమునఁ బడ్డమిడుతలట్లు శరనిధిఁ
సోనలుగా వర్షించిన
వానలక్రియ హరిమీఁద వమ్మై పోవన్. 48

శా. క్రోధాగ్ని ప్రభరీతి శోణరుచి దృక్కోణంబులం జింపఁగా
వేధోండంబు గలంగ నార్చి శరము ల్వేవేగ కోదండవి
ద్యాధారేయత మీఱ నేసె మనుజాహారౌఘదేహాస్రధా
రాదాతక్షితిధూళిపాళిగ మృగేంద్రస్యందనుం డుద్ధతిన్. 49

క. కోణపవరు లవ్వీరుని
బాణపరంపరల నొప్పిఁ బడ్డైరి కుల
క్షోణీధరములు కుంభ
ద్రోణాసారములఁ గలఁగి తొలఁగని భంగిన్. 50

వ. మఱియును. 51

శా. దిక్కు ల్పిక్కటిలంగఁ జక్రగుణసంశ్లిష్టధ్వను ల్మీఱఁగా
ఱెక్కల్వచ్చిన కాలసర్పముల పేర్మిం గంకపత్రంబులన్
జొక్కంబైన నిశాతబాణముల నాజిన్ దేసి బేతాళముల్
గ్రుక్కిళ్ళింగఁగఁ గ్రొత్తనెత్తురుల వాఁగు ల్పాఱఁ
గ్రవ్యాదులన్. 52

ఉ. ఏసిన నీసువుట్టి యసురేశ్వరు లన్నియు నుగ్గుసేసి య
బ్జాసనపుత్రుఁ జాది భువనావళి నెన్నఁడు నిన్నుఁ గాన మ
న్నా! సమరంబు సేయుటకు నై నియమించినవార లెవ్వరో
దోసముగాదు రాఁ దొలఁగఁ ద్రోయుచుఁ బోఁ జన దంచు
నుక్కునన్. 53

శా. ఆవీరాగ్రణి బాణపాతముల మాంసాహారవీరు ల్పయిం
బువ్వుల్ చల్లిన యట్లుగాఁ దలఁచి యార్పుల్ నింగిముట్టంగ
నీ, క్రొవ్విళ్లే యడఁగింతు మంచు వడి నుగ్రుండాఁకి రున్మ
త్తులై, గువ్వ ల్డేగ నెదిర్చి పేర్చినగతిం గోలాహలం
బొప్పఁగన్. 54

క. ఒక్కమొగి నసుర లందఱుఁ
బెక్కుతెఱంగుల నిశాతభీకరశరముల్

గ్రక్కిఱియ నేయ నెత్తుట
నక్కంఠీరవరథాంగమంతయుఁ దోఁగెన్. 55

ఉ. అప్పుడు నేల పెల్లగిల నార్చి మహోగ్ర నిరీక్షణంబులన్
నిప్పులు రాలఁ గోపమున నిష్ఠురశాతశిలీముఖావళిన్
ముప్పదివేల రక్కసుల ముంచె విరించితనూజుఁ డీశ్వరుం
డప్పరదైత్యవీరనివహమ్ము శరమ్ములఁ గ్రమ్ముకై వడిన్. 56

ఉ. కప్పిన యంపవానలకుఁ గంపమునొందక మానవాశనుల్
ముప్పిరిగొన్న రోషమున మోమునఁ గంఠమునన్ - భుజ
మ్ములన్, జిప్పిలి వేఁడి నెత్తురులు జేగుఱు టేఱులు కొండ
నుండి జాఱు, ఱొప్పునఁ గాఱ వీరరస మొల్కెడు చందము
దోఁప నుగ్రుఁడై. 57

శా. చెక్కల్సేసె రథంబు లశ్వములఁ గూల్చెన్ ఖండఖండంబులై
టెక్కెంబు ల్పడ నేసె రత్నమయకోటీరంబులుం దూణముల్
ప్రక్కల్గా నొనరించె ధూళిఁ గలపె న్వర్మంబులన్ సూతు
లన్, జక్కాడెం దునుమాడె విండ్ల నసువుల్ సంక్షోభముం
బొందఁగన్. 58

క. అరదములు విడిచి రక్కసు
లరిగలఁ బట్టములుఁ గొనుచు నాకసమునకున్
బోరిఁబోరి నెగయుచుఁ గల్పిం
చిరి కాటుకప్రోవువంటి చీఁకటి నంతన్. 59

శా. ఆమాయాతిమిరంబులోఁ గల నదృశ్యాకారులై పోరు ర
క్షోమాతంగముల న్మృగేంద్రరథుఁ డుగ్రుం బోలి శాతాం
ధకా,రామిత్రాంబక మేసి చీఁకటులఁ బాయం దోలి

యాకాశఘం,టామార్గంబున నుండకుండఁ గడికండ ల్గాఁగఁ
బెల్లేసినన్. 60

శా.తూలంబాఱియు బీరువోక సురనాథు ల్చేవమీఱం సమి
త్కేళీలోలతఁ గాలమేఘముల మాడ్కిం జూడ్కికిన్గా శిలా
జాలాసారముఁ బైపయిం గురియ రోషస్ఫూర్తిఁ దై తీవ్ర
వాతూలాస్త్రంబున నంతఱం గెడపి శాంతుం డయ్యె నవ్వీ
రుఁడున్. 61

చ. నరులకు గుండెగూడు దిగె నాగకులంబులు నిద్రవోయె ని
ర్జరులును మిన్ను దన్నిరి ధరామరకోటియుఁ దృప్తిఁ బొందె
సుస్థిరత వహించె ధాత్రియు ఋషివ్రజ మిచ్చఁ జరించె
రాక్షసోత్కరము రణంబునఁ హరిరథప్రదరాహతిచేతఁ
గూలినన్. 62

వ. అమ్మహారణస్థలంబున వారణంబులయట్టులు కట్టులు వడుటం జేసి
తొట్టిన నెత్తురు మడువులం దెట్టువలు గట్టిన యంపకట్టి
యలం దెప్పలుగట్టుకొని యాడం దలపెట్టు బిడ్డల యెడ్డె
తనంబునకు మనంబున ఘనంబగు వేడుక వొడమఁ బెద్దయుం
బ్రొద్దు ముద్దాడు శాకినీ ఢాకినుల కలకలంబును విచ్చలవిడిం
బచ్చిపొలసుఁ దిని వెగటగుటం జేసి తొడవుల నెడలి పడిన
పద్మరాగంపుఁ గుప్పలు నిప్పు లనుచుఁ గండలు బరికట్టియల
నగ్గట్టి కలుకుట్లు గాలుపం బాలువడి తినుగు భూత బేతాళ
బాలికాకుల కోలాహలంబును మిట్టకోలల గులగులలైన
కిరీటంబులనుండి రాలిన వజ్ర మౌక్తికరజో[1]గుణంబు లవ

---

1. గణంబు.

ణంబు చవి మరగి మునుఁగకుండ నుప్పుకండలుపెట్టఁ జూచు పిశాచమంథగామినుల క్రందును బదషునం బొదవిన మెదడునుం బ్రదరంబులం జదిసి కదిసిన మాంసంబును బ్రేవుల ప్రోవులు మొదలుగాఁ గూడఁబెట్టి కట్టలుగట్టి యేనుఁగు తుండంబులం దూము లమరించి చెమరించిన మోముల తోడం జెలువులు గట్టుకాడ నిట్టవాడిచిన రక్తంబుల నట్ట నడుమ వేసినఁ జెలంగు కూశ్మాండ కుమారోద్దండ హసన వ్యసనంబును గాకఘూకజంబుక వనశునకంబులు ప్రచ్చి వందఱలాడి యవ్వాలవ్వాలికి వెడలివచ్చు నేనుఁగు పీనుఁగుల డొక్కలలో దుక్కి డాఁగిలి మ్రుచ్చులాడు నయ్యంపుఁ దొయ్యలుల సయ్యాటంపుఁగయ్యంబును, వీరరసావేశంబున విజయాశాపరవశత్వంబునం జేసి మునుపడి ప్రోవు దప్పక ధరణిం బడియున్న మానవవాహనహరిశాబకకళేబరంబులం జూచి సజీవశంకాతంకంబునం గొంకి వెనుకపదంబులం గ్రమ్మ ఱానం జిమ్మిన దుమ్మునఁ గదలకుండినఁ జెండి పంపుసేయు గోమాయుపరంపరారావంబును, విగతవీరు లైన తేరులును, జర్జరితాంగంబులైన తురంగంబులును, శరీరప్రోతశరవ్రాతు లైన సూతులును, ఖండఖండంబు లైన కోదండంబులును, రంధ్రనికేతనంబు లైన కేతనంబులును, విదళిత సూత్రంబు లైన తనుత్రంబులును, రజోజాలంబు లైన శూలంబులును, విదారితకూటంబు లైన కిరీటంబులును,ఖండితవేణుశలాకంబు లైన పుండరీకంబులును, విధ్వంసిత ముఖంబులైన శిలీముఖం బులును, భంగభంగంబు లైన మాతంగంబులును, రుధిరస మాక్రాంతు లయిన మావంతులును, యమకింకరాయత్తు

లయిన రాహుత్తులునుం గల కలనుఁ గనుంగొని చని వీరా
గ్రేసరుం డగు సుగ్రుండు పితామహాగ్రభాగంబున నిలిచి
గెలిచినవిధంబు విన్నవించిన విని విరించి పుత్త్రవధవిధాకర్ణన
గ్రథితశోకానలసందహ్యమానమానసుం డై వండిపడుచుం
జూచిన నతండునుం భస్మం బైన బుత్త్రహత్యాదిదోషంబును.
బుత్త్రవిహీనత్వంబును బ్రాప్తంబయ్యెనే యని విచారించి.63.

—ద బ్రహ్మ పుత్త్రహత్యాదిదోషపరిహారార్థము తపంబు సేయుట ల—

ఉ. ఇంతట దేవదేవుఁ గరుణేక్షణు దక్షిణరౌప్యశైలశృం
గాంతరవాసు భక్తజనతామరభూజము నద్రికన్యకా
కాంతునిఁ గొల్వకున్న సుతఘస్మరతా సుతహీనతాఘ దు
ర్దాంతపయోధిపాతమునఁ దప్పి మనంబు సుఖంబునొందునే?

వ. అని వితర్కించుచు. 65

ఉ. అంచలఁ గట్టినట్టి రథమూత్త్మవధూటియుఁ దాను నెక్కి చిం
తించిన[1]యంతలోఁ గనలి తీవ్రత దక్షిణరౌప్యశైలముఁ
గాంచె విరించి ముక్తికలకంఠవధూపదవీరసాలముం
బంచముఖానుకూలము విపద్విపినోగ్రదవాగ్నికీలమున్. 66.

తే. కాంచికాంచనమాణిక్యఖచితమైన
యంచకోదములఁ బూన్చిన యరదము డిగి
దేవియును దాను మొగ [2]లేటఁ దీర్థమాడి
యభవు'దర్శించి జ్ఞానపుష్పంబఁ గొలిచి. 67

వ. దక్షిణకైలాసగోత్త్రంబునఁ గూర్చుండి కమలాసనుండు కమ
లాసనస్థుం డై హృదయకమలంబునఁ బరమేశ్వరు చరణకమ
లంబులు నిలిపి పంచేంద్రియసౌఖ్యంబుల నంవించి. 68

---

1. యాత్మలో. 2. మొగరేట, మొగదేట.

సీ. కందమూలాదిభక్షణములఁ గొన్నిది
నంబులు ఘోరతపం బొనర్చి
యంబుకణంబు లాహారంబుగాఁ గొన్ని
నెలలు దప్పక భక్తి నిర్వహించి
పవనాశనంబునఁ బరితృప్తుఁ డై కొన్ని
[1]ఋతువుల నద్భుతవ్రతము సలిపి
సతతోపవాసనిష్ఠాపరాయణబుద్ధిఁ
గొంతకాలము తపోదాంతి నెఱపి

తే. భువనభవనభయంకర పవనవర్ష
శిశిర [2]తీవ్రతర వ్యథఁ జెదరనీక
హృదయధైర్యంబుమిక్కిలి పదిలపఱచి
నలువ యిబ్బంగిఁ బెక్కేండ్లు సలిపెఁ దపము. 69

సీ. గాంగేయముఖరీ తరంగసంగతసదా
గతి మహాగ్రీష్మదుఃఖము [3]హరింప
సతతవాచంయమీశ్వరకృతక్రతుహవి
ర్జ్వాలదగ్నికీలలు చలి నడంప
నికటద్రుమస్థితనీలకంఠంబులు
పురులొడ్డి వానల[4]బిఱుసు మాన్ప
నాగంబు లాభోగభోగంబు లడ్డంబు
పట్టి ఝంఝానిలపంక్తి నుడుప

తే. నఖిలభూతాత్మమూర్తియై యతిశయిల్లు
కొడుకుఁబడయంగ సర్వేశుఁ గూర్చి తపము

---

1. ఋతువు లద్భుత తపోగ్రతను. 2 తీవ్రాతపవ్యథ. 3. దహింప. 4. ముసురు.

సేసె నటు కానఁ బవ నాగ్ని శేషఫణీంద్రు
లాదిగాఁ గూడి [1]విధికి సహాయు లైరి. 70

సీ. తల్లిఁ గానని లేడిపిల్లకుఁ జన్నిచ్చి
పెంచు బెబ్బులి తన పెద్దయట్లు
నైచికంబున గూఁడు దప్పి [2]తెప్పున బడ్డ
రాచిల్క బోదలఁ బ్రోచుఁ బిల్లి
యెండచేఁ గ్రాఁగిన కొండ[3]కోయిలలఁ దెచ్చి
యొలమావిసిగల నిలుపుఁ గ్రోతి
యొడఁబాసి పోయిన పిడియేనుఁగులఁ గూర్చి
కరివిరహంబు కేసరి హరించు
తే. స్తనితములకెగబడి వచ్చు శరభములను
బట్టి యొయ్యన ధాత్రిపైఁ బెట్టి కాచు
గండభేరుండపక్షులుఁ గలిగి యజుని
యాశ్రమము శాంతరసరూప మయ్యె నపుడు. 71

ఉ. ఆడ విధాతకుం జదువులమ్మ సదా పనిపాట సేయఁ జే
దోడుగఁ జెంచెత ల్పలుకుఁదోడుగ రాజశుకీకదంబముల్
గూడి చరింపఁగా నడియుఁ గొంత వినోదము గాఁ దపస్వినీ
క్రీడ వహించె నాత్మపతికిన్ మదిగోర్కి ఫలించు నంతకున్.

తే. భారతీదేవియును దానుఁ బద్మభవుఁడు
భువనములకెల్లఁ జోద్యంబు పుట్టునట్టు
లాత్మవిద్యాధురంధరుం డైన కొడుకుఁ
బడయఁగాఁ గోరి ఘోరతపం [4]బొనర్చె. 73

1. బవరి. 2. నేలను. 3. గొరియలఁదెచ్చి. 4. బొనర్చు.

మ. కరుణాధారలు నేత్రకోణములఁ గ్రాంకించ నానందబం
ధురమై మానస ముబ్బఁగాఁ బ్రమదసంభూతల్లోల్వ గోరాజునె
క్కి రటన్మంగళవాద్యముల్ సెలఁగ లక్ష్మీనాథముఖ్యామరుల్
పరివేష్టించి భజింపఁ బద్మజునకుం బ్రత్యక్షమై యీశుఁడున్.

—॥ ఈశ్వరుఁడు ప్రత్యక్షమై బ్రహ్మకు వరమిచ్చుట ॥—

శా. ఏ నీకేమి యొనర్తుఁ జెప్పుము సురజ్యేష్ఠా! యనన్ భక్తిభా
షానాథుండు ధరిత్రిఁ జాఁగిల నమస్కారంబు లర్పించుచున్
నానారీతుల సన్నుతించి నిటలన్యస్తాంజలిత్వంబునన్
మేనం గంపము రోమహర్షణము సమ్మిశ్రంబుగా నిట్లనున్. 75

తే. దేవ నీవంటి దేవుండు దివ్యతీర్థ
రాజములలోన దక్షిణరజతశిఖరి
వంటి క్షేత్రంబు నావంటి వాంఛితార్థ
సిద్ధుఁడు నరుదు ధర నిమర్శించి చూడ. 76

శా. కాన న్వచ్చియుఁ జూడరాదు భవదాకారంబులో నొక్కమే
నైనం బారముముట్ట నిం కెటులు లోకాతీతమై సృష్టికిన్
లోనై యుండని మీఁచిదాకృతి నుపశ్లోకింపఁగా నేర్చెదన్
నానాభంగుల నూరకుండుటయు ధన్యత్వంబు నాబుద్ధికిన్. 77

సీ. భారతీదేవితోఁ బాయక కాలధ
ర్మము విచారింపక మదనకేళి
దేలంగ ముప్పదివేల రక్కసు లుద
యించి వింధ్యాద్రికి నేఁగి వారు
ప్రజలఁ బీడింప సర్వంసహాదేవత
చెప్పిన నేను రోషించినపుడు

పుట్టె నుగ్రుం డనుపుత్త్రుండు వానిచే
    నంగజుఁ జంపించి యతనిఁ జంపు

తే. కొంటి నజ్ఞానమునఁ గట్టుకొంటిఁ బుత్త్ర
హత్య సంతానహీనుండ నైతిదేవ!
రెండుదోషంబులనుమాన్చి నిండువేడ్క
నన్ను రక్షింపు మనుడుఁ బ్రసన్నుఁ డగుచు. 78

వ. దక్షిణకైలాసగోత్ర వీక్షణమాత్రంబునం బుత్త్రహత్యాది దోషంబులువాసె మాఘమాసంబున మఘానక్షత్రంబున నుషఃకాలంబున సువర్ణముఖరీస్నానం బాచరించి మహానంబున నీ మహాలింగంబునకుఁ బ్రదక్షిణంబులుఁ బ్రణామంబులుఁ బంచాక్షరీమంత్రజపంబును నూటయెనిమిది సేసి ప్రతిమఘానక్షత్రంబున నివ్విధంబున నొక్క సంవత్సరంబు నడిపిన సుపుత్త్రుండు గలుగు; నీవే కావెవ్వరీవ్రతంబు నడపిన నిట్లయగు నని యానతిచ్చి సర్వేశ్వరుం డంతర్ధానంబు నొందె నరవిందనందనుండు నట్లు సేయం దొడంగిన. 79

బుఘువుని జననము

మ. నెలరెణ్ణెల్లకుఁ జీరచిక్కెఁ ద్రిజగన్నిర్మాతయిల్లాలికిన్
జెలఁగెం జిట్టుము లంకురించె నసువుల్ చెక్కు ల్ప్రభాతేం
దుమం, డల తేజంబున నొప్పెఁ గౌను బలిసెన్ డాసెం గుచా
గ్రంబులన్, నలు పాయాసము సోఁచె నెన్నడ నభిన్నం
బయ్యె నిట్టూర్పులున్. 80

తే. తెల్ల నగుమేను కుసుమితవల్లి గాఁగ
గురుకుచంబులు పుష్పగుచ్ఛములు గాఁగ

నంచనుండెడి నలుపు నిందిందిరములు
గాఁగఁ జెలువొందె వాగ్దేవిగర్భమహిమ. 31

తే. ఆత్మలో నున్న పుత్త్రహత్యాకళంక
మాత్మజాభావతాదోష మాత్మరూప
మైన పిండంబు గర్భస్థమైన బైట
వెడలె ననఁ జన్ను మొనలందుఁ బొడమె నలుపు. 32

సీ. సౌఖ్యలేశములేనిసంసార [1]దేహాభి
మానముల్ విడిచి త్రిమ్మరఁగఁ గోరు
ముక్తిసామ్రాజ్యాభిషిక్తులై విహరించు
యోగసిద్ధులలోన నుండఁ గోరు
మౌనముద్రాసక్తిమదికి నింపగు చోట
నేకాంతమున వసియింపఁ గోరు
నప్రార్థితప్రాప్తమగు పదార్థంబుల
దీపనాదివ్యథ దీర్పఁ గోరు

తే. విష్టపవ్యాపకంబు సవిస్మయంబు
నైనబ్రహ్మంబు పిండమై యాత్మగర్భ
గోళమున నుండఁ దన్మహాగుణములెల్లఁ
దెలుపు మెలపున నంతటఁ బలుకువెలఁది. 33

ఉ. భారతి గోరుకోర్కులకుఁ బద్మభవుం డనుకూలుఁడై పుష్యా
తారకయందు సువ్రతముఁదప్పక సల్పఁగ నొక్కయేఁటిలో
నీరజవైరిశేఖరుని నిత్యకృపం గల పుత్త్రజన్మముం
జేరువ యయ్యె దంపతుల చిత్తమునం బ్రమదం బిగుర్పఁగన్.

1. మోహాభిమానముల్.

తే. వాఙ్మయం బైన వేదాంతవార్ధియందు
నర్థమయుఁ డైన చిద్విభుం డవతరింపఁ
దన్ను మఱచిన తెఱఁగునఁ దమ్మిచూలి
ప్రమదమునఁ జొక్క వాణిగర్భమునుండి. 85

మ. ఉదయించెం బరమార్థ రూపము మహాయోగీశ్వరోత్తంస మీ
శదయావర్ధితదివ్య తేజము సదాశాంతస్వరూపంబు దుః
ఖదసంసారవిదూరమానసము లోకం బుత్సవక్రీడలం
బొదలంగా సుతరత్న మంత జననీపుణ్యప్రభావంబునన్. 86

క. పుత్రోదయ మగుటయు శత
పత్రజుఁ డానందలహరిఁ బరవశుఁ డగుచున్
స్తోత్రంబుసేసె ముక్తిక
ళత్రుని గౌరీశు నిర్మల[1] ప్రతిపత్తిన్. 87

వ. ఖండపరశుండును నఖండ దయామండిత కటాక్షవీక్షణంబులఁ బ్రత్యక్షం బై కమలజతనూభవునకు బుభువని యెడు నామం బొనరింప ననుగ్రహించి యనుగ్రహారహితంబును గలుషాహితంబును నైన బ్రహ్మోపదేశంబు సేసి యంతర్హితుం డయ్యె నంత. 88

శా. కోరెం బెండిలిఁ గన్నవారలకు సంతోషింపకే మ్రొక్కి యా
త్మారామత్వమునం జెలంగి యిఁక నేయర్థంబు వర్జింపఁగా
లేరాత్మజ్ఞు లనంగ నా బుభువు దల్లిం దండ్రి వీడ్కొంచుఁ బు
ణ్యారణ్యంబులఁ బుణ్యశైలముల బ్రహ్మజ్ఞానియై త్రిమ్మరన్.

1. వ్రతముక్తిన్.

ఉ. వచ్చి నిదాఘుఁ డాఋభువువంకఁ బరాపరవస్తుదర్శనం
బచ్చుపడంగఁజేసి సనకాదుల కంతయుఁ జెప్పి చూప నా
సచ్చరితుల్ సమస్త మునిచంద్రులకుం గరుణార్ద్రచిత్తులై
యిచ్చిరి బ్రహ్మవిద్య వెలయించిరి వారు జగంబు నిండఁగన్.

శా. ఈచందమునఁ దమ్మిచూలికథ గౌరీశుండు చెప్పంగ ధా
త్రీచక్రేశుఁడు సొక్కి మ్రొక్కి యనియెన్ శ్రీకాళహస్తీశ
తా, ప్రాచుర్యంబు పురాణసిద్ధముగ నెవ్వాటన్ జగన్నా
యకుం, డాచంద్రార్కముగా ధరించె నిది నా కాద్యం
తముం జెప్పవే. 91

క. అనవుడుఁ గుహనాజంగమ
తనువు ధరించిన సుధాంశుధరుఁ డిట్లనియెన్
మనుజేశ్వరుతోఁ గరుణా
వననిధియై విను మటంచు వాచాప్రౌఢిన్. 92

క. తొలియుగమున శ్రీనామముఁ
గలచెలఁదియుఁ ద్రేతయందుఁ గాళం బనుపా
ములతేఁడును దానికి నీ
తలియుగమున హస్తియున్ వ్రతంబునఁ గొల్వన్. 93

శా. గౌరీశుండు చెలందిఁ బాము గజముం గైవల్యసామ్రాజ్యల
క్ష్మీరూపంబకు తన్నుఁ గూర్చుకొనఁగా శ్రీకాళహస్తీశ్వరుం
డై రాజిల్లెఁ దదీయభక్తిగరిమం బాద్యంతము న్నీకు వి
స్తారప్రౌఢి వచింతు రాజ! వినుమా దత్తావధానుండవై. 94

## చెలఁదిపురుగు శివైక్యముఁ బొందుట

చ. కృతయుగవేళ మర్కటకకీటక మొక్కటి పూర్వవాసనా
గతమతి దేవదేవు గరకంధరుఁ గొల్వఁ దలంచి కుంభజ

క్షితిధర కన్యకాంబు పరిషిక్త శరీరముతోడ నాత్మని
ర్గత బహుతంతుపంక్తి గృహకల్పన శిల్పకళాప్రవీణతన్. 95

సీ. ప్రాకారములు గోపురమ్ములు కొలువుకూ
టములు నర్తనమందిరములు కోశ
గేహము ల్పందిళ్లు కేళీనివాసంబు
లంతఃప్రదక్షిణాయతనవీధి
యుపహారభోగమంటపము గర్భగృహంబు
పరిణయ [1]హేమవైభవనిశాంత
మంతఃపురంబు కక్ష్యాంతరంబులు జాల
కంబులు మేడలుఁ [2]గరుణతోడ

తే. నిభముఖానలజాతచండీశపుండ
రీకలోచన మాతృకాలోకనయన
దక్షిణామూర్తి వటుకాదిదైవతముల
నిలయములు గట్టెనత్యంత నిష్ఠతోడ. 96

శా. ప్రాతఃకాలతుషారశీకరచయప్రాప్తిన్ లసన్మౌక్తికో
పేతాగారములట్లు చెల్వెసఁగుఁ దద్బిందుచ్ఛటా[3]స్ఫూర్యత్ఖ
ద్యోతచ్ఛాయలఁ గొంతసేపు బహురత్నోదీర్ణగేహంబులై
లూతాకల్పితతంతుసద్మములు వొల్చుం జెప్పఁ జిత్రంబులై.

క. తీరుగ నీగతి నిండులు
తీరఁగఁ గట్టియును గాలిఁ ద్రెవ్వినపోఁగుల్
జాఱిన పోఁగులు నదుకం
దీరుపనే కాని నిలువఁ దీరక దినమున్. 98

1. హోమ. 2. గణఁక. 3. జాత.

శా. సేవింపంగఁ జెలంది నేమముఁ బరీక్షింప న్లలాటాక్షుఁ డా
త్మావాసంబున నున్న దీపశిఖికీలాభీలతీవ్రప్రభా
వ్యావిద్ధాంబరమై తగుల్కొని తదీయాగారముల్ ధూమమై
పోవం జేసిన [1]రేఁగి కీటకము హృద్భూతవ్యథాక్రోధ మై.

క. ఇది పెక్కేఁడులు పట్టిన్
సదనంబులు గట్ట నాకు శంభునికొఱకున్
దుదిఁ గుమ్మరి కొక యేఁడును
[2]గుడె కొకపెట్టన్న మాటకున్ సరివచ్చెన్. 100

చ. కటకట నేఁ బ్రయాసమునఁ గట్టిన యిండ్లను గాల్చె దీప మిం
తటఁ బడి దీని మ్రింగక వృథా వసియించినఁ గోపమాఱు నే
యటమట మైన జీవనమునందలిమోహము చాలు నంచు ను
త్కటగతి దీపికానలశిఖానికరంబులఁ ద్రావఁ బోవఁగన్. 101

శా. దేవోత్తంసుఁడు భక్తవత్సలుఁడు చిత్తేశస్వభావుండు గౌ
రీవామాంగుఁడు శంకరుండు దయ మీఱంబోవఁ గెంగే
లునన్, జావ న్వచ్చిన పుర్వుఁ బట్టి తగునీ సద్భక్తికిన్
మెచ్చితిన్, నీ వేయర్థము నన్ను వేఁడెదవు దానిం జెప్పుమా
నాపుడున్. 102

క. చెలఁదియు నాతప మింతట
ఫలియించె నటంచుఁ బ్రమథపతికిఁ బ్రణామం
బులు పెక్కు సేసి సంభ్రమ
కలితహృదయ మగుచు భక్తి గడలుకొనంగన్. 103

1. లేచి. 2. గుడియకు నొకపెట్టనుటకున్

శా. దేవా! నిన్ను నుతింపఁ దే నధముఁడన్ [illegible]
రా వేపాటియు వచ్చినన్ శ్రుతులు శాస్త్రంబు [illegible]
జెప్పఁగా, [1]లే వాద్యంతము లన్నఁ దద్విధులకున్ లెక్కిం
పఁగా శక్యమే, సేవాధర్మము మేలు గా కనుచు నీ శ్రీపా
దము ల్గొల్చితిన్. 104

క. నా కీభవదుఃఖంబులు
లేక మహాజ్ఞానరసవిలీనుఁడ నగుచున్
లోకం బెన్నఁడు నెఱుఁగని
యాకైవల్యమె యభీష్ట మని ప్రార్థింపన్. 1

చ. అనిమిషకోటి తా మహరహంబు నొనర్చు శివార్చన ల్మనం
బున నిరసింప మౌనులు తపోవిభవంబులు రోయ యోగవా
సనఁబడి పోర్లువారు తమజన్మముఁ దిట్టుకొనంగ నన్యద
ర్శనపతు లెల్ల మాసమయసంగతి చాలు నటంచు నెంచఁగన్.

ఉ. ఎక్కడఁ జూచినన్ సురమునీశ్వరదానవమానవాహిపుల్
మ్రొక్కుచు సన్నుతించు రవముల్ ధ్రువమండలవీథి నిండఁ
గా, దిక్కులు ముంచుకొన్న తనతేజములోపల సూర్యనా
భమున్, గ్రక్కునఁ గూర్చెఁ బస్మయము గా శివలింగము
[2]భక్తిలోలతన్. 107

క. లూతాధీశ్వరు కథ యిది
వాతాశన హస్తికథలు వ్రాక్రుత్తు మహా
పాతకధాత్రీధరని
ర్ఘాతము లై యమృత మొల్కఁ గా వీనులకున్. 103

1. లేవత్యంతము నానతద్విదుఃకున్. 2. భక్త.

కాలసర్పము సేవఁగుచు శివసాయుజ్యము నొందుట

శా. త్రేతాంతంబున నొక్క కాలఫణి భక్తిన్ దివ్యమాణిక్యముల్
పాతాళంబుననుండి తెచ్చి దినముం బాలేందుచూడార్చనల్
[1]ప్రాతర్వేళలఁ జేయు ద్వాపరయుగప్రారంభమైన న్గుణా
తీతుం శంకరుఁ గొల్వ వచ్చె నొకహస్తిశ్రేష్ఠ మచ్చోటికిన్.

సీ. వచ్చి కేతకినదివారిలోపలఁ దోఁగి
కానలు గొలఁకులు కలయఁ దిరిగి
మాలూరశాఖలు నాళీకకహ్లార
కుముదపుష్పంబులు గోసి తెచ్చి
ఫణి సమర్పించిన మణులెల్లఁ బోఁద్రోచి
తొండానఁ గ్రోలినతోయములను
దక్షిణకైలాసధరణీధరావాసు
సద్భక్తితోడ మజ్జనము సేసి
తే. పూజ లొనరించి యేనుఁగు పోవుటయును
భవునిదర్శింప మఱునాఁడు పాఁపఱేఁడు
నిజఫణాగ్రసమగ్రమాణిక్యదీప్తి
తపనునకుఁ దోడుపః కాలతమముఁ జెఱుప. 110

ఉ. డగ్గఱి యెవ్వఁడో కటకటా శివలింగముమీఁదిరత్నముల్
గగ్గులకాటఁ [2]గప్పి ములుకంపలు తీవలు [3]వెట్టె నేఁడు నా
కెగ్గొనరించి పోయె నిఁక నేమన నేర్తు మదీయ భాగ్య మి
ట్లగ్గిఁ బడంగఁ జేసినమదాంధుని నంచు [4]విషాదచిత్తుఁడై. 111

1. ప్రాతశ్శైవల. 2. గల్పి. 3. వెట్టి. 4. విషణ్ణ.

క. అల్లన యేనుఁగు వెట్టిన
వెల్లం బోఁద్రోచి యెడఁద నీసును భక్తిన్
మల్లాడ మణుల గౌరీ
వల్లభుఁ బూజించి చనియె వాతాశనముల్. 112

ఉ. అంతటఁ గొంతసేపునకు నగ్గజరాజును వచ్చి రత్నసం
క్రాంతశరీరు నీశ్వరునిఁ గన్గొని యెవ్వఁడో నేఁ డునజ్ఞతా
సంతమసంబు గప్పి యొకసక్కఁపుఁబూజ లొనర్చెఁ గాక. యే
బ్రాంతులుఁ బెక్కువర్ణములరాలు కపర్దికిఁ బెట్టఁ జూతురే.

క. అని [1]చింతింపుచు నెప్పటి
యనువున శివపూజఁ జేసి యడవికిఁ జనియెన్
దనయిచ్చ దంతి పామున్
బనివడి మఱునాఁడు దాఁ బ్రభాతమునందున్. 114

మ. శివుఁ బూజింపఁగ వచ్చి బిల్వవిటపశ్రేణీసనాళాబ్జభే
దవిలీనాంగము దివ్యలింగము సఖేదస్వాంతమై చూచి నా
ది వృథాజన్మము గాదె! నాతపము భక్తిం బాడుగా కున్నె
య్యేల విచారింపఁగ నెల్లియున్ వ్రతము కొల్లంబోయినం
జూచెదన్. 115

ఉ. ఎక్కడి దుర్మదుండో తన కే నొనరించినరత్నపూజనల్
దిక్కులఁ బాఱఁ జల్లి జగతీరుహశాఖలుఁ దమ్మికాఁడలున్
బెక్కులు గొంచువచ్చి పయిఁ బెట్టిన నూరకయుండె శంకరుం
డక్కట యేమి సెప్ప నహాహా పగవారినిఁ గూడె దైవముల్.

---

1. చింతించుచు.

ఉ. కంటక [1]మెట్లు నాక సుముఖత్వము నొందితి వయ్య పార్వతీ
కంటకితాంగబాహులతికాయుగసంగతిఁ బోలె దుఃఖకృ
త్కంటకబిల్వకాకమల కాండము లెత్తిన మోచిమోచి ము
క్కంటి! యెఱుంగవే నొసటి కంటిమహత్త్వము నీకుఁ
గల్గుటన్. 117

మ. అని దుఃఖించుచు నెట్టకేలకు దృఢంబై చిత్త మాత్మేశు న
ర్చనసేయం దలపోయ దంతికృతపూజల్ ద్రోచి పై దుమ్ము బు
స్సునఁ బో నూఁది యనర్ఘ్యరత్నములఁ జక్షుశ్శ్రోత్ర
మర్చించి యాత్మనివాసంబు తదంతరాయజనితో న్మాదం
బునం దూఱుచున్. 118

సీ. భోగవతీపురంబునఁ జొచ్చి బోటుల
తోడ నాడెడు జలక్రీడ లుడిగి
పువ్వుఁబోణులుఁ దాముఁ బొత్తుల భుజియించు
మధురసుధాహారవిధిఁ దొఱంగి
బహువిధతానసంపన్న గానంబుల
నిక్క చొక్కెడు తన నేర్పు వదలి
ప్రాణనాయికతోడఁ బర్యంకసీమల
మసకానఁ బెనఁగుసంభ్రమము విడిచి
తే. నిద్రపోయెడు సుఖమెల్ల నేలఁ గలిపి
ప్రతిదినంబును దాఁ జేయురత్నపూజ
శివునిపై నుండకుండినఁ జింతనొంది
రాత్రి శివరాత్రిగా జాగరమ్ము సేసె. 119

---

1. మెట్లుగాక.

శా. తా నర్చించి [1]తొలంగినట్టి తరువాతన్ శంభుఁ బూజింపఁగా
దానానేకప మేఁగుదెంచి శివుమీఁదన్ నిన్న మొన్నంబలెన్
నానారత్నము లుండఁ జూచి కడుఁ జిన్నంబోయి నాతోఁ
జలం,బో నేఁ డీశిల విశ్వనాయకునిపైఁ బొందించినాఁ
డెవ్వఁడో. 120

ఉ. అచ్చపునీలవర్ణ దృషదావళి నల్లని [2]కల్వరేకులే?
బచ్చనిరాలు బిల్వనవపత్రములే? యరుణాశ్మభంగముల్
విచ్చిన యెఱ్ఱదామరలె? విశ్వపతీ! విరసోపలంబు[3]లె
ట్లచ్చుపలయ్యె? నీకు నవి యందునె గంధ మృదుత్వ
శైత్యముల్? 121

చ. ఉనికి శిలోచ్చయంబు నిజయోష శిలోచ్చయరాజపుత్రి నీ
ధనువు శిలోచ్చయంబు పురదాహ! రథీకృతరత్నగర్భ! నీ
మనమున కీశిలాశకల[4]మండన మెట్లు ప్రియంబునేసె? నే
మనఁగలవాఁడ నిన్ను వ్రతహాని యొనర్చు దురాత్ము
డుండఁగన్. 122

శా. పోనీ నేఁటికి నాయెఁ బోయెఁ గడుదుర్బుద్ధిన్ విచారింప నే
లా నిత్యంబును నీశ్వరుం గొలుచు వేళం గాక రేపాడి రా
గా నర్చావ్రతహాంతఁ గన్న నదిభాగ్యంబె వివేకింప వాఁ
డౌ నేనా నొకజాడఁ బోయెదము లేదా జీవ మింకేటికిన్.

ఉ. ప్రాణము లిచ్చువాఁడ నిఁకభర్గున కెల్లియుఁ బూజపోయి
పాషాణము లున్న నింపునకు సందియమేల విచార మేటికిన్

1. తలంగినట్టి. 2. కల్వలే? గడుం. 3. లెట్లించిత మయ్యె.
4. మండల.

బ్రాణముమీఁదఁ [1]దీఁపుగల ప్రాణులకుఁ బిరుదుఁ వ్రతంబుఁ
గ,ల్యాణకరంబులే యనుచు నర్చనసేసి మదేభరాజమున్.

సీ. పిడియేనుఁగులవెంటఁ బడి పోక యుడుగని
వెడవిల్తు వేఁడిమివిడుపుఁ జూపఁ
గరమున నుదకంబు కడుఁ జల్లుకొనకున్నఁ
దెమలని మిహిరదాహము దొలంగ
సరసునఁ జొచ్చి తామరతూండ్లు మెసఁగక
మానని యాఁకటిమంట లేక
సింహపోతములు ఘోషింపఁ బుట్టినభయా
తంకాగ్ని తహతహ గ్రుంకఁబాఱ

తే. కొట్టివెట్టలుఁ దనమీఁద నెక్కలేక
పంచబంగాళమై పోవఁ బ్రాణలింగ
పూజనావిఘ్నమునయందుఁ బుట్టినట్టి
చింత యఱ వేఁకి దను లోనుచేసికొనియె. 125

తే. ఏమిసేయుదు ననియాత్మ సీమమునకుఁ
బోయి తనలోనఁ దలపోఁత బ్రుంగుడయ్యె
నెపుడు పడమటికొండపై నెక్కు భానుఁ
డెప్పు డుదయించు నేఁ బోదు నెప్పు డనుచు. 126

వ. అయ్యవసరంబున. 127

సీ. ప్రాగ్వధూమణి చిమ్మఁ బశ్చిమదిక్కాంత
పట్టిన చెంగల్వబంతి యనఁగఁ
గాలవిష్ణుం డంధకారదైత్యుని వ్రేయఁ
జరమాద్రిఁ బడిపోవు చక్ర మనఁగ

1. దీపిగల, తెంపుగల.

దినమహీరుహమునఁ దేజోమయంబుగాఁ
బండి రాలినపెద్ద పండనంగ
దివినుండి దేవదానవయుద్ధరక్తార్ద్ర
మై నేలఁ గూలు రథాంగ మనఁగఁ
తే. బద్మినీసంగమశ్రాంతిఁ బరిహరింప
నపరజలనిధి జలకంబు లాడఁబోవు
కరణి నెఱసంజచందురుఁగావిపచ్చ
డంబు ధరఁ బెట్టి భానుబింబంబు గ్రుంకె. 128

శా. తారాలోకమునం బ్రకాశ మొకచందం బై ప్రసాదింప సం
ధ్యారాగావృత మై తమఃపటల సంతానంబు గప్పంగ నం
భోరేఖల్ గళదశ్రుధారలగతిం బొల్పారఁగాఁ బోయెఁ గ
ప్లోరవ్రాతము నవ్వ లోకనయనుం డంధీకృతప్రాణి యై. 129

చ. తిమిరపుఁగాలసర్పవితతిన్ గుహ లీఁగి చనంగఁ దోలి య
భ్రము వడి నెక్కి చూచి దిగి పన్నగలోకముఁ జొచ్చి పోవున
ట్లమరఁ బతంగదేవుఁ డపరాంబుధిఁ గ్రుంకెఁ దదీయసేనఁ దు
త్తుములుగఁ బోరియున్ మగుడఁ దోడనె ధాత్రినిఁ గూడ
ముట్టఁగన్. 130

మ. విపులావాలము నిండి శైలగుహలన్ వేళ్వాఱి శాఖల్ దిగం
తపదమ్ముల్ పొదువన్ వియత్తలమునిూఁదన్ మించి యొప్పా
రు దట్టపుఁబెంజీఁకటిచెట్టుఁ జుట్టుకొనియుండం బొల్చెఁ దార
ల్తదీ,యపలాశాంతరదర్శితోర్ధ్వభువనోద్యద్దీప్తిఖండక్రియన్.

మ. సకలాపూర్ణుఁడు నీలవర్ణుఁ డనుటల్ సత్యంబుగాఁ దెల్పుపో
లికఁ బెంజీఁకటి నిండఁ దారకలు వొల్చెన్ నిర్జరాధీశ్వరా

దికు లర్పించిన పుష్పుల ప్లభవుఁ డద్దేవుండు భేదంబు గా
మికిఁ దెల్లంబుగ నల్పు దెల్పుగ ధర్షమించెన్ శశాంకా
కృతిన్. 132

మ. ఉదయగ్రావము పానవట్ట మభిషేకోదప్రవాహంబు వా
ర్ధి [1]ధరధ్వాంతము ధూపధూమము జ్వలద్దీపప్రభారాజి కౌ
ముది తారానివహంబు లర్పితసుమంబు ల్గాఁ దమోదూరసౌ
ఖ్యదమై శీతగభస్తిబింబశివలింగం బొప్పెఁ బ్రాచీదిశన్. 133

మ. గగనాహార్యమృగేంద్రశాబకము నక్షత్రాంబుజారణ్యమ
ధ్యగహంసంబు నిశావధూకరతలోద్యన్మల్లికాగుచ్ఛ మ
ధ్వగబాధావహచిత్తభూకటకయాత్రామార్తికచ్ఛత్ర మొ
ప్పుగతిం జంద్రుఁడు దోఁచె సంతతుల కింపుల్ మీఱఁగాఁ
దొల్దెసన్. 134

మ. గరుడానీతసుధాఘటంబుఁ గొనిపోఁగా నిర్జరశ్రేణి వెం
ట రయం బారఁగఁ బాఱు నాగముల చూడారత్నసందోహ
మం,బరవీథిం బరఁగింపఁ జంద్రుఁ డుదయింపం దోఁచెఁ దోడ్తో
నుడూ,త్కరముం జిందమృతంబుబిందువులశంకం గ్రమ్మఁగం
జేయుచున్. 135

చ. కుముదవనాళికిన్ బలుపుకోకముకాటకు నిల్పు దిగ్వధూ
సమితికిఁ బూఁత మేఁత నవశాబచకోరకరాజి కింపుకాం
తములకు ద్రావకం బగుచు కల్పకశాస్త్రనిరూపితౌషధ,క్రమ
ములఁ బండు వెన్నెలలు గాసె ధరాస్థలి మోహనంబుగన్.

ఉ. అప్పుడు పాము నేనుఁగు మహావ్రతవిఘ్న విషాద వేదనన్
ముప్పిరిగొన్న చింతఁ గనుమూయ నెఱుంగక నెమ్మనంబులో

1. దళద్ధ్వాంతము - అన్న దధపాస తప్పుడు.

నెప్పుడు తెల్లవాఱును సహింపఁగరాని విరోధవహ్ని నే
చొప్పున నార్తు[1] మొక్కొ యనుచుం దమలోఁ దలపోయు
చుండఁగన్. 137

సీ. నిర్నిద్ర పూర్వాద్రినీపప్రసూనాభి
రామాంబురాశి తరంగ మనఁగ
భానుభిల్లగభస్తిభల్లభగ్నతమోచ్చ
భల్లనిర్యద్రక్తపంక మనఁగ
రజనీసుధాకర రతివియోగనిదాన
కామప్రతాపాగ్నిధామ మనఁగఁ
సంధ్యాధిదేవతాచారుపీఠ[2] ప్రాంత
పద్మరాగప్రభాపటల మనఁగఁ
తే. గాలరసవాది బ్రహ్మాండగోళ మెల్లఁ
జిత్రబుద్ధి సువర్ణంబు సేయఁ దలఁచి
ద్యుమణి శిఖిమీఁదఁ జల్లుసిందూరరాజి
యనఁగ నొప్పారె నరుణశోణాంశురాజి. 138

ఆ. పన్నగంబు గజము బలమునఁ జలమునఁ
బోరు టెట్లొ శివునిఁ బొందు టెట్లొ
చూడవలయు ననుచు వేడుకతో వచ్చు
కరణి నంతఁ దోఁచెఁ గర్మసాక్షి. 139

వ. అంత. 140

ఉ. భానుఁడు పూర్వపర్వతముపై నుదయింపకమున్నె లేచి కుం
భీనసవల్లభుండు మదిఁ బేర్చిన రోషభరంబున న్నిజ

1. నొక్కొ...దనలో...2. ప్రాంత.

స్థానము నిర్గమించి పగఁ జంపఁగ వచ్చు కటారి కాని చం
దాన మహేశ్వరుం గదిసి తా నొనరించిన పూజ లేమికిన్.

క. కటకటఁబడి యిఁక నెటువలె
నటు కానీ వానిఁ దీర్తునటు కాదేనిన్
నిటలాక్షున కర్పింతుం
జటులగతిం బ్రాణములు నిజంబుగ ననుచున్. 142

ఆ. పిన్నరూప మగుచు బిల్వశాఖాంబుజ
నాళమధ్యసీమఁ గాళనాగ
మడఁగి[1]యుండ దంతి యతివేగమున వచ్చి
శివునిపూజఁ జూచి చిత్త మలర. 143

ఉ. ఈసక లేశ్వరుంకు కరుణేక్షణుఁ డయ్యెనొ విఘ్నకర్తసం
త్రాసమునొందెనో. వ్రతముధన్యతఁ బొందెనొ పూర్వజన్మ వే
ళాసుకృతంబు పండెనొ కళానిధిశేఖరమౌళి నేఁడు నేఁ
జేసినపూజ నిల్చె నని శీఘ్రమున న్మనమంది క్రమ్మఱన్. 144

ఆ. డాఁగియున్నపాము డాయకపోయెఁగా
దాయ యనుచు రోషదహనశిఖలు
కన్నుగొనలఁ గ్రాలఁగా నుండ నాకీడు
గాన కిభవరుండు గాన కేఁగి. 145

వ. నీరేరుహ మాలూర దళభరంబులు కరంబునఁ జుట్టి పట్టుకొని
సమీరంబున జడియు నడలచప్పు డప్పు డినుమడింపఁ గంపించి
గుంపు విచ్చిమృగంబులు మొగంబు లెత్తుకొని పాఱం గా
రుణ్యరసతరంగం బగు శివలింగంబుఁ జేరం జనుదెంచి డించి
పాపహృదయశల్యం బగు నిర్మాల్యంబుఁ దుడువం దలంచి.

---

1. యుండె.

శా. శుండాలంబు కరంబు సాఁప ఫణిరాజు న్మెచ్చి నాపూజ భ
ర్గుఁ డీవేళ ననుగ్రహించె నని ముక్కుంగ్రోళ్లలో నెక్కి యు
ద్దండక్రీడఁ దదీయకుంభకుహరస్థానంబునం ద్రిమ్మరన్
గొండ ల్గూలఁగ నెత్తి మొత్తుకొని దిక్కు ల్మట్టగీపెట్టుచున్.

సీ. మొగలేటిమడుఁగున మునిఁగి తుండమ్మున
నుదక మాకర్షించి యూఁది యూఁది
కడుఁ గపాలము దాఁకి కలఁ గంగఁ జక్కఁగాఁ
జేసాఁచి జిఱ్ఱునఁ జీఁదిచీఁది
యిలమీఁదఁ దలదాఁకనీ ప్రక్క నాప్రక్కఁ
బెడమర్లుగాఁ బొడపెట్టిపెట్టి
యుడివోని వేసననున్న చో నుండక
పనిలేనిపనువులు పాఱిపాఱి

తే. పెద్దమ్రాఁకులతోఁ గుంభపీఠయుగముఁ
దోముకొనుచును జెట్టులు దూఱితూఱి
పాము సేసిన దుఃఖంబు సామజంబు
దీర్చుకొనువెర వెఱుఁగక ధీరబుద్ధి. 148

శా. ఏనా చచ్చుట తప్ప దిప్పుడు నుమాధీశోపకంఠంబునన్
దానుం జావక చంపనోప దురగేంద్రం బెక్కు డీదుఃఖమే
లా నాకున్ సరిచంపి చచ్చుట జనాహ్లాదంబు గాదా యవా
చీనస్థాణునగంబె వధ్యశిలగా సేవింతుఁ గాకింతటన్. 149

మ. అని మత్తేభము చిత్తజాహితుని దిక్కై మ్రొక్కి యుక్కా
ళ మే, కనుమం బోవునో యంచుఁ దుండ మిఱియంగాఁ
జుట్టి వక్షస్థలంబునఁ గీలించి పిఱిందికిం జని శిరంబు న్వంచి

యకొ్కండ భృగ్గునఁ దాఁకె న్వడిఁ గుంభము ల్వగులఁ ద
త్కూటంబు లూటాడఁగన్. 150

ఆ. కొండకొండతోడ గుంకులుఁ గూలంగ
దాఁకినట్లు దోఁచె దళితకుంభ
సీమ నున్న పాము చిదిసె నేనుంగును
బడియె నెత్తు రచటఁ [1]బడియె గట్టె. 151

వ. తదీయ మరణస్థానంబు నవాచీనకైలాసనికటంబును సువర్ణ
ముఖరీతటంబు నగుటం జేసి కాద్రవేయ భద్రగజంబులు
రుద్రగణాకారంబులు దాల్చిరి. అమ్మహాలింగ మధ్యంబునం
దుండి కొండలతేనికూరిమికూఁతుతోడం గూడి చంద్రచూ
డామణి వృషభవాహనారూఢుం డై హ్రూషీకేశ పితామహ
ప్రముఖ బర్హిర్ముఖులు గొల్వం బ్రత్యక్షుం బై మీ కభీష్టంబు
లెయ్యవి యని యానతిచ్చుటయు సాష్టాంగదండ ప్రణా
మంబులు గావించి యి ట్లని సన్నుతించిరి. 152

రగడ. జయజయ కలశీసుతగిరికన్యా
శైవలినీతట కల్పమహీరుహా
జయజయ దక్షిణ రజత క్షితిధర
సంయమి సేవిత పాదసరోరుహా
జయజయ పీన జ్ఞాన ప్రసవా
చలకన్యాకుచదృఢపరిరంభణ
[2]జయజయ కృతదుర్గాధరణీధర
సానువినోదవిహారవిజృంభణ

1. పడియ గట్టె. 2. జయకృతదుర్గా ధరణీధర నవ.

జయజయ భారద్వాజాశ్రమ నవ
సరసిజకేళీవనపరితోషిత
జయజయ నీలక్ష్మాధర పుణ్య
స్థల కాపాలికభాషితభూషిత
జయజయ మోహనతీర్థాలోకన
సంభ్రమరతభవబంధవిమోచన
జయజయ శిఖతీర్థాశ్రితయోగీ
శ్వరమానససంవిత్సుఖసూచక
జయజయ సహస్రలింగాలయ ద
ర్శనమాత్రస్థితమోదాపాదక
జయజయ ఘనమార్కండేయమునీ
శ్వరతీర్థనిషిక్తవిపచ్ఛేదక
జయజయ నిర్జరనాయక తీర్థ
స్నాతక జనకలుషేంధనపావక
జయజయ కరుణేక్షణ రక్షితనిజ
చరణాయుణపంకేరుహసేవక
దేవా నిను వర్ణింప రమాధా
త్రీపతి వల్లభు లైనను శక్తులె?
నీవిధ మెఱుఁగక నిఖిలాగమముల
నేర్పరు లైనను జీవన్ముక్తులె?
కొందఱు సోహమ్మని యద్వైతా
కుంఠితబుద్ధి న్నిను భావింతురు
కొందఱు దాసోహమ్మనిభక్తిని
గుణవంతునిఁగా నిను సేవింతురు

కొందఱు మంత్రరహస్యము వని నినుఁ
గోరి సదా జపనియతి నుతింతురు
కొందఱు హఠయోగార్థాకృతి వని
కుండలిచే మారుతము ధరింతురు
తుది నందఱుఁ దమయిచ్ఛల నేయే
త్రోవలఁ బోయిన [1]చిద్రూపమ్మును
గదియక గతి లేకుండుట నిజముగఁ
గని చాలింతురు మది సంతాపము
నిను సేవించిన కృతకృత్యుఁడు మఱి
నేరఁడు తక్కిన నీచులఁ గొల్వఁగ
నిను శరణం బని నిలిచిన ధీరుఁడు
నేరఁడు తక్కిన చోటుల నిల్వఁగ
నీ వనియెడునిధిఁ గాంచిన ధన్యుఁడు
నేరఁడు తక్కిన యర్థము గోరఁగ
నీవే గతి యని యుండెడు పుణ్యుఁడు
నేరఁడు తక్కిన వారలఁ జేరఁగఁ
భవదుర్వాసన పాయదు మీపద
పంకజముల హృదయము వాసింపక
చపలతఁ గలఁగవు సకలేంద్రియములు
సతతమ్మును నిన్ను నుపాసింపక
జనన మరణములు ధరలో నిన్నును
సమ్మతితో సేవింపక పాయవు

1. నీచిద్రూపము.

మనమునకును మీ చిన్మయరూపము
మఱగింపక యణిమాదులు డాయవు
[1]మీమాహాత్మ్యము మే మింతంతని
మితిచేయఁగ మది నెంతటివారము
మామీఁదను గృప గల్గి మహేశ్వర
మన్నింపుము నీకు నమస్కారము. 153

శా. ఈసంసారపయోధిలోనఁ బడి మే మీఁదీఁది దేహంబుపై
నాస ల్మానక తేలుచు న్మునుఁగుచుం బ్రాణప్రయాణోన్ముఖా
యాసంబుల్ శతసంఖ్య లోర్చితిమి దేవా మమ్ము రక్షించి మి
థ్యాసౌఖ్యంబులు చాలు! నిత్యసుఖ మిమ్మా యంచుఁ
బ్రార్థించినన్. 154

శా. డాయం బిల్చుచు వారి నిద్దఱి నఖండజ్ఞానరూపంబునన్
వ్యాయామంబు నదృశ్యవస్తువు నమాయాకారముం బు
ష్కర, ప్రాయంబున్ విమలంబు నైన తనసర్వవ్యాపకజ్యోతి
లో, సాయుజ్యం బొనఁగూర్చె దేవతల కాశ్చర్యంబు
సంధిల్లఁగన్. 155

క. ఆలిం గూడుచుఁ గ్రమ్మఱ
నాలింగమునందుఁ గలసె నదిమొదలుగఁ జం
ద్రాలంకారుఁడు జగతీ
పాలక శ్రీకాళహస్తిపతి యనఁ బరఁగెన్. 156

క. నావుడు విని యాదవ ధర
ణీవిభుఁ డిఁక నెవ్వ రందు నీలగ్రీవున్

---

1. మీమహత్త్వమును.

సేవించి ముక్తికాంతా
జీవేశ్వరులైర టన్న శివుఁ డిట్లనియెన్. 157

శా. కామ క్రోధ మదాంధకార పటలాఖండప్రచండార్క వే
ధో ముఖ్యక్షయతాండవభ్రమణనిర్ధూతప్రపంచా పుర
శ్రీ మాహాత్మ్యహర ప్రభావ దశదిక్చేలప్రభేద స్ఫుర
ద్ధామా కాల జయేందిరా మదవతీదాంపత్య నిత్యోదయా.

క. లుంటీకృతాఘ ముక్తిచి
రంటీ గాఢోపగూఢరత చిద్విద్యా
ఘంటాపథచర తారక
ఘంటారవ హృతమనోమృగవ్యాధేశా. 159

పంచచామరము. దివానిశోదయావసార [1]దిగ్వితానమండితా
జవంజవాంధకారసత్వసంచిదభ్రమండితా
దివాకరాదిక గ్రహోగ్రదీధితి ప్రసాద వా
గ్ధవాండభావకాదితత్త్వతారకక్షపాధవా. 160

గద్యము. ఇది శ్రీమత్కాళహస్తీశ్వర చరణకమల సేవా
పరాయణ సింగమరమానారాయణ జక్కయ నారాయణ
తనూభవ భవపరాఙ్ముఖ ధూర్జటి ప్రణీతంబైన
శ్రీకాళహస్తిమాహాత్మ్యంబునందు
ద్వితీయాశ్వాసము.

---

1. దిగ్విహీనఖండితా.

శ్రీ ర స్తు

# శ్రీ కాళహస్తి మాహాత్మ్యము



## తృతీయాశ్వాసము

ధరనయనాబ్జసమా
రాధితదివ్యాంఘ్రిశోణరాజీవ! మనో
బాధావహాసంసార
వ్యాధిప్రజవైద్య! కాళహస్తీశ! శివా! 1

ఆ. అవధరింపు మిట్లు భవదీయకథ విన్న
వెంతు భక్తజనుల వీను లలర
మీఁదు యాదవునకుఁ గారుణ్యరసపూరి
తేక్షణముల నానతిచ్చినట్లు. 2

కన్నప్ప యను తిన్ననిజన్మభూమివర్ణనము

ఉ. పొత్తపినాటిలో విపినభూమిఁ గిరాతుల కాటపట్టు లో
కోత్తరవన్యవస్తు వుడుమూ రను పక్కణ మొప్పుఁ దద్రమో
దాత్తమహత్త్వ మద్భుతరసావహ మూహ యొనర్ప మేదినీ
*భృత్తట నిర్ఝరాంబురుహబృంద సుగంధ సగంధవాహమై.

*దీని తరువాత 'మఱియును' అని యొక ప్రతిలోఁ గలదు.

సీ. స్తబ్ధరోమవిషాణలబ్ధమౌక్తికములఁ
బాటింపుదురు రేగుపండ్లపాటి
ముక్తకంచుకమస్తముక్తాఫలంబుల
మందలింతురు [1]కురువిందలట్లు
సమద సామజకుంభజములైన ముత్తియం
బులఁ జూతు రుసిరికాయల విధమున
వేణుజాతములైన యాణిపూసల నెంతు
[2]రూడుగపండ్లకు నీడుగాఁగ
తే. గంధసారాగురుద్రుమ కాష్ఠఖండ
చయము నమయింటి వంటకట్టియలు గాఁగఁ
జేయుదురు కాఁపురంబులు సేయునపుడు
చెంచెతలు చెంచులను గూడి చిత్రలీల. 4

ఉ. సంకుమదంబునుం బునుఁగుఁ జాఁదును గస్తురియున్ ఘటం
బులం, బంకముఁ జేసి గుండ్లలికి ప్రత్యహము న్వెలిపైవ మార్గ
కూ,లంకష గోమయప్రతతులం బుగడించుచు నుండుఁ గుప్ప
లై, యింకఁ దదీయభూతి నిదమిత్థ మటంచు నుతింప శక్యమే?

సీ. పట్టుచీరలఁ గట్ట భాగ్యంబు గల్గియుఁ
బౌలుటాకులఁ గట్ట భార మనరు
రాజాన్నభోజనప్రాభవశ్రీ గల్గి
యును వన్యధాన్యంబు నొల్ల మనరు
మాణిక్యభూషాసమాజంబు గల్గియు
నెట్టని [3]కురువింద లేటి కనరు

1. గురివెంద. 2. కూడఁగఁబండ్ల. 3. గురివెంద.

మంచిమెచ్చులతూఁగుమంచము ల్గల్గియుఁ
జాలుఁ బూఁదీఁగయుయ్యాల లనఁ

తే. ఎంత సంపద గల్గియు నెట్టివారుఁ
దమ కులాగత ధర్మకర్మములు విడువఁ
[1]జాల రటుగానఁ దత్పురీశబరసతులు
మహిమ గలిగియు మానరు సహజవృత్తి. 6

మ. అగురుక్ష్మారుహ కాష్ఠఖండముల సర్వాంగంబులం జేసి [2]మై
మృగనాభిన్ మసిఁ బూసి చామరము ధమ్మిల్లంబుగాఁ జుట్టి యే
నుఁగుకుంభమ్ములలోని ముత్యములఁగ స్రుద్దు ల్వినిర్మించి భి
ల్లగజేంద్రు [3]ల్వాఅబొమ్మలం దవిఁదచేలం జేయుదుర్ గాపు
గన్. 7

క. ఏనుఁగుల తలలు కొమ్ముల
త్రో నాకబములకు దృష్టిదోషము వాయం
గా నెత్తుదు రెఱుకులు దమ
చేనికిఁ బసరంబుతలలచెలువం బెసఁగన్. 8

క. కొండలలోఁ జేసిన తమ
పండినచేలకు వరాహపంక్తులు చొరరా
కుండం దెల్లని చామర
ఖండంబులు ప్రోఁగుఁద్రాళ్లఁ గట్టుదు రెఱుకుల్. 9

ఉ. మంచెల మీఁద నెక్కి కటిమండలిఁ జుట్టిన పాఱుటాకు లిం
చించుక చంచలించి మకునిల్లు బయల్పడఁ జేయఁ బిట్టులన్

1. బోలరటుగాన. 2. పై. 3. ల్వాఅబొమ్మలంచుఁ బెడచేలం గట్టు
దుర్గాపుగన్.

జెంచెత లార్చి ప్రేయుదురు చిత్రముగా నొడిసెళ్ల బాహా
మూ,లాంచిత దీధితు ల్చిలుతయైన చనుంగవమీఁదఁ బర్వఁ
గన్. 10

మ. మదపుంస్కోకిల మాత్మజాతికృతసమ్యజ్ఞాద [1]శంకామతిన్
వదరంగా [2]నల వేటలాడెఱుకుగోవాళుల్ ప్రసూనాశుగ
ప్రదర ప్రేరిత చిత్తవృత్తులగుచుం భ్రాంతమ్ములం ద్రిమ్మరన్
బెదరం దోలుదు రార్చి పక్షివితతిన్ భిల్లాంగనల్ చేలలోన్.

తే. శబరకాంతా ఘనస్తనశాతకుంభ
కుంభ యుగములఁ గరకరి కొనలుసాగె
మానుపఁగ వచ్చునే చంపరాని పగయు
నన్నదమ్ములపోరాట మజునకైన. 12

క. గుబ్బచనుంగవ తేనియ
లుబ్బెడుమోవియు మెఱుంగు లొలికెడు మేనుల్
నిబ్బరపుంగబరీభర
మబ్బురపుంగొను [3]చంచలాక్షుల కొప్పున్. 13

క. తేనియలు క్రోలి పిదపన్
మానవతుల యధరమాని మఱతురు శబరుల్
తేనియ తియ్యఁదనంబు స
మానం బనఁ దగునె యధరమధురిమ కెందున్. 14

సీ. కఱకుజుంజులు వెండ్రుకలకొప్పు గాఢత
రంబుగా నెమలి పింఛంబుఁ జుట్టి

1.శంకారతిన్. 2. నట వెంటలాడెఱుకు. 3. చెంచుటాండ్రర.

తట్టుపుస్గున వన్నె పెట్టినట్టి లలాట
పట్టికి జేగురుబొట్టు వెట్టి
[1]కురువింద పేర్లకుం దెరువీనిపాలిండ్లం
బాలుటాకులు గూర్చి పైటం దీర్చి
జమలి యొడ్డాణంబుసందున నిఱియంగ
బర్హాంబరముం గటిం బదిలపఱిచి

ఆ. వీంక గల కుఱుచగనుపుల వెదురువింటం
జాగపురిం దాల్చి నారిగా సంతరించి
గసికకోలలు గొని భిల్లబిసరుహాక్షు
లడవిం దిరుగుదు రాత్మనాయకులం గూడి. 15

మ. తమ యిల్లాండ్ర మనోహరావయవ సౌందర్యంబుతో సామ్య
వర్గము పాటింపంగనో కిరాతులు నిజాగారంబులం గట్టి సిం
హ మయూరీ హరిణేభ శాబముల నాహా! పెంతు రాశంకం ద
ద్రమణీ మధ్య కచేక్షణ స్తనము లుత్పాదింపం గాకుండునే.

వ. ఇట్లఖిల విభవాభిరామంబున కాలవాలం బగు నప్పక్కణం
బున కధీశ్వరుండు. 17

సీ. తన విక్రమక్రమదర్పంబు హర్యక్ష
శిశూపిచక్షణాక్షీణగరిమ
తన బాహుబలము కాంతారదంతావళ
దయితా నవీన వైధవ్యకరము
తన జనంబు కురంగదంపతిపుంజాజ
వంజవ భంజనాఖంజయశము

1. గురివెంద.

తన ప్రతాపము మృగాదనసార్వభౌమదు
ర్వారగర్వాపహారదారుణంబు
తే. గాఁగ నానామృగప్రాణగంధవాహ
దంశశూకేంద్రనారాచబృందవర్ష
కంధరోద్దండకోదండకరుఁడు మించె
నాథనాథుం డరణ్యభూనాథుఁ డగుచు. 18

తే. ఎఱుకుఁతేఁడైన సర్వలోకేశుఁ గూడి
చెంచుప్రూఁబోఁడియై సంచరించుగౌరి
చందమున నాథనాథపుళిందవిభుని
మందగామిని చెలువొందెఁ దండె యనఁగ. 19

తిన్ననిజననము

క. ఆనాథనాథకానన
భూనాథుఁడు తందెచిగురుఁబోఁడియు సురతే
చ్ఛానందము గిరికందర
నానువనీనిర్ఝరముల సలుపఁగఁ బ్రీతిన్. 20

క. తందెకు మందస్మితజిత
కుందకుఁ బ్రాణేశ్వరోపగూహనరచితా
నందకు వచనామృతవి
ష్యందకు నెల మసలె శైలజాధిపుకరుణన్.* 21

సీ. భసితాంగరాగశోభావిలాసంబుతోఁ
బ్రతివచ్చు నాననపాంశుగరిమ

* కొన్నింట నిది 'భసితాంగరాగ...' పద్యము తర్వాతఁ గలదు.

కంఠహాలాహలకాళిమచ్ఛవితోడ
నెనవచ్చు గుబ్బచన్నొనలనలుపు
పరశివాకృతితోడ సరివచ్చు నణుతరం
బనఁజాలి ఘనతరం బైననడుము
స్వస్వరూపవిచార సంప్రాప్తశాంతితో
మార్పడుఁ జిత్తైధమానజడిమ

తే. సరభసానంగసంక్రీడ జరుగనీక
దౌహృదము గర్భమున నున్న తనయుఁ డీశుఁ
డై ప్రకాశింపఁ గలఁ డని యపుడు తెలుపు
కరణిఁ బెంపొందె నమ్మంబుగామినికిని. 22

తే. గంధగజకుంభ కాఠిన్యగర్భరేఖ
చాటుమృగరాజమధ్యశృంగారగరిమ
చెఱుపఁగలఁ డల్లశిశు వని చెప్పునట్లు
సుదతిచన్నులు నడుమును సొబగు దప్పె. 23

సీ. పంచాననానేకపవ్యాఘ్రకోలాది
మృగములఁ జంపఁ గామించె లేమ
శైలోపకంఠనిర్ఝరసైకతస్థలి
శివుని దర్శింపఁ గాంక్షించె నబల
ఖండేందుశేఖర గండూషితాంబుధా
రల మజ్జనము సేయఁ గలఁచె నింతి
చవిదైన ఘోణిమాంసమ్ము దొప్పలఁ బెట్టి
యభవున కర్పింప నతివ గోరె

తే. నేత్ర నీలోత్పలంబుల నీలగళుని
యర్చనము సేయఁ జింతించె నంబుజాక్షి

గర్భగోళమునం దున్న యర్భకునకుఁ
గలగుణంబులఁ దెలిపెడుకరణి నపుడు. 24

ఉ. ప్రొద్దులు సొచ్చె నంతఁ బువుఁబోఁడికిఁ బెంపుమెచిల్కపిల్లకున్
సుద్దులు చెప్ప వస్త్రములు సొమ్ములు దాల్ప నిజేశుపాన్పుపై
నొద్దిక నుండ నిత్యము గృహోచితకృత్యము లాచరింప మైఁ
బెద్దయుఁ గ్రాంతి గాఁ బొడఁగె బిడ్డఁగనన్ సమయంబు
గావునన్. 25

చ. చెలువకు బిడ్డకుట్లు విలసిల్లఁగ భిల్లపురంధ్రు లంతలోఁ
బిలువరె మంత్రసానిఁ దలపెట్టరె కాయముఁ గూర్ప లేమకున్
జలకముఁ గాఁపరే కొలను చయ్యనఁ ద్రవ్వరె మంచగామి
నిన్, నిలువఁగనీకురే యనుచు నేర్పరులై కడు సంభ్ర
మింపఁగన్. 26

సీ. శుభముహూర్తంబున నిభరాజగామిని
శివభక్తి మునుపైన శిశువుఁ గనియె
సంసారమోహపాశముఁ గోసినటువలె
బొడ్డుగోసిరి పిన్నబిడ్డనికిని
సర్వేశు భక్తిలక్షణముఁ దెల్పెడు రీతిఁ
బెట్టి[1]రి భూతితోఁ బొట్టిపెట్టిఁ
బాపకదంబజంబాలంబుఁ గడిగెడు
పగిది నీళ్లార్చిరి పాపనికిని
తే. నంతరంగమలాపహం బైనచిత్సు
ధారసము వోనిచిట్టాముదంబు దెచ్చి

1. విభూతితో బొట్టుపెట్టి.

[1]బాలునకుఁ గడుపునకుఁ బెట్టి పద్మముఖులు
పవ్వళింపఁగఁ జేసిరి పాన్పుమీఁద. 27

క. జ్ఞానప్రసూనకళికా
జాని పదధ్యానపరమసౌఖ్యసుషుప్తిం
దైనగతిఁ గన్ను దెఱవం
గా నేరకయుండె కొన్నిఘస్రంబులకున్. 28

క. ఈలోకవ్యాపారం
బేలాగో యనుచుఁ జూడ నింపైనగతిన్
బాలకుఁడు దెఱచెఁ గన్నులు
లాలితముగఁ దల్లిదండ్రులకు ముదమొదవన్. 29

సీ. శివభక్తిరహితమై చెడియె జగం బని
నవ్వినట్లాయె నవ్వసాఁగె
ధృతిమోహబంధంబు తెగఁ దన్నుగతి ముద్దు
టడుగు లెత్తి [2]విదిల్చు కాడఁజొచ్చె
భవపరాఙ్ముఖుఁడైనపగిది పత్త్రమ్ముఁ గూడి
పొత్తులపాన్పుపైఁ బోరలఁబడియె
శ్రీయోమహారాజ్యసింహాసనంబున
నుండుచందమునఁ గూర్చుండఁ దొడఁగెఁ

తే. దడవియాడె వసుంధరాస్థలమునందు
విశ్వపతి తత్త్వ మనుమణి వెదకురీతి
దర్పకారి జగత్పూర్ణుఁ దాఁకుస్థితి
నడుగు వెట్టెడుగతిఁ దప్పటడుగు వెట్టె. 30

1. బాలకు కడుపునకు. ము. పా. 2. విదిల్చియాడఁ.

వ. ఇట్లు ప్రతిదిన ప్రవర్ధమానంబులగు నతని [1]గుణంబులు శివ
భక్తిలక్షణోపమానంబులు సమానంబులై చెలువొందఁ
దండెయుఁ బుళిందబృందారకుండును నందను తిన్నదనంబున
కానందకందళితహృదయారవిందులై తిన్నఁడని పేరువెట్టిన
నప్పు డవ్యక్తమధురకల్యాం బగు బాల్యంబున. 31

మ. జలకంబార్చి విభూతిఁ బెట్టి కటిగుంజాబీజసంకీర్ణ మే
[2]ఖల బంధించి మయూరపక్షలతికాకాండంబులం జేసి సం
దిలిదండ ల్సవరించి కన్నుఁగవఁ గాంతిం గాటుకం దీర్చి మం
దులతాయెత్తులు గట్టినన్ శబరపుత్రుల్ గూడి యాడం
బురిన్. 32

సీ. [3]చిట్లపొట్లకాయ సిరిసింగణావత్తి
గుడుగుడుగుంచాలు కుందెనగుడి
డాఁగిలిమ్రుచ్చులాటలు [4]గ్రచ్చకాయలు
వెన్నెలకుప్పలు తన్నుబిల్ల
తూరనతుంకాలు గీరనగింజలు
పిల్లదీపాలంకి బిల్లగోడు
చిడుగుడువ్వాలపోటి చెండుగట్టినబోది
యల్లియుప్పనఁబట్టె లప్పళాలు
తే. చిక్కనాబిల్ల లోటిల్లుచిందఱాపి
యైన శైశవక్రీడావిహారసరణిఁ
జెంచుకొమరులతోడ నుద్ధించుకాడుఁ
దిన్నఁ డభినవబాల్యసంపన్నుఁ డగుచు. 33

1. గుణంబులకు. ము.పా. 2 ఖల. 3. చిట్లబొట్లాకాయ. ము.పా.
4. గొచ్చకాయలు.

తిన్నఁడు విలువిద్య నభ్యసించుట

ఉ. కొంచెపునింటిబ్రద్ద బరిగోలలు గైకొని చాపవిద్య సా
ధించునెడన్ పలంఘునగతిం జను లేడిని నింగి నిచ్చ వ
ర్తించు ఖగంబు నేయఁ గని తిన్నఁడు దేవునిపాలుగాక సి
ద్ధించునె తల్లిదండ్రులకు వృష్టిగుణంబున నండ్రు లుబ్ధకుల్.

తే. విల్లుపట్టిన నెలపదినాళ్ళలోన
వీఁక కలిగిన తడవిల్లు వెదురువిల్లు
సెలసువిల్లును మొదలైన చేఁగవిండ్లు
చులుకగాఁ దీసి శబరేంద్రసూనుఁ డేయు. 35

వ. ఆసమయంబున నవయౌవనం బాసన్నం బగుటయుఁ దిన్న
నికి బహువిధమృగయావిహారంబుల తెఱం గెఱుకపఱుప
వలయు నని వనచరు లెఱుకుఱేనికిఁ విన్నవింప నింపెసలార
నాతం డాటవిక పుటభేదనంబునం గాటిఱేనిజాతరకుం
జాటం బనుప నచుపమేంద్రనీలనీలకుటిలకుంతలజాలఫాల
పట్టికల [1]జేగుఱుబొట్లు మంజరిమంజుల స్తనభారంబులు, బిస
కాండమండిత దోర్దండంబులు, నెమలిపురిగండలు, కర్ణంబుల
నవతంసీభూతమయూరపర్ణంబులు, ఘనంబు లగు జఘనంబుల
మీఁదఁ బాఱుటాకులచీరలు, కొప్పులకు నచ్చంబు లైన
కురువక ప్రసవగుళుచ్ఛంబులు, నరుణచరణకమలపృష్ఠ భాగం
బుల లాక్షారసంబులును, పాటుకరేని లేఁజిచూపులం దుటా
రించు కటాక్షవీక్షామాధుర్యము గల కన్నెకొమ్ముల మను
నమ్ములం జమరుబాపటంబుపోని కాటుకరూఁ బునుఁగును
బచ్చికస్తూరియు జవ్వాదియు వాసించి పరిమళించు నడవి

1. జిగురుఁబోండ్లు.

పసుపు నునుంబూంతయుం దనర ననచరవనరుహనయనలు తిరుగం జాటిన మఱునటి మంగళవారంబున నివ్వరిబియ్యం బునఁ బువ్వులవలె నుండ వండి వార్చిన యుపహారభాండం బులు చరీమమృగంబులపాలకు ననుకూలం బైన గునుకుం బ్రాలపాయసంబులకుండలు కీచకతండులంబులం బిండి గొట్టి కొట్రపోసి యుప్పి గొప్పలుగాఁ జేసి యావించిన కుడు ముల బానలు కాళింగభంగసంగతలశునవాసనాపిశితంబు లగు పిండికూరలచట్లును బచ్చగందసీక పరిపాకంబులు చేసిన వనీశాకంబుల వెసళ్లును నానావిధమాంసంబులయటికలు గుడా గుడగుడపుష్పతాఁహింతాలతంచులజనితాసవకల శంబులును గంపలను గావిళ్లను బెట్టి బలివెట్టుటకై వన క్రోడ తామ్రచూడ మహిషాజావిక ప్రముఖాటవిక మృగంబులం బట్టుకొని బంతికట్టుకొని కాట్రనుగుడికి నడుచునప్పుడు తప్పెటల చప్పుళ్లును వెఱ్ఱిసొరకాయల బుఱ్ఱలం గట్టిన సరకట్లకిన్నరలు మెఱయ మొరయించు మ్లేచ్ఛులపాటల తానమానంబులును గుమ్మెటలచటులరవ మును గొమ్ముల నిమ్మును జెలంగె నయ్యవసరంబున. 36

తే. ఒక్కప్రొద్దుండి సెలయేట నుదకమాడి
నాథనాథుండు తండెయు నైజ మైన
చతురలంకారములు దాల్చి సహజభక్తి
నాత్మజునిఁ జూచి కైసేయు [1]మనిన నతఁడు. 37

మ. జలకం బాడి విభూతిపెట్టుకొని రక్షామాలికామాలికా
వలయంబుల్ ధరియించి దట్టి గట్టుక శిరోవర్ధిష్ణునీలాలకం

1. మన్న. ము. పా.

బుల లేఁడీఁగను జుట్టి కేల విలునమ్ము లూని కాత్రేనిపూ
జలు సేయఁగ వెడలెం గుమారుఁడు పితృస్వాంతంబు లు
ప్పొంగఁగన్. 39

చ. చని మృగయాధిదైవతముసన్నిధి బాణశరాసనాదిసా
ధనములు నిల్పి యెఱ్ఱవిరిదండల నివ్వరిప్రాల రక్తచం
దనమున గుగ్గిలంపుఁబొగఁ బట్టుపునుంగున [1]నెత్తుఁజోతులన్
ఘనవివిధోప[2]చారములఁ గానుకలన్ శబరాళి గొల్వఁగన్.

తే. తల్లిదండ్రులుఁ దాను నద్దైవమునకుఁ
బ్రణతు లొనరించి వేఁటలుపట్టి పిదపఁ
బక్కణములోని శబరవంశజులతోడ
నన్నపానాదు లొనరించునవసరమున. 40

సీ. మాటలాడఁ దలంచి మఱచిపోయెడువారు
నడవఁ బోవుచుఁ ద్రొట్రుపడెడువారు
నూరకుండెద మని యుండనోపనివారు
లేచెద మని లేవ లేనివారుఁ
బని లేనిపని బట్టబయలుదిట్టెడువారుఁ
బాడ నేరకయును బాడువారు
నెదురైనవారికి నెల్ల మ్రొక్కెడువారు
వ్రీడావిహీనులై యాడువారుఁ
తే. జాలఁద్రావియు మగుడఁ జేసాఁచువారుఁ
దొడరి యుపదంశభాండము ల్దొడుకువారు

1. పొత్తి. 2. హారములు. ము. పా.

నైరి మృగయాధిదైవతయాత్రయందుఁ
బానములు సేసి శబరదంపతులు రతుల.[1] 41

ఉ. నాతియొకర్తు చిత్తముపనాథునిపై నిడి సారెసారె మో
[2]హాతిశయానఁ బోలె నధికాసవ మిచ్చి నిజేశుఁ గూర్చి య
ల్లాతని నాథుపేరనె ప్రియంబునఁ బిల్చుచుఁ గౌఁగిలించి హా
లా[3]తురతార్తి కాగతి విలాసముఁ జూపుచుఁ గూడె వేడుకన్.

చ. పుడిసెఁడుగాని లే దిపుడు పుచ్చుక త్రాగిన మద్య మింతలో
నొడ లెఱుఁగం డటంచు నొక యుగ్మలి నాథునిఁ దిట్టి
యన్యునిన్, జడియఁడు చూడు మంచు సరసంబును మెచ్చు
తెఱంగు దోఁప న,ప్పుడు బిగికౌఁగిటం గఠినపుంజనుగుబ్బల
నొత్తె మక్కువన్. 43

ఉ. ఉత్తమనాథుఁ డీతఁ డెదురుత్తరమీఁ డొకనాఁ డదే మొకో
యిత్తఱి రేఁగిరేఁగి తనయిచ్చకువచ్చినవెల్ల నాడెడిన్
గ్రొత్తలు గావె యీమధుపుకుండలమాటలు నూఱిపోసి
రో,యత్త యటంచు నొక్క శబరాంగన వల్లభు దూఱె
సారెకున్. 44

ఉ. మంకెనపువ్వులో విడిసి మత్తిలియుండెడు తేఁటిరీతి మీ
నాంకసరోజరాగకలితాభరణాంతరనీలలీల హా
లాంకురితారుణచ్ఛవిసముంచితలోచనతారకద్యుతుల్
బింకముఁ జూపఁ బానములపెక్కువఁ జొక్కిరి భిల్లదంపతుల్.

---

1. జోకిఁ దరువాత 'మఱియును' అని కొన్నిటఁ గలదు. 2. హాతి శయంబు. 3. తరళార్తి కాగతి.

### తిన్నఁడు పరిజనంబులతోడఁ గూడి వేఁటకు వెడలుట

వ. ఇవ్విధంబున మధుర మధు రసాస్వాదనామోద మేదుర వినోదంబులం గేలిసలిపి నిషాదమిథునంబులు సదనంబులకుం జనునప్పు డయ్యాటవికాధిపనందనుం డాఖేటకంబునకుం గాంచితనిచ్చాటియగుంగాక! యని యొనరించు దీవన లుల్లసిల్లఁ బల్లెయం బ్రవేశించి చెంచుతేఁడు మఱునాఁడు రేపకడఁ గొడుకుం గూర్పఁ దగినవారలం గూర్చి వేఁటకుం జను మనవుడుఁ జెరచీరకట్టలు ప్రోఁగుచుట్టలు దొడ్డివల లేఁతివల కుందేఁటివల పందివల సవరంగవల మకరీగల యెలుకవల మొదలుగా వలయు వలలును, సివంగులుఁ గుక్కలుఁ గృష్ణకురంగంబులు ముంగిసలు నెద్దులు మొదలుగా వేఁటకు దిద్దిన జంతువులు, నోరణంబులు నెలకట్లు పాశువంబులు గిద్దలు వేసడంబులు మున్నుగా విడివేఁటకు నెన్నందగిన విహంగంబులును, బూరేడు కాడకోడి కేరజంబు కౌంజు కక్కెర చింద లాదిగాఁగల పాదివేఁటకుం బ్రోవి చేసిన పతంగంబులు, నుసులు నురిగోలలు బోనులుఁ జిక్కంబులు జిగురుఁగండెలుఁ దీపుఁద్రాళ్లు నాడిత్రాళ్లుఁ దలముళ్లును గొని శరశరాసనప్రభృతిసాధనంబులతోడ నడవి కేతెంచి నిశ్శంక సకలమృగసంకులసంకలితం బగు వేంకటాచలంబు వంకం డెంకి వెట్టుకొని. 46

సీ. ఒకనాఁడు తెరవేఁట నుగ్రసత్త్వంబులఁ
బుడమిప్పెఁ దడఁగాళ్లుపడ వధించి
యొకసారి సారమేయోద్ధతి నుద్ధుర
స్తబ్ధరోమంబుల సంహరించి

యొకమరి దీమంబు లొడ్డి పాదులు దీర్చి
బహువిహంగంబులఁ బట్టి తెచ్చి
యొకవేళ డేగవేఁటకుఁ జని యెగఁజోపి
నానాండజముల ప్రాణములు గెడపి

తే. ముంగివేఁ టేదువేఁట సీవంగివేఁట
యిఱ్ఱివేఁటయు గంటవేఁ టెద్దువేఁట
మొదలుగాఁ గల వేఁటలయెడ నెఱింగి
తిన్నఁ డొక్కొక్కతూకు వర్తింపఁదొడఁగె. 47

చ. పులులు కురంగము ల్కిరటిపోతము లేదులు మన్నుఁబిల్లు దు
ప్పులు కణఁతు ల్కిటు ల్చివులపోతులు కొర్నవగండ్లు భల్లు
కంబులు చమరీమృగంబు లెనుపోతులు కస్తురిపిల్లు లాదిగాఁ
గలమృగరాజిఁ బెక్కువిహగంబులఁ గానుకలంపెఁ దండ్రికిన్.

ఆ. మునుపు వడిన మెకముఁ గొనివచ్చి మిడిగ్రుడ్లు
పొడిచి నీట శిరము దడిపి తోఁకఁ
గోసి ధూప మిచ్చి మాసంబుఁ బెకలించి
కాను కిచ్చి కాటిఱేనిఁ గొలిచి. 49

ఉ. క్రొవ్విన యేకలంబులను గొన్నిటిఁ గూల్చి కమర్చి పెంచు
లం,జివ్వుచు నెఱ్ఱిమ న్నలఁది చివ్వున నీ రిపురంగ నేర్చి నో
ళ్లువ్విళులూరఁ బ్రేల్చి చము రుట్టిపడం గఱుకుట్లు గాల్చి క
ల్జువ్వలనీడ నొక్క పరిశుద్ధ శిలాతలభూమి నందఱున్. 50

క. అట్టు కఱుకుట్లు గాల్చిన
పిట్టల నింజెట్ల మఱియుఁ బెరతేనియలం
బెట్టుక మెసఁగుచు నాథుని
పట్టికి నింపెసఁగ నిట్లు ప్రతిదివసంబున్. 51

ఉ. ఆననవీధిలోఁ గలమృగావళిఁ బక్షుల సంహరించి పూ
ర్వావనిభృత్తటాటవుల నాటవికుల్ మృగయావిహారముల్
చేవ దలిర్పఁ జేయుటకు శీఘ్రిమ పాళియ మెత్తి కుంభజ
గ్రావసుతాప్రతీరగిరికాననమధ్యమున న్వసించుచున్. 52

ఆ. అంజినాటికొండలందు సదాశివు
కొండ జమునిదిక్కు వెండికొండఁ
జండసత్త్వచండసంహార తాండవం
బాడఁ గోరి వేఁటలాడు నపుడు. 53

క. ఒకవేళఁ దిన్నఁ డాఖే
టకఖేలావ్యసనరతులు డస్సినవాఁడై
వికచప్రసూనవకుళ
ప్రకరంబుల నీడ నొంటిఁబడి నిద్రింపన్. 54

{ స్వప్నముచేతను వేఁటమిషను నీశ్వరుఁడు తిన్నని
వశీకృతుం జేసికొనుట }

మ. ఒడలం [1]దెల్ల విభూతిపూఁత పులితో లొడ్డాణ మల్లాడు కెం
జడ లాత్తైకవిచార నిశ్చలదృగబ్జాతంబు లచ్చైన క
చ్ఛడ మంసంబున రుండమాల గళదేశస్థాణువుం గ్రాలఁగా
నొడయం డొక్కరుఁ డక్కుమారుకలలో నుద్యత్కృపా
మూర్తియై. 55

క. బాలక! యిచట శిలావట
మూలంబునఁ గొండదండ మొగలేటి దరిన్
శైలసుతాపతి భక్తుల
పాలిటి పెన్నిధి వసించు [2]భక్తిఁ గొలువుమీ. 56

1. దెల్లనిభూతి. 2. భక్తిం గొలుమీ. ము. పా.

క. అని యంతర్ధానము సే
సినఁ దిన్నం డదరిపడుచు శీఘ్రంబున మే
ల్కని నలుదిక్కులు వెదకుచు
మనమున నాశ్చర్యరసనిమగ్నుం డగుచున్. 57

శా. ఈల ల్వ్రేఁకెలు దిక్కులం జెలఁగఁ బా ఱుచ్ఛొమ్మృగశ్రేణిపై
గాలిం బోనక సన్న దప్పటములు రోకాకొక్కముల్ దిట్టి శా
ర్దూలక్రోడ మృగాదుల న్వలలకుం దోలంగఁ దిన్నం డె త
త్కోలాహలోల రవంబు దన్నుఁ బెసు బోధింపంగ సేతెంచినన్. 58

మ. వలకుం జేరక ప్రోఁగులుం జెదలు త్రెవ్వం ద్రొక్కి యా
ఖేటకస్థల ముల్లంఘన సేసి లుబ్ధకులయత్నం బెల్ల వారించి ది
క్కులు ఘుమఘుమ ఘుర్ఘుర ధ్వనులచే ఘూర్ణిల్లఁగా నొక్క యే
కల మేగం గని తిన్నఁ డప్పుడు ధనుఃకాండోల్లసత్పాణి యై.

మ. జవ మొప్ప న్వెనువెంట నంటి తఱుముః సంవర్ధితశ్రాంతి ను
ద్ధవిడిం బాఱఁగలేని చందమునఁ జెంతం జేరఁగా నిల్చి యే
య విచారించిన దూఁటి దాఁటుకొని తన్నాశాలం ద్రిప్పి
పాశవిముక్తుం డగు యోగిభావన సుహృచ్ఛాంతవృత్తి వర్తిం
చుచున్. 60

క. అలయించుచుఁ దిన్నఁడు దన
కలలోపలఁ గన్న శివునిఁ గనుఁగొనుదాఁకన్
జలమునఁ గొని చని య య్యే
కల మప్పు డదృశ్య మైనఁ గమఁ జోద్యమునన్. 61

క. కలలోఁ జెప్పిన యొడయం
డెలయించుక వచ్చినట్టి యేకలము హిమా

చలతనయాధిపమాయా
విలసనములు గాఁగ నప్పుడు వివరించి మదిన్. 62

శా. సంతోషంబునఁ గాంచెఁ దిన్నఁడు సమస్తవ్యాపకానంతవే
దాంతస్థాపితచిన్మయాంగము నవిద్యాధ్వాంతసంతానసం
క్రాంతస్వాంతనిశాంతజంతుసుఖమార్గప్రాపకాభంగరు, క్కాం
తాపాంగము దివ్యలింగము వివిక్తధ్యేయ నిర్లింగమున్. 63

తే. కాంచి రోమాంచకంచుకోపంచితాంగుఁ
డగుచు నానందబాష్పంబు లతిశయిల్ల
నమ్మహాలింగమునకు సాష్టాంగనతులు
సేసి ముకుళితహస్తుఁడై చేరఁ బోయి. 64

తిన్నఁడు శివలింగమునకు సేవఁజేయుట

శా. ఓసామీ! యిటువంటి కొండదరిలో నొంటిం బులుల్ సింగ
ముల్, గాసిం [1]బెట్టెడు [2]కుట్రునట్టడవిలోఁ గల్జువ్విక్రీనీడ నే
యాపం గట్టితి వేఁగడ్డ నిలు? ని వాఁకొన్నచోఁ గూడు నీ
ళ్లెసుట్టంబులు దెచ్చి పెట్టెదరు? నీ కిం దేటికే లింగమా? 65

ఉ. కొండలఁ గానలం దిరిగి క్రొవ్విన పందుల లేళ్ల దుప్పులన్
జెండినఁ బెక్కుచందములఁ జిన్నక పెద్దక గారుకమ్మఁగా
వండుదు రట్ల పిట్టలను వండుదు రిచ్చుట నుండ నేల? నా
కొండొక టానతీక యుడుమూరికి రాఁగదవయ్య లింగమా!

క. ఓలింగమ! విను నివ్వం
ప్రాలును నాడిపిల్లు గునుకుఁబ్రాలును వెదురుం

1. బెట్టుక. 2. కుట్ర. ము. పా. (బ్రా. పా.)

బ్రాలును సవరపుమెకముల
పాలును గల వచట నీకుఁ బాయసమునకున్. 67

తే. పుట్టతేనియ పెరతేనె పుట్టజున్ను
తొఱ్ఱతేనియ గలవందుఁ దోఁచి తోఁచి
కాలి దులదుల నై పిండిపోలె రాలు
నట్టి నింజెట్లు గలవు నీ కారగింప. 68

సీ. నేరేడుపండులు నెలయూటిపండులుఁ
గొండమామిడిపండ్లు దొండపండ్లుఁ
బాలపండులు నెమ్మిపండులు బరివంక
పండులుఁ జిటిముటిపండ్లుఁ గలివె
పండులుఁ దొడివెందపండ్లుఁ బిమ్మికిపండ్లు
జానపండులు గంగరేనుపండ్లు
వెలగపండులు పుల్లవెలగపండులు మోవి
పండ్లు నంకెనపండ్లు బలుసుపండ్లు

తే. బీరపండ్లును బిచ్చుకబీరపండ్లుఁ
గొమ్మిపం డ్లీఁతపండ్లును గొంజిపండ్లు
మేడిపండ్లును మొదలుగాఁ గూడిమూడి
చెంచెతలు దెత్తు రిత్తు విచ్చేయవయ్య. 69

శా. ఇల్లో ముంగిలియో యనుంగుఁజెలులో యాఁడైన చుట్టం
బులో, యిల్లాలో కొడుకో తరింపవశమే యే[1]పోఁడిముల్
లేక? మా, పల్లెం గోరినవెల్లనుం గలవు తెప్పల్గాఁగ నీ
కిచ్చెదన్, జెల్లంబో యిట నొంటినుండ కటు విచ్చేయంగదే
లింగమా! 70

1. పోఁడుముల్లేక. ము. పా.

తే. చుఱుకుఁజూపునఁ గాలినకొఱఁత నుఱుకు
నుఱుకుఁ జూపులఁ బుట్టించు నెఱుకువారి
యిఱుకువలిగుబ్బపాలిండ్లయిగురుఁబోండ్ల
సేవ కిచ్చెద నీకు [1]విచ్చేయుమయ్య. 71

మ. నను మన్నించెదవేని నీ విపుడు రా నావెంట రాకుండినన్
నిను నేఁ బాసి చనంగ నోప నిచట న్నీతోడిదే లోకమై
మనువాఁడం గనువాఁడ నీకయిన నీమానంబు చిత్తంబు వ
చ్చినచో మానుదుఁగాని ఎన్నిపుడు కష్టింబెట్ట నాకేటికిన్.

వ. అని యమ్మహాదేవు నమ్మూరికి రమ్మనుచుం బ్రార్థించినం
బలుకకుండినం దదీయభక్తిపరవశుం డై సంపెఁగతావి [2]బ్రుం
గిన భృంగంబు తెఱంగున నున్న యవసరంబునం దిన్నం
డొంటిపంది వెంటఁదగిలి యెందు నెక్కడఁ బోయెనో యని
బోయలు పొక్కరయం దివిరి యడుగులవెంబడింబడి తప్పక
చనుదెంచి కాంచి యిట్లనిరి. 73

తిన్ననిఁ గని బోయలు దుఃఖించుట

శా. అన్నా! నిన్నలయించి తెచ్చిన వరాహం బెందుఁ బోయె?
న్నమ్మున్, గన్న న్మన్ననఁ జూడవేటికి? వడిన్ గన్నీరు గా
ఱంగ నే, మన్నన్ బల్కవ దేమి కారణమొ? వేఁటాడంగ
నేతెంచి యి, ట్లున్నం దల్లియుఁ దండ్రియు [3]న్మఱుఁగరే
యుల్లంబులో నక్కటా? 74

తే. నీదు గాలికిఁ బసివట్టి నిఱ్ఱనీల్గి
పట్టెడల బిగఁబట్టిన మట్టుపడక

---

1. విచ్చేయవయ్య. ము. పా. 2. బ్రుంగుడైన. 3. న్మఱుగఁడే; న్నలుగరే.

నిలువ కేతెంచి వేఁటకుక్కలు కుమార
[1]చుట్టుకొని యసియాడఁగఁ జూడవేమి? 75

సీ. వలలును దెరలుఁ బ్రోఁగులుఁ జుట్టఁగా లేదు
పోటుకో లొకటియుఁ బుచ్చ లేదు
తెగిన మెకంబులఁ దేలేదు విడివేఁట
పిట్టలకును మేఁతపెట్ట లేదు
చెంచు లేరికి నేమి సేవ దేఱఁగ లేదు
చెడకుండ మెకములఁ జేయ లేదు
కుక్క టొల్లులు సివంగులు మేపుఁ గొన లేదు
బలివెట్టి కాట్రేనిఁ గొలువ లేదు

తే. వేఁటలాడఁగ వచ్చినవేడుకెల్ల
నక్కటా తండ్రి కెఱఁగింప నంప లేదు
ప్రాణపడియుండ నేఁటికి మేను మఱచి
యేల మాజాలి మాన్పవే యెఱుకపఱిచి. 76

శా. ఓతండ్రీ! నిను డించి పో మనసు మాకొక్కింత గా నేర్చు
నే?, మీ తోఁబుట్టులుఁ దల్లిదండ్రులు చెలు స్త్రీ రెల్ల నేతే
రఁగా, మాతిన్నం డిపు డెందుఁ బోయె ననిన న్నాప్రాణము
లోర్వవె? రా, వే తిట్టింపక పల్లెలోన మముఁ దేవే వన్నె
యు న్వాసియున్. 77

తే. ఎంత యలమటఁబడిన మ మ్మేల చూడ
[2]వింతయును నెర్కుతేనికి నెఱుకపఱుపఁ

---

1. చుట్టుకగునిసియాడఁగ, చుట్టుకొని గనిసి. 2. వింతయు నెఱుకు తేనికి. ము. పా.

బోయెదము చెప్పవలసినబుద్ధి చెప్పి
యనుపు మని పాదములు వట్టుకొనిన నతండు. 78.

వ. ఎట్టకేలకు శివలింగసంగతాభంగసరహ్యాదయాంతరంగుం డగు
శబరపుంగవుండు కృపాపాంగుం డై చిలునవ్వు నవ్వి యవ్వ
నచరుల కి ట్లనియె. 79

క. ఈలింగములోఁ బ్రాణము
కాలముగడదాఁక నోడఁ గట్టినదూలం
బై లంకె నుండఁ జేసితి
నేలా తుందుడుకు ? హల్లె కేఁగుఁడు మీరల్. 80

క. నావెంట నితఁడు వచ్చిన
నే వచ్చెద మిమ్ముఁ గూడి యిప్పుడు లేదా
యేవంక నభవుఁ డుండిన
నావంక నె తోడునీడ నై వసియింతున్. 81

శా. నాకుం జుట్టముఁ దల్లిదండ్రులుఁ జెలుల్నాథుండు నీదైవమే
మీ కిచ్చోఁ బని లేదు కర్తిఁ డఁగా మీరల్లెకుం బొండు కా
ంకూరంబులు చేసినం గదలి నే రా నిచ్చటం బ్రాణముల్
పోకార్తుం బడి నాదువేలుపునకై బొంక న్నిజం బింత
యున్. 82

క. అని చెప్పఁ గ్రమ్మఱఁ దిన్నఁడు
మనమున నిలుపుకొని తనువుమఱచిన బుద్ధిన్
మునుపటి తెఱంగున నుండిన
వనరుచు వనచరులు చనిరి వలసిన రీతిన్. 83

వ. తదనంతరంబ. 84

### తిన్నఁడు శివుని కనుదినంబు నాహారం బొసంగుట

క. [1]ఎన్నాళ్లనుండియో ప
స్తున్నాఁ డీయడవిలోన నొంటి మహేశుం
డిన్నెగులు మాన్ప వలదా
కన్నారం గనినబంటుగలఁగల ననుచున్. 85

శా. తిన్నం డంతట దేవదేవునకు భక్తిం దృప్తిఁ గావింప నా
సన్నగ్రావ మహాటవుల్ దిరిగి దంష్ట్రాంకకోటీపుట
చ్ఛిన్నక్ష్మాజవరాహము న్గవిసి కాల్చె న్వ్రాల్చెఁ బ్రేల్చెం
జవిఁ, జెన్నైన యుండెడు మాంసఖండముల నిచ్చెం దొప్ప
లం జొప్పడన్. 86

ఉ. [2]విల్లొకవంక నంపపొది వీఁపున నొప్పలు కేలువోయి బు
క్కిళ్ళఁ బవిత్ర కాంచనముఖజల మొప్పఁగ వచ్చి భక్తి రా
జిల్లఁ బదంబుమజ్జనము సేయుచు నొప్పులవంజు దద్రిరా
జల్లుని నారగింపు మన నాఁగ మహేశ్వరుఁ డూరకుండినన్. 87

క. కాలవొ క్రొవ్వవొ మాఁడం
గాలెనొ చవిగావొ కమ్మగావొ సిరుఁ
జాలవొ యలసడవొ తిన
వేలా కఱుకుట్లు పార్వతీశ్వర! చెప్పుమా! 88

క. ఆఁకలిగాదో భక్తిం
దేఁకువ గలవాఁడఁ గానొ తినవేల కృపన్
సాఁకఁగదే నన్నిపుడ
ట్టాఁకలఁ బెట్టక పలాశనాసక్తుఁడవై. 89

---

1. ఎన్నేళ్లనుండియో. ము. పా. 2. 'మఱియును' అనియుఁ గలదు.

క. నెప మొకటి గలదె నాపై
నుపవాసముతోడ బడలియుండఁగ ? నీకే
యపరాధము [1]సేయఁగలదె
కృపతోఁ గటుకుట్టు లారగింపం గదవే. 90

క. నీ వారగింపకుండిన
జీవన మేమిటికి నాకు శివ! నీ పదరా
జీవముల మీఁదఁ బ్రాణము
[2]లే విడుతు నటంచు వ్రాలి యేడ్వం దొడఁగెన్. 91

క. తిన్నని భక్తికి శివుఁడు ప్ర
సన్నుండై యేను పుడిపి సరగునఁ గటుకు
ట్లన్నా! తినియొక లే లె
మ్మన్న న్నపమంది లేచి యవధానమునన్. 92

క. అందియ్య శివుఁడు తగ నా
నందించుచు నారగించిన న్నదమున మి
న్నంది పులిందేంద్రుఁడు కా
నం దిరుగుచు నిట్లు దినదినంబును గొల్వన్. 93

శివబ్రాహ్మణుఁ డాలయమందలి రోఁతలఁ గని చింతించుట

సీ. పంచాక్షరీపూతభసితత్రిపుండ్రాంకి
తాంకభాగములు స్నానార్ద్రశిఖయుఁ
గ్రమకృతగ్రంథిసూత్రప్రాతపద్రాక్ష
భూషణంబులు శైవభాషణములు
నాగుల్ఫలంబమానాంబుశోణం బైన
తోత్రంబు నుపవీతసూత్రయలును

1. సేయంగదె. ము. పా. 2. వే విడుతు. ము.పా. (యతిభంగము.)

గరగృహీతాభిషేకక్షీరసంపూర్ణ
భాండంబుఁ బుష్పకరండకంబుఁ

తే. గుండబొజ్జయు నొకపాటిగుజ్జురూపు
నుత్తరీయంబుఁ దనరంగ యోగిహృదయ
గోచరునిఁ గొల్వ శివవిప్రగోచరాంకుఁ
డొకఁడు వచ్చె శివబ్రాహ్మణోత్తముండు. 94

తే. వచ్చి గుడి చొచ్చి యీశ్వరేశ్వరుని నిర్మ
లాంగ మేటికిఁ జాతిక లయ్యె నకట
యిచటి కెంగిలి పుల్లియలేల వచ్చె
నొక్కొ యీదుఃఖ మెటువలె నోర్చువాఁడ. 95

మ. కులదైవం బని యల్కు పూసి గుడి ముగ్గుల్వెట్టి కైసేయ
లోపలికి ట్లెంగిలి మంగలంబు లగు దోషప్రల్ రాఁ గతం బేమి?
నిర్మల తోయ స్నపనం బొనర్చిన శరీరంబేటికి నీరువ
ట్టులు గట్టెం భవదాత్మశుద్ధికిది కూడుంగా మహాహేయ
ముల్. 96

క. దేవా! యీకసుమాలము
దేవెడు కెట్లోయి నీదుదేహం బంటన్
గా వెలుపయ్యెను నెంగిలి
కి వెట్లోర్చితివి పార్వతీశ్వర చెపుమా? 97

క. నేఁ డేడు దినములయ్యెన్
బోఁడిమి చెడసాగి నీదు బూటకమో యె
వ్వాఁడైనను జేసెనో యిది
వేఁడెద సత్యంబుఁ జెప్పవే కరుణాబ్ధీ. 93

ఉ. నీసఖుఁడో సుతుండొ తరుణీమణియో నిజసేవకుండొ నీ
వో సకలేశ శుద్ధమగుచున్న నిజాలయసీమ రోఁతఁగాఁ
జేసినవారు నీ కెఱుకసేయక సేయ సమర్థు లెవ్వ రీ
దోసముఁ జెప్పవే కరుణతో మదిఁ దఃందుడుకెల్లఁ దీఱఁగన్.

ఉ. ప్రోఁతలు మీఁదఁ గప్పినఁ గృపామతి నోర్చితి నీచుపొత్తునన్
బ్రాఁతి మెసంగి తీవు మనుభక్తుఁడు కుంటెనఁ బంపఁ బోతి మై
పూఁత యొనర్చుకొంటి శవభూతిఁ గపాలమునం భుజించితీ
రోఁతలు పెక్కులుండ నిట రోయుదువే యిఁక భక్తవత్సలా.

క. నీ కిష్టం బిదిగానీ
నా కాపాపాత్ముఁ జెప్పినం బదిలతఁల్
లేకున్న విడుతుఁ బ్రాణము
నీకై కూ డుగ్గఁబట్టి నీలగ్రీవా. 101

క. అని తా నూరక యుండినఁ
గని తారాధిపకళాశిఖామణి చేతో
జనితాదరమున నతనికి
విని తాత్పర్యంబు సంభవింపఁగ ననియెన్. 102

శివుఁడు తిన్ననిభక్తిని శివబ్రాహ్మణునకుఁ జూపుట

క. [1]శవశవపడ నేఁటికి మది
శివగోచర! నీకు నన్నుఁ జెం చొకఁడు శ్రుతి
వ్యవహారేతరమతమునఁ
దవిలి మహాభక్తిఁ గొలువ దయ పుట్టుటయున్. 103

1. కహకహ. (ఈ పాఠమున ప్రాసభంగము.)

తే. ఆ కిరాతుని పూజ నంగీకరించి
నాఁడె దద్భక్తి నీవును నేఁడు చూతు
గాని నా వెన్కదిక్కునఁ గానకుండ
నడఁగియుండుము తడయక. యతఁడు వచ్చు. 104

మ. అన మోదించి హరద్విజుం డొదుగఁ జెం చవ్వేళ నేతెంచి పా
వననిర్మాల్యముఁ జెప్పుఁ గాలఁ గొని పోవం ద్రోచి గండూష
జీవనసేకం బొనరించి పత్త్రిరిడి త్రోవ ల్గాచి తా నేసి కా
ల్చిన క్రోలామిషఖండముల్ దనకు భక్షింపంగ నందిచ్చినన్.

క. తినకున్న నేమొకో యని
యనుమానముఁ బొంద నభవుఁ డంతటిలోనన్
గనుదమ్మి గ్రమ్మి పొటపొటఁ
జినికె న్గన్నీరు శబరుచిత్తం బరయన్. 106

క. ఒకమరి కొకమరి కించి
ద్వికచారుణపద్మపత్ర వీథీవిగళ
న్మకరంద ధారగతిఁ దన
ముకుళిత నేత్రమున బాష్పములు ఘన మైనన్. 107

క. అందునకుఁ దం దౌనందనుఁ
డాందోళము నొంది కంటి నంటిన నొప్పిన్
బందికఱుకుట్లు దినఁ డిఁక
సందియ మేమిటికి మందు సమకూర్పఁ దగున్. 108

వ. అని తిన్నం డెన్నఁడు లేని హానిం బూనినవాని తెఱంగున
నంతరంగంబునం దరంగంబు లైన దుఃఖంబునం గరంగుచు.

### తిన్నఁడు పరమేశ్వరు నేత్రరోగమునకుఁ జికిత్సలం జేయుట

సీ. కోకపొట్లం బావిఁగొన నూఁది యొత్తుచుఁ
గషణోష్ణకరభభాగమునఁ గాఁచి
నెత్తి తంగేడాకు మెత్తి రేచకి నిమ్మ
పంచిపుల్సున నూఱి పట్టువెట్టి
తెల్ల దింటెనపువ్వుఁ దెచ్చి తద్రస మిడి
కలివెపువ్వులు గోసి నిలిచి పిడిచి
పేరిన నెయివెట్టి పెరుఁగువత్తులు వైచి
చనుఁబాలతో రాచి సంకు చమిరి

తే. విన్నమందులు తాసరికన్నమందు
లడిగితెచ్చిన మందులు నడవిమందు
లెన్నిచేసిన మానక యిందుమౌళి
కన్నుతోడఁబడి నెత్తురు గాఱుటయును. 110

తే. మాటిమాటికిఁ జేసిన మందులెల్లఁ
జెల్లెఁబో [1]చిల్లిఁగదిపిన చింతపండు
నీటవ్రాసిన వ్రాలునై నెరయ వఱదఁ
బోవుఁగా కేమి నెత్తురు పుట్ట నేల. 111

క. పట్టపుదేవిన్ హిమగిరి
పట్టి న్నాయమ్మఁ జూచి పదరినకతనన్
నెట్టవిసెనొ? నేమందుల
మట్టెఱుఁగనొ! కంటికిం బ్రమాదం బొదవెన్. 112

క. కామునిఁ జంపి మనంబున
నేమోహము లేని వేల్పు నిటువలె [2]ననినన్

1. వెల్లిఁగలిపిన. ము. పా. 2. నన్నన్. ము. పా.

స్వామిద్రోహము గాదే
యేమిటి కిట్లంటిఁ గంటి కీఁక నెటువలెనో. 113

ఆ. వేఁకి వెచ్చయైన వెచ్చనిమందులఁ
గాదె మాను నట్లు గంటి కింకఁ
గంటికంటె మందు గలదె ముక్కంటికిఁ
గంటి ననుచుఁ బోయ గదియఁ బోయి. 114

ఉ. ప్రాణముపోవునో తనువు భంగమునొందునొ నాక తూణికా
బాణము జిట్టునం దిగిచి భల్లముఖాగ్రము రక్తపద్మ దృ
క్కోణముఁ జేర్చి క్రుచ్చి యొకగ్రుడ్డు వడిం బెకలించి శోణిత
ద్రోణికయైన దైవతశిరోమణికంట నమర్చె నంతటన్. 115

ఉ. మున్నిటికంటికంటెఁ గడుమోహన మై తనకన్ను వచ్చినక్తా
మన్ననఁ జూచి మెచ్చక యుమాపతి రెండవ కంట శోణిత
క్లిన్నతఁ జూపిన న్నగి పులిందుఁడు నీకృపచేతఁ గన్నమం
దున్నది దీనికి న్వెఱవ నొక్కటి నావ్రత మింక శంకరా!

క. లాలాటలోచనంబునఁ
గీలాలము దొరఁగెనేని కేవలభక్తిం
గీలించి మనోదృష్టికి
మూలం బగు నాదుప్రాణములు నీ కిత్తున్. 117

క. అని చెప్పఁగాల నిటలా
క్షునికన్గొనఁ దన్నిపట్టి సునిశితబాణం
బునఁ దన రెండవ కనుగ్రు
డ్డునుఁ బెకలింపంగఁ బూనుడును సదయుండై. 118

ఆ. కన్నుఁ దివియఁ బూనుకన్నప్పతీవ్రత
కన్న మున్నుగాఁగ ఖండపరశు
వాశుగంబుఁ జేత నంటంగఁ బట్టుక
నిలువు నిలువు మనెను నెలుఁగుతోడ. 119

శివుఁడు తిన్ననికిఁ బ్రత్యక్షమగుట

చ. హరి యరవిందసూతి మును లష్టదిశాపతు లాదిగా విను
చ్చరు లిసవంకల న్గొలువ సత్వరత న్నిజలింగ నిర్మలాం
తరముననుండి శీతవసుధాధరకన్యక ముద్దుఁగేలుఁదా
మర కడవ్రేలు వట్టుకొని మన్ననఁ దిన్ననికిం బ్రసన్నుఁడై.

క. శివగోచర! యీభక్తుని
యవిరళతరభక్తిమహిమయాద్యంతము గం
టివి గద సద్భక్తుం డితఁ
డవుఁగద నీమనసువచ్చినా యిఁక ననుచున్. 121

క. దరహాసము నెరపుచుఁ దన
పరిసరమున కాటవికుని బ్రాహ్మణభక్తున్
గరుణం బిల్చుక మీకే
వర మింపన వాడు కృత్తివాసునితోడన్. 122

శా. మీపూర్ణం బగు దివ్యతేజము జగన్మిథ్యాత్మకత్వ ప్రతి
ష్ఠాపారీణతఁ జూపి మమ్ముఁ బోదవం జాంచల్యదూరంబులై
చూపుం జిత్తము మిన్నకున్న యవి యిచ్చోఁ బాసె దేహం
బుపైఁ, దిపుం జీఁకటి యింతకంటె వర మేదీ యిట్లు
మన్నింపవే. 123

చ. జగములు నంతరాత్మయును సాక్షియు నీ వనుచు న్నిజం
బుగా, నిగమము లాడఁగా వినియు నేఁ డితరంబుగ మా
కభీప్సితం, బగువర మెట్లు వేఁడఁగలమయ్య భవన్మయమైన
పూర్ణచి, ద్గగనములో మముం గలిపి క్రమ్మఱఁ బుట్టెడు
బాధ మాన్పవే. 124

క. ఇతఁడు కిరాతుం డేదు
ర్మతి మ మ్మడిగియె మహేశ మన్నించి ప్రస
న్నతఁ జూపితి రీ తెఱఁగున
హితలీల భవప్రయాస మెడలింపఁగదే. 125

క. మీతలఁపుకన్న నధికమె
మాతలఁ పిట్లడుగ నేల మము మీచిత్తం
బే తెఱఁగున వెలుఁగొందెడు
నా తెఱఁగున నుండఁజేయు మదిగాక శివా. 126

క. ఆనందామృతవారిని
ధానంబున మనము మగ్నతం బొందె వరం
బీనమరినఁ దాదాత్మ్యం
బో నిరుపాధికదయాసముజ్జ్వల! యీవే. 127

మ. అని శైవద్విజుఁడుం గిరాతుఁడును సాష్టాంగ ప్రణామంబు లీ
శునకుం బెక్కు లొనర్చి తద్విమల తేజోధ్యాననిర్మగ్నభా
వనులై యుండఁ బ్రపంచబుద్ధి మగుడ న్వర్తింపఁగా నీక వా
రి ననంతం బగునాత్మరూపమునఁ గూర్చెం దీర్చె బంధం
బులన్. 128

శా. ఓహో! వీరలు భక్తిఁ గన్న యపవర్గోదగ్రభాగ్యంబు లా
హా! హాలాహలభక్త[1]భోక్త నిజభక్తాగణ్యకారుణ్య మం
చా హేరంబ సితాంబుజాంబక విధాత్రాశాప యోగీశ హా
హాహూహూప్రభృతు ల్నుతింప నభవుం డంతర్ధి నొందె
న్వడిన్. 129

క. అనవుడు యాదవ భూపతి
పునరభివాదనముఁ జేసి భూతేశు కృపం
గని రెవ్వ రింక మోక్షం
బనఘా! యచ్చోట నన్న నతఁ డి ట్లనియెన్. 130

నక్కీరునికథ, మధురాపురవర్ణన

సీ. కపటచతుష్షష్టిగతుల నాడిన వాల
వాయిచొక్కేశుని వాసభూమి
యతని పట్టపుదేవి యైన మీనేక్షణా
ధరతనూభవకుఁ బ్రధానగృహము
ద్రవిడభాషాపీఠతలశంఖఫలకంబు
గల కనకాబ్జపుష్కరిణి కిరవు
దక్షిణాంబుధి వధూతామ్రపర్ణి నది
[2]సవతి వైఘుకు నెన్నఁ జాలు నునికి

తే. నిజదృగబ్జప్రపూజితనీలకంఠ
కూడలళఘుయ వైకుంఠకుంఠితాఘు
నిఖిల సంవత్సరంపరా [3]నిహితకింప
చానుతాపంబు మధురాభిధానపురము. 131

---

1. భోక్తృ. ము. పా. 2. సవతు. ము. పా. 3. నిహతకింపచాన తాపంబు.

తే. ఏపురంబునఁ బెంపొందు నిందుధరుఁడు
పాండ్యభూపాలు నల్లుఁడై ప్రజలకెల్ల
నుల్లములలోన నుల్లాసముల్లసిల్ల
నట్టి మధురకు సరియె [1]యేపట్టణంబు. 132

క. గంగాధరుని మహోగ్రా
పాంగము రతి విధవఁజేసె నాలోకల మా
[2]యంగయకన్నంబ కృపా
పాంగం బంగజుని వేపి నైపవఁ జేసెన్. 133

సీ. మాణిక్యవల్లియు మరకతవల్లియు
నానందవల్లియు నమృతవల్లి
కర్పూరవల్లియుఁ గోపకవల్లియు
నంగయ[3]కన్నంబ యనఁగ నాది
యైననామంబుల [4]కనుకూల మగుమోహ
నాకారసౌందర్య మతిశయిల్లఁ
బొత్తామ రనియెడు నెత్తమ్మికొలనిప
శ్చిమతటనికటకూలమున నుండి

తే. లోకమాతృక పాండ్యధాత్రీకళత్ర
పుత్త్రి కామణి యువతి సంపూర్ణచంద్ర
వదన రక్షింప సంపదం బొనలుమధుర
కితర పురములు [5]సరిచెప్ప నెట్లువచ్చు! 134

క. ఇట్టిమహత్త్వంబునఁ గను
పట్టెడు తల్లిఁ గల ప్రజల భాగ్యం బిల నే

---

1. యెప్పట్టనంబు. 2. యంగయకన్యాంబ. ము. పా. 3. కన్య యనంగ. ము. పా. 4. ననుకూల. ము. పా. 5. సరిచేయ. ము. పా.

పట్టున నున్నది పురముల
నెట్టు నుతింపంగ వచ్చు [1]నిందుల కెనగాన్. 135

క. తన పేళ్లం దనసేవయుఁ
దనదు ప్రసాదంబు నొసఁగి సయ నంగయక
న్నె [2]నగజ పెంపఁగఁ బురి మను
వనితల వైభవముఁ బొగడ వశమే వసుధన్. 136

శా. ఏమే కల్పకవల్లి రా వమృతవల్లీ పోవ కర్పూరవ
ల్లీ మాణిక్యలతా యిదో మరకతం బెం దుండు నానందవ
ల్లీ మీనాక్షులు తం డటంచుఁ దమలో లేమ ల్వివాభోగవే
ళా [3]మంజూక్తులఁ బిల్చు సంభ్రమ మనల్పం బెప్పుడుం
దత్పురిన్. 137

ఉ. ఆపుర మేలు భూవిభుఁ డనంతపరాక్రముఁ డప్రతర్క్యధా
త్రీపరిపాలనప్రథితధీనిధి వైరినృపప్రతాపసం
జ్ఞాపతి వాసవా[4]ధికయశస్సముదీర్ణుఁ డుదీర్ణదానవి
ద్యాపరకర్ణుఁ డర్ణవసమగ్రగభీరుఁ డుదారుఁ డెంతయున్.

చ. అళఘుయ చొక్కనాథశివుఁ డల్లుఁడు మూర్తి హిమప్రభాస
ముజ్జ్వలఘునకీర్తి ధైర్యమును శౌర్యము భూభరణప్రభా
వముం, దలఁప నశక్యమై వెలయఁ దత్పురి పాండ్యనృపాలుఁ
డేలు నిచ్చలు మిహికామహీధరము చందమునం గులగోత్ర
పాత్రుఁ డై. 139

వ. తదనంతరంబ. 140

1. నిందున. ము. పా. 2. యగజ. ము. పా. (ప్రాసభంగము.)
3. మఠ్రోక్తుల. 4. వాధిప.

శంఖఫలకము పుట్టిన క్రమము

సీ. మలయాచలంబునఁ గలశతనూజుండు
ద్రావిడశబ్దశాస్త్రము నిఘంటు
వయ్యలంకారంబునందుఁ గవిత్వంబుఁ
జెప్పెడు లక్షణస్థితియు మొదల
సృష్టింపఁ దలపోసి యష్టాదశాక్షర
మాతృక వ్రాసి నిర్మలిన శంఖ
ఫలకంబుఁ గొనివచ్చి పాండ్యభూపతి కిచ్చి
విను మిది ద్రవిడకవిత్వసరణి
తే. భారతీదేవి కెనయైనవార లెంద
రైనఁ జోటిచ్చు నొక్కరుఁడైన నతని
కిచ్చుఁ దగినట్లు కూర్చుండ నెడము దీని
[1]వరుస నర్చించి మనుఁడు మీఁదరతరంబు. 141

క. అని కుంభజుఁ డిచ్చిన వెను
క ననేకులు పాండ్యనృపులుఁ గడచిన పిదపన్
జనియించెఁ గలియుగంబున
జనవల్లభుఁ డొక్కఁడు దక్షని పద్మాంశమునన్. 142

క. ఆరాజు పాండ్యధాత్రీ
ధౌరంధర్యప్రమోదితగ్రావహరి
ద్వారణభుజంగపతిభూ
దారకమఠపరివృఢప్రధానిధి యగుచున్. 143

క. ద్రావిడభాషాదేవీ
[2]గ్రైవేయక మనఁగ గీర్తిఁ గని తత్కవితా

1. నరసి రక్షించుకొనుఁడు మీఁదరతరంబు. 2. గ్రైవేయం బనఁగ.

శ్రీవిపుల శంఖపలకము
పై వసియింపంగఁ దగు విభాసితమతులన్. 144

శా. సత్కారాది కవీంద్రులన్ దివిషదన్నప్రాయవాగ్గుంభసం
పత్కావ్య ప్రతిపాదక ప్రతిభులం బన్నిద్ధులన్ శైవసం
విత్కాసార మరాళరత్నములఁ దద్విద్యారసాపేక్ష భూ
భృత్కంఠీరవుఁ డుంచె సంపదలఁ దృప్తిం బొందఁగాఁ జేయు
చున్. 145

క. ఆసభ మెచ్చఁ గవిత్వం
బేపరసుఁడు చెప్పిన [1]న్మహీశుం డిచ్చున్
జేసేత న్మాడలు వే
యేసి దెసఁ గీర్తిలతిక లెలమి వహింపన్. 146

చ. అడిగిన దిచ్చు నర్థులకు నాప్తుల కిచ్చు మనంబుఁ గూటమిం
బడఁతుల కిచ్చు సౌఖ్యములు బంధుజనంబుల కిచ్చు సంపదల్
పుడమి సమస్తజాతులకు బొంకమి నుత్సవ మిచ్చు శత్రులన్
బొంద వడఁగించి సాధుజనపుంగవకోటికి నిచ్చు వేడుకల్. 147

దుర్భిక్షవర్ణనము

క. ఆభూవిభుఁ డిబ్భంగిని
భూభాగం బేలునపుడు పుట్టెన్ గ్రహన
క్రాభ్రభ్రమమహా
క్షోభంబు జగంబు వర్షశూన్యము గాఁగన్. 148

సీ. చనుదెంచె శని మీనమునకుఁ దూప్పన
ధూమకేతువు దోఁచె జీమూతడంబ

1. హీశ్వరుఁ డిచ్చున్, హీశుఁడు మెచ్చున్.

రం జేచె మధ్యదినంబుల రేపాడి
చినికెఁ దుషారంబు దినదినంబు
రాత్రుల మిన్ను నిర్మలభావమును బొందె
వెలియెండ గాసె గర్వాలి దొరంగె
వర్షగర్భము నడవక పోగు విడియఁ
గుముదాస్తధారణక్రొమ్ము దఱిగె
తే. [1]కన్య భిన్నింపదయ్యె మఖాప్రవేశ
[2]కాలమును నుర్మదయ్యె నఖండగర్జ
లెసఁగె జము దెసఁ దొలకరి నేమి సెప్ప
నెల్ల జనములమనములు దల్లడిల్ల. 149

వ. మఱియును. 150

తే. గునుకు లూనర్లు బరపటల్ గోళ్లగొండు
లల్లిబియ్యంబు వెదురుబియ్యంబు గొట్టె
చెట్లు [3]నిం జెట్లు తుంగముస్తియలు నీఁత
గుంజు మొదలుగఁ దిన దొరఁకొనియె జనము. 151

క. అఱవదు గంటె తపిందియ
లఱువది దినములకుఁ బండు నని బ్రదుకాసన్
దఱచుగ నేతాలెత్తఁగఁ
బఱపఱియై యవియు మల్లెపడి చెడి పోయెన్. 152

చ. తొలును నెమ్ములు న్మిగిలి ద్రోసినఁ [4]దొంబది చోట్లఁ గూలువా
రాలిని బిడ్డల న్విడిచి యాఁకటిచిచ్చున వెచ్చపోవువా

---

1. కన్నె. 2. కాలమున నుఱుమదయ్యె నఖండగర్జ - గణభంగము.
3. నీచెట్లు, నీజెట్లు. 4. దొమ్మిది.

రేలికబంటువాసి యొక[1]యించుక లేక కృశించువారు నై
తూలె జనంబు మీనశనిదోషము దాఁకి [2]నిరస్తసస్యమై.

క. నవయుచు నుండియు నొక్కొక
దివసంబున [3]నశన మబ్బఁ దిని దగ మిగులన్
భువి నొరగి లేవ నోపక
శివశివ! జనకోటి విడుచు జీవానిలముల్. 154.

క. కఱవంతంతకు నొత్తఁగఁ
[4]గరవెఱుఁగక తినఁగ నోపఁగలుగక మనుజుల్
సురసుర స్రుక్కిరి కొందఱు
పరదేశంబులకుఁ జనిరి బ్రతుకులకొఱకున్. 155.

క. మానిసి మానిసిఁ దినుకఱ
వైనం దరియింపలేక యాపురిమూల
స్థానహరద్విజుఁ డొకఁ డెం
దేనియుఁ బోదలఁచిన న్మహేశుఁడు కరుణన్. 156.

ఈశ్వరునిపద్యముఁ గొనిచనిన హరద్విజుని నత్కీరుఁడు తూలనాడుట

వ. అతనికిఁ బ్రసన్నుండై యన్నగరం బేలుమన్ను తేనిమీఁద నఱువబోసఁ బద్యంబు శృంగారరసానుబద్ధంబుగా నొకటి చెప్పి యిచ్చి యిది చదివిన మెచ్చి వేయిమాడల నుడు పిచ్చు వెచ్చంబున కొదవు నీవు నెవ్వగ నొవ్వక బ్రతుకం గలవాఁడ వంతటఁ గఱవుం దీఱు జగంబునఁ గృతహర్షంబగు

1. యింతయు. 2. సైన్యమై. 3. నశన మవని దీరఁగఁ దినుచున్.
4. గరువెరుక.

వర్షంబుఁ గురియంగలదు సస్యంబులు పండుఁ బండువు జనం
బుల కవు నని యనుపుటయు నతండును నారాజ సమ్ముఖంబు
నకుం బోయి శ్రీపరమేశ్వర ప్రణీతం బైన కవితాచమత్కా
రంబు పఠించిన నందలి యర్థంబు "సింధుర రాజగమనాధ
మ్మిల్లబంధంబు సహజగంధం" బని యుండుటం జేసి. 157

క. దానికి నవ్వుచు నృపసభ
లో నత్కీరుండు పలికె లోకము నగదే
పూనుకొని సహజగంధము
వేనలికిం గల దటన్న వేయు తెఱఁగులన్. 158

ఉ. తప్పిది చెప్పరాదు కవితాసమయంబున కొప్పు గాదు నీ
విప్పగిది న్రచింపఁ దగునే! యన విప్రుఁడు చిన్నవోయి నా
కప్పరమేశ్వరుండు వసుధాధిపు పై రచియించి యిచ్చినాఁ
డొప్పును దప్పు నే నెఱుఁగ నుత్తములార! యటంచుఁ
గ్రమ్మఱన్. 159

{ ఖిన్నుఁడైన బ్రాహ్మణుని శివుఁ డూరార్చి నత్కీరునితో వాదునకుఁ గడంగుట }

ఆ. వచ్చి పార్వతీశువంకఁ గనుంగొని
యతని పద్య మతని కప్పగించి
నిన్ను నమ్మి పోయి నిండిన సభ సిగ్గు
చెడితి నున్న[1]కథలు చెప్ప నేల! 160

క. సర్వజ్ఞత్వము బహుముఖ
నిర్వాహకశక్తిగుణము నీకుఁ గలుగఁగా

1. పనులు.

శర్వా! నిను నమ్మి పోయిన
గర్వమునఁ బోనాడుకొంటిఁ గడపటి సభలోన్. 161

క. తా నెఱిఁగిన విద్య న్నృప
స్థానములో నెఱపఁ గీర్తి సమకూరుం గా
కే నరునకుఁ బరవిద్యా
ధీనత భూపాలసభలఁ దేజము గలదే? 162

క. నీమాట నమ్మి పోయిన
నా మోసముఁ జెప్ప నేల నక్కీరుని చే
నేమాటపడ్డ దుఃఖము
తోఁ మవ్యథ కొలఁది గాదు సన్నుతకీర్తీ! 163

వ. అని మఱియు ని ట్లనియె. 164

శా. నాభాగ్యం బిటు లుండఁగాఁ గుది నిను న్నక్కీరునిం దూ
ఱఁగా, నేభావ్యం బిఁకఁ జాలు నిక్కఱపుచే నిర్జిత్తి నొందై
నఁగా, నీ చైత్యంబునఁ గుట్టుఁ బ్రోచుకొని దీనిం దీర్చి నే
నత్తు దేవా! భద్రం బగు నీకు న న్నచుపవే యన్నం గృ
పామూర్తిగెౌ. 165

క. కటకట [1]నిక్క గని నక్కీరుం
డఁట [2]కవితం దప్పువట్టె నఁట యటు [3]పదమీ
యెటువలెనో తెలిసెద నని
నిటలాక్షుఁడు వచ్చి కుంభినీపతిసభలోన్. 166

శా. ఈరాజన్యునిమీఁద నేఁ గవిత సాహిత్యస్ఫురన్మాధురీ
చారుప్రౌఢిమఁ జెప్పి కంప విని మాత్సర్యంబు వాటించి న

1. నన్నకీర్ - ము. పా. నిన్నకీర్. 2. కవితయుఁ దప్పు. ము. పా. 3. పదమా.

త్కీరుం [1]దూరక తప్పువట్టినఁట యేదీ లక్షణంబో యలం
కారంబో [2]పదబంధమో రసము చక్కం[3]జెప్పుడీ తప్పనన్.

క. అనవుడు నానత్కీరుఁడు
మునుపటివలెఁ దప్పటన్న ముక్కంటియు నా
తని కనియె న్గిరితనయా
ఘనకచభారంబు సహజగంధం బనుచున్. 168

క. అగజకునైనం దగు నిల
మగువలకుం దగదు మాను మత్సర మింకన్
గగనప్రసూనవాదము
జగతిం బ్రత్యక్షమునకు సరి యనఁ దగునే. 169

క. లూలామాలపు మాటలు
చాలు ననిన నలిగి తననిజం బగు రూపం
బాలోనఁ దెలుప వలె నని
నీలగ్రీవుండు నిటల నేత్రముఁ జూపన్. 170

క. తలచుట్టు[4]వాఱఁ గన్నులు
గలిగినఁ బద్యంబు దప్పు గా దన వశమే?
వల దిచ్చట నీమాయా
విలసనములు పనికిరావు విడువు మటన్నన్. 171

—శివుఁడు నత్కీరుని శపియించుట—

క. శపియించెం బ్రతిభాషలఁ
గుపితుం డై రుద్రుఁ డతనిఁ గుష్ఠవ్యాధిం

1. దూరకె. ము. పా. 2. పదబద్ధమో. ము. పా. 3. చెప్పఁడా. ము. పా. 4. వాలుగన్నులు.

దపియింపు మనుచు దానికి
నపరిమిత భయంబు నొంది యతఁ డి ట్లనియెన్. 172

శా. స్వామీ! ద్రోహముఁ జేసితిం దెలుపవే శాపాంత ముద్య
త్కృపా, ధామా! నా కనుచుం బదాబ్జములఁ మీఁదం బడ్డ
నాభక్తరక్షా [1]మందారుఁడు శాంతిఁ బొంది యనియెం
గైలాసశైలంబుఁ గం, టే మానుం బర మన్న [2]నందులకుఁ
దా డెందంబునం గుందుచున్. 173

—శివుఁ డిచ్చిన శాపమునకు నత్కీరుఁడు దుఃఖించుట—

ఉ. ఈకవితాభిమానము వహించితి నేటికి? శంఖపీఠిపై
నీకవు లున్నయట్లు వసియింపక దేవునితోడ నేల చా
ర్వాక మొనర్చితిం? గడుభరం బగు కుష్ఠరుజావిషాదమే
నే కరణిం ధరింతు? నిఁక నెన్నఁడు చూచెద వెండిగుబ్బలిన్?

ఉ. ఎన్ని మహానదు ల్వనము లెన్ని గిరీంద్రము లెన్ని బోయవీ
ళ్లెన్ని మృగంబు లెన్ని జనహీనము లైన పథంబు లెన్ని నే
నిన్నియుఁ దాఁటి యేకరణి నీశ్వరు శైలముఁ జూడఁ బోయె
దఁ?, గన్నది కాదు విన్నయది [3]గాను సదాశివ! యేమి
సేయుదున్. 175

మ. హరి శార్దూల మదేభ ఖడ్గ శరభవ్యాకీర్ణము ల్రాక్షసో
త్కర సంచార నివాసముల్ హిమకరయోధారాళవర్షంబు లు
ద్ధుర సంఘర్షణ బాధ[3]కోపలము లాత్రోవల్ సనఁ శక్యమే
కరుణాసాగర! భక్తవత్సల! శివాగౌరీశ! యెట్లో గదే. 176

---

1. మందారము. 2. నందునకు. ము. పా. 3. కాని. ము. పా.
3. భలము. పీఠము.

సీ. తివిరి యంగమ్మునఁ దిమ్మిరెత్తకమున్న
యొడలెల్ల మచ్చలఁ జెడకమున్న
దళమెక్కి గాత్రంబుచెలువు దప్పకమున్న
బుడుపులు మేన నేర్పడకమున్న
యలఁత విగ్రహమున నంకురింపకమున్న
కాయంబు వెడరూపు గాకమున్న
తనువునఁ జీమురక్తములు గాఱకమున్న
దేహ మీఁగలు మూఁగి తినకమున్న

తే. భైక్షమడుగంగఁ బోయినపట్ల జనులు
చూడ రోయకమున్న కాలాడినపుడ
నడవవలెఁగాక కైలాసనగముఁ జూడ
హానని వాక్యంబు శక్యమే పరిహరింప. 177

నత్కీరుని తీర్థయాత్ర

తే. అనుచుఁ జింతాపరంపర లనెడు వర్ష
ముడిగి నత్కీరుఁ డను మేఘుఁ డుత్తరంబు
నడచె సంతోషమున దక్షిణమున నున్న
కవుల ముఖపంకజములు వికాసమొంద. 178

వ. కతిపయ ప్రయాణంబులు చనిచని ముందట. 179

శా. చెవ్వందీశ్వరు నీశ్వరేశ్వరునిఁ గాంచెఁ భీషణాంహోలతల్
దెవ్వం దీవ్రతరాంగసంభవశరశ్రేణీ విదాహవ్యథల్
వివ్వం దీఱని భక్తితో హృదయ మావిర్భూతమోదంబునన్
నవ్వం దీఁగయుఁబోలెఁ జూపులొదవన్నత్కీరుఁ డుత్కంఠతన్. 180

ఉ. చెంగట నుండఁ గాంచెఁ గవిసింహము పోయి హిమాచలా
త్మజో, త్తుంగకుచోపగూహనవిధూతమనోభవభూతిలేపస
ర్వాంగము లోచనీకృతసుధాంశుకృశానుపతంగము న్వాని
ర్లింగము జంబునాథశివలింగము భక్తమనోబ్జభృంగమున్.

చ. చని చని దాఁటె నంతఁ గవిచంద్రుఁడు ధన్యఁ గవేరకన్య జీ
వనశితఖడ్గఖండితభవప్రభవాఘవిరోధిసైన్యఁ బా
వననిజనామసంస్మరణవారితమానవదైన్య నిత్యమ
జ్జనరతకోటిముక్తిపదసౌఖ్యవదాన్యఁ గృతావగాహుఁడై.

వ. [1]ఇట్లు తత్తటినీరత్నంబు నుత్తరించి యుత్తరాభిముఖుం డై
కొన్ని తీర్థంబులు దర్శించి. 183

చ. అరుణగిరీంద్రకూటముఁ గృతాఘకపోలచపేటముక్ నిరం
తరభవదావపావకవిదాహకృపీటము పుణ్యకోశమం
దిరపిలసత్కవాటముఁ బ్రదీపితముక్తివధూకిరీటముక్
బరిహృతసంతతభ్రమణ భారపదశ్రమభానుఘోటమున్. 134

క. ఉణ్ణాముల జగదంబిక
నణ్ణామల విశ్వనాథు నారాధించెక్
వణ్ణాసయుఁ బొన్నాసయుఁ
బెణ్ణాసయు లేనివారి పెన్నిధు లగుటన్. 185

క. తదనంతరంబ యక్కడ
కదలి నడిచి యెదుట విష్ణుకాంచనగర్భుల్
మొదలైన దేవ[2]కోట్లం
జదివించినయొజ్జఁ గాంచె సజ్జనసురభిన్. 186

---

1. ఇత్తెఱంగున నిట్లు తత్తటినీ. 2. కోటుల.

మ. తిరువత్తూరి పురాధినాయకు మహాదేవుఁ శివు న్ముక్తివా
రిరుహాక్షీపతి నోది పిచ్చునయనారిం గొల్చి యాపిమ్మటన్
బరశంభుం బరమార్థమూర్తిఁ గరుణాపాథోనిధానంబు నే
కరసాలేశ్వరుఁ గాంచికారమణు లోకస్వామి దర్శించుచున్.

వ. అనర్గళాపవర్గం బగు నప్పురంబు నిర్గమించి కొన్నిపయనం
బులు చని విక్రసింహానగరాసన్న యగు పెన్నయుఁ, దీర్ఘ
యాత్రాపరులకు సురతరువుకొమ్మ యగు గుండ్లకమ్మయు,
సుకృతిభూతపాతకశ్రేణి యగు కృష్ణవేణియుఁ, గమలాచలో
త్తుంగసంగతతరంగయగు గౌతమగంగయుఁ, గుక్కుటేశ్వర
పీఠం బగు పీఠికాపురంబును, నంహోమతంగసింహం బగు
సింహాచలంబును, విదళితోభయకర్మం బగు శ్రీకూర్మంబును,
గలుషానీక మండూకగోకర్ణం బగుగోకర్ణంబును, తీర్థోత్తమం
బగు పురుషోత్తమంబును, కృత్తివాసోనివాసం బగుకృత్తి
వాసంబును, ముక్తివధూచరణ కటకం బగుకటకంబును,
దుఃఖదహన జలేశ్వరం బగు జలేశ్వరంబును, కృతవందన
నందనేశ్వరం బగు నందనేశ్వరంబును, జిద్గగనేశ్వరంబగు
గగనేశ్వరంబును, పితృముక్తినివాసం బగు గయాస్థానంబును
సేవించుచు నక్కుఱుండు పనునప్పుడు ముందట. 188

శా. కాంచెం గాంచనపంకజాత విలసద్గంధాంధసారంగ ఫే
నాంచత్తుంగతరంగ వారినిధిశీతాగాంతరాభంగ రో
మాంచస్వేదజలాశ్రుపూరజనకాత్మానందసంపన్ననో
మంచాగ్రస్థితవిశ్వనాథపదసమ్యక్సంగ గంగానదిన్. 189

వ. కాంచి చేరం జనుదెంచి. 190

శా. గంగా స్నానముచేసి విశ్వపతి మోక్షస్వామి దర్శించి పా
పాంగారప్రజవృష్టి నీశ్వరి విశాలాక్షిఁ శివం గొల్చి భ
క్తిం గాలాంతకుఁ గాలభైరవపతిం గీర్తించి [1]ఢుంఠి ద్విపా
స్యుం గల్యాణగుణాలయుం దలఁచి యాత్రోత్సాహ మొ
ప్పారఁగన్. 191

క. కాశీనగరి పంచ
క్రోశక్షేత్రంబు విడిచి గుహ్యకసమ్రా
డాశాగమనాభిముఖుం
డై శంకరశైలదర్శనాశాబుద్ధిన్. 192

సీ. ఒకకొన్ని పయనంబు లొయ్యనొయ్యనఁ బోయి
నడువనోపిక లేక నడుమనడుమ
నడుముఁ బట్టుక [2]నిల్వఁబడియుఁ గూర్చుండియుఁ
[3]దొంగిదోఁగియుఁ గొన్ని జంగ లరిగి
పొడలు పెట్టుచుఁ దన కడు గామడై యుండఁ
జీము నెత్తురు మేనఁ జిప్పిలంగ
నీఁగలు మూఁగియు రేఁగియు ఝుమ్ముఝు
మ్మనఁగ నుత్తాలశైలాంతరంబు
తే. నిర్మనుష్యంబు బహుసత్త్వనిష్ఠురంబు
నైన కాననమధ్యంబునందుఁ జిక్కి
దిక్కుఁ గానక దీనతాధీనహృదయుఁ
డగుచు నక్కర కవిచంద్రుఁ డగ్రభూమి. 193

1. ఢుండి. ము. పా. ఢుంట. 2. నిల్చి. 3. దోఁగిదోఁగియు, దోఁగి
దొంగియు.

ఉ. తమ్ములు కమ్మఁదెమ్మెరలు దల్లడమందఁగ ఝుమ్ముఝుమ్మనన్
దుమ్మెద పిండు పుప్పొడులతో నెగయం బిసినీలతాంగి కే
శమ్ములు ధూపధూమముల సౌరభము ల్గ్రోలుపంగ విచ్చిన
ట్లమ్మెయి నొప్పు తమ్మికొలనక్కడ నొక్కటి గాంచె వేడుకన్.

తే. హంససంసదభీష్టవిహారహేతు
వై బహూదకహృద్యమై యప్రతర్క్య
మగుచు నద్వంద్వమై పంకజాకరంబు
పోలిచె బ్రహ్మాంబుతెఱఁగునఁ బూర్ణమగుచు. 195

క. తమ్ముల రజోవికారము
గ్రమ్మెడు వాసనలు దళముగా నెసఁగెడుకో
శమ్ములు మూర్తులుఁ జెలఁగఁగఁ
దమ్మికొలను భవముఁబోలెఁ దద్దయు నొప్పెన్. 196

చ. దళములలో రథాంగనినదంబు పరాగము రాజహంస సం
కులము శిలీముఖభ్రమణఘోషము నవ్యకదంబము ల్సము
జ్జ్వలతర పుండరీకములుఁ జాలఁగఁ గల్గి మహామహస్థితిన్
బొలుపు వహించు నక్కొలనిపొంతకు నొయ్యనఁ జేరి
యచ్చటన్. 197

నక్కీరుఁ డొక భూతమునకుఁ జిక్కుట

సీ. తన పలాశశ్రేణి ధర కంతటికిఁ బచ్చ
పట్టుఁబుట్టంపుమేల్కట్టు గాఁగఁ
దనయూర్ధ్వశాఖావితానంబు సురలకు
మరకతరచితహర్మ్యములు గాఁగ
దనప్రేలుఁగొమ్మలు మునులకుఁ గల్పిత
పర్ణశాలాకలాపములు గాఁగఁ

దన దిశాంతభ్రాంతఘనవిటపచ్ఛాయ
వలయాద్రి హరిణశాద్వలము గాఁగ

తే. వాలఖిల్య మునీశ్వరావాసమైన
రోహణము రీతి పితృముక్తిదేహ మగుచు
గయఁ బ్రసిద్ధి వహించునక్షయవటంబు
చందమున నున్నయొక మఱ్ఱిక్రింది కేఁగి. 198

వ. తదీయ శాఖాశైత్యంబున కత్యంతసంతోషంబు నొంది కూర్చుండి తద్వటంబుననుండి రాలిన పండుటాకులు బట్ట బయటఁ బడినయవి విహంగంబులు జలంబులంబడినయవి మీనంబులునై పోవ నం దొక్క పలాశంబు జలాశయంబున సగమును దటప్రదేశంబున సగంబును బడి మీనపక్షిత్వంబులఁ గైకొని లోపలికి న్వెలుపలికిం దివియు చమత్కారంబు నక్కీరుండు చూచి యద్భుతరస పరవశుండై యుండె నంత. 199

ఉ. క్రూరనిరీక్షణ ప్రభల క్రుద్ధులుఁ గోఱలు నూర్ధ్వకేశముల్
నీరదనీలగాత్రమును నిష్ఠురవాక్యము లట్టహాసముల్
ఫేరవకంఠనిస్వనము భీకరహేతియు మానవాస్థిహా
రారవము ల్సెలంగ వికటాకృతితో నొకభూతమాతనిన్.

క. పట్టికొని తనదు గుహకుం
బెట్టిదముగఁ దెచ్చి మునుపు పెట్టిన మనుజుల్
వట్టిఁ బడిన పులుఁగులగతి
నిట్టట్టుపడంగ నునిచి యెంతయు వేడ్కన్. 201

క. హారల నందఱ నేకా
హారముగాఁ గొనఁదలంచి యయ్యద్రిబిల

ద్వారమున రాయిద్రోచి మ
హారయమునఁ గొలన నుదకమాడఁగఁ బోవన్. 202

వ. మునుపున్న మనుష్యులు నత్కీరునిం గనుంగొని యిట్లనిరి.

ఆ. ఏమి సేయవచ్చు నింతయు మామీఁదఁ
గరుణలేక కమలగర్భుఁ డిపుడు
నిన్నుఁ దెచ్చిపెట్టె నేఁ డింక సంధఱఁ
దిను నితండు వీని తెఱఁగు వినుము. 204

ఉ. నూఱుక త్రాఁపు నీతఁడు కనుంగొనునంతటిలో మనుష్యులన్
నూఱువురైనఁగాని తిన నోటికి నాఁట పటించుఁ గూర్పఁగా
నూఱువురైరి నేటికి మనుష్యులు నీవునుఁ గూడ నింతటన్
నూఱును నిండె నింధఱ కనుగ్రహ మీశ్వరుఁ డేమిసేయునో!

క. అనవుడు నత్కీరుం డా॥ను
మనమునఁ దలపోసి దీని మానుపఁ బురభి
త్తనయుఁడు తారకదమనుఁడు
తనకుం గలుగంగ నింకఁ దలఁ [1]కే లనుచున్. 206

—॥ నత్కీరుని సుబ్రహ్మణ్యస్వామి రక్షించుట ॥—

ఉ. తారకదైత్యభంజనుఁడు దారుణశక్తిధరుండు పన్నగా
హారహయుండు దీనజన తామరభూజము షణ్ముఖాట్టహా
సారభటీవిపాటితదిగంతకటాహుఁడు వీనిఁబట్టి సం, హార
మొనర్చి యిందఱిఁ గృపాంబుధియై బ్రతికించు గావుతన్.

ఉ. భూతముఁ జంపు జేయరుదు [2]బోరనఁ దారకు మన్నిగొన్న వి
ఖ్యాతమహాప్రతాపునకు నద్రిగుహాలయ మేమి దొడ్డు ని

1. కేమిటికిన్. 2. భోరన. ము. పా. బోరున.

ఘాతమునంటి శక్తిఁ గొని క్రౌంచముఁ జించిన రౌద్రమూర్తి
కిన్, భీతిఁ దొలంగఁ జేయు టొకపెద్దయె వారిత దేవతార్తికిన్.

వ. అని యనేక ప్రకారంబుల నబ్రహ్మణ్యోక్తియుక్తంబుగా నిష్టదేవతావరేణ్యుండును భక్తశరణ్యుండును నగు సుబ్రహ్మణ్యు సన్నుతింప ననుకంపాతరంగితాపాంగుండై యతండు చండతరవేగంబునం బయింబడి భూతంబు భూతలంబుపయిం బడం బెడచేత నడిచి బిలద్వారంబునం ద్రోచిన రాతిఁ దిగిచి వైచి యంతట వెడలుం డని యనుగ్రహించినక డెందంబుల నానందంబునం బొంగి యిందుశేఖరునందను సందర్శించి వందనంబులు సందడించుచు వా రెందేనియుం జనిరి. నత్కొ-రుండును బునఃప్రణామం బాచరించి నిలుచుటయుఁ బ్రసన్నతాంకురంబులు ముఖపంకేరుహంబునం బ్రభవింప నీ వీ యెడకు రాఁ గతం బేమి? యని యడుగుటయు నిట్లని విన్నవించె. 209

క. ఓశరణాగతవత్సల !
కాశవనప్రభవ ! దీనకల్పక ! యాప
న్నాశకర ! దురితగిరిదే
వేశ నను గరుణఁ జూడవే సుఖ నగుదున్. 210

ఉ. ఏ నొకతప్పుఁ జేసిన మహేశుఁడు నన్ను శపించెఁ గుష్ఠరో
గానుపమవ్యథం బడు మటంచును దానికి శాపమోక్ష మి
ట్లానతి యిచ్చె నాత్మనిలయంబగు రౌప్యనగంబుఁ జూచినన్
మాను నటంచు నక్కుధరమార్గము దుర్గము మేమి సేయుదున్.

క. ఏలాగున దర్శింతుం
గైలాసం [1]బపుడుగాని కానక ఖేదో
ల్లోలోర్మి రోగజలనిధి
వేల యనుచు విన్నవింప విని గుహుఁడు దయన్. 212

శా. కైలాసం బనేఁ గాని యుత్తరదిశాకైలాస మం చాడఁ డా
కాలగ్రీవుఁడు నీవు దక్షిణదిశాకైలాసముం జూచినన్
జాలుం గుష్ఠము మాను నంచు మదిలోఁ జర్చించి యాపర్వతం
బాలోకింపఁగ నశ్రమం బగు నుపాయం బాత్మఁ జింతించుచున్.

తే. తనమహత్త్వమ్ము డాఁచి నెత్తమ్మికొలని
మహిమవలె నుండ నాకవిమండలేంద్రు
నాడు మిందునఁ గైలాస మాడఁబోవు
తీర్థ మెదురైనరీతి సిద్ధించు ననుడు. 214

నక్కీరుఁడు సాయుజ్యము వడయుట

శా. సేనానీవచనామృతంబు చెవులం జింవంగ డెందంబులో
నానందం బుదయింప నక్కీరుఁ డలనిలో నత్యంత నిష్ఠం గృత
స్నానుం డై తలయెత్తఁగా నెదుటఁ గానవ్వచ్చె నాలో నవా
చీనస్థాణునగంబు హేమముఖరీసింధుప్రతీరంబునన్. 215

శా. కుష్ఠవ్యాధియు మానె హేమముఖరీకూలస్థకైలాసమున్
నిష్ఠాధీనమనస్కుఁడై కదిసి తన్నీరంధ్ర కల్లోలభూ
యిష్ఠౌఘంబునఁ దీర్థమాడి గిరిజాధీశున్ శివున్ దేవతా
శ్రేష్ఠున్ సంస్తుతి నూఱు పద్యములఁ జేసెన్ ద్రావిడోక్తిం
దగన్. 216

1. బెపుడు. ము. పా. బిపుడు.

క. ఆనూఁబుపద్యములకుఁ
సేనానీజనకుఁ డార్తచింతామణి వి
ద్యానిధి జ్ఞానప్రసవాం
బానాథుఁడు కాళహస్తిపతి ప్రీతుం డై. 217

శా. ప్రత్యక్షుం బగుచుఁ భవచ్ఛ్రమము సాఫల్యంబునుం బొందెసా
హిత్యశ్రీవర! నీకు నింగు వరం బే నిచ్చెదఁ వేఁడు భీ
తిత్యాగం బొనరిం[1]చెద న్ననుడునత్కారుం డుమారాజానికిఁ
బ్రత్యగ్జ్యోతికి మ్రొక్కి మ్రొక్కి ప్రమదప్రాయాంతరంగం
బుతోన్. 218

క. నిటలంబున నంజలిపుట
ఘటనం బొనరించి ప్రమదగద్గదగళ మ
స్ఫుటవర్ణస్తుతి భాషా
ర్భటియును రోమోద్గమంబు పైపైఁ బరఁగన్. 219

వ. ఇట్లనిన విన్నపించె. 220

క. ఈసంసారము దుఃఖా
వాసానంతంబు దీని వర్జింపంగా
నేసుఖము గలుగు నయ్య న
న్నాసుఖమునఁ గూర్పవే కృతార్థుఁడ నగుదున్. 221

మ. అని ప్రార్థింపఁగ భక్తకల్పక మవిద్యాసూత్రదాత్రంబు జీ
వనఖేదాంబరకర్తరీముఖము కైవల్యార్థదానామృతా
శనరత్నంబు తుషారశైలతనయాజాంపత్యసంపన్నపా
వనగార్హస్థ్యము కాళహస్తిపురదైవం బిచ్చె సాయుజ్యమున్.

1. చినాఁడ నన. ము. పా.

శా. ఈరీతిన్ శివుఁ డానతీయ విని ధాత్రీశుండు భక్తి న్నమ
స్కారస్తోత్రము లాచరించి పిదపన్ గౌరీశుఁ బూజించి యె
వ్వారిచ్చో నపవర్గమార్గమునఁ బోవం గాంచి రన్న న్మదిన్
గారుణ్యం బుదయింప ని ట్లనియె భక్తప్రీతి భూతేశుఁడున్.

శా. యోగిస్వాంత శకుంతవాగురిక! సర్వోపాధిశూన్యా! జగ
ద్యోగా యోగవిహీన! భూగగనవాయుక్షీరవహ్న్యంతరా
త్మాగణ్యా! గణనీయమూర్తి! పరమార్థాకార! స్వాభావతే
జోగండూషితపద్మజాండభవచక్షుశ్శ్రోత్రపక్షీశ్వరా. 224

క. అష్టాపదగిరిచాపా
యష్టాపదగర్భ కేశవార్చితచరణా
యష్టాపదముఖరిజని
తాష్టాపదకమలవాసనాధీనమునా. 225

పంచచామరము. మునీంద్రమానముద్రికాసముక్తముక్తవాసనా
సనాతనాత్మసేవకార్తి సారసావళీఘనా
ఘనాఘనానఘప్రకాశ కాయజాగ్నిజీవనా
ధనాధినాథ నందనేశ వాగధీశ పావనా. 226

గద్యము. ఇది శ్రీమత్కాళహస్తీశ్వర చరణకమల సేవాపరా
యణ సింగమరమానారాయణ జక్కయ నారాయణ
తనూభవ భవపరాఙ్ముఖ ధూర్జటి కవిప్రణీతం బైన
శ్రీకాళహస్తిమాహాత్మ్యంబునందుఁ
దృతీయాశ్వాసము.

శ్రీ ర స్తు

# శ్రీ కాళహస్తి మాహాత్మ్యము



## చతుర్థాశ్వాసము

కంఠ కంఠభూషిత
కాకోదరవర [1]వరాకఖండమతవ్యా
ఖ్యాకోలాహలదూర చి
దాకృతి జితకాల కాళహస్తీశ శివా. 1

ఆ. అవధరింపుఁ డిట్లు భవదీయ కథ విన్న
వింతు భక్తజనుల వీను లలర
మీఁద యాదవునకుఁ గారుణ్యరసపూరి
తేక్షణముల నానతిచ్చినట్లు. 2

### మధురాపురవర్ణనము

సీ. రాజులు వీరఘోరాజులఁబో వల
రాజు లౌదురు జయరతికి ననఁగ
గొమ్మలగమి కోటకొమ్మ లెక్కి నిలింప
కుజముకొమ్మల సిరుల్ గోయు ననఁగ

---

1. వరాహ.

నాగావళికిఁ జంచనాగానిలాస్వాద
నాగమనద్వార మగడి తనరఁగ
శతకోటిరుచిరత్నసౌధకోటిప్రభా
కోటిసోలికిఁ బ్రతికోటి యనఁగ
తే. చారుషాణ్ణత్యనిమ్నతా భావిభూతిఁ
జొక్కమై ప్రజ సంపదఁ జొక్కి మెఱయ
హారుఁడు చొక్కేశ్వరుండు మీనాక్షిసతియుఁ
గాఁపురం బుండు నమ్మధురాపురంబు. 3
ఉ. శ్రీవనజాక్షికిన్ జననసింధువు తత్పురి బొమ్మరిండ్లు నా
నావసథంబు లాత్మసఖు లంబుజలోచన లాటపట్లు ధా
త్రీవరమార్గముల్ రథహరిద్విరదాదులు బొమ్మ లాడుని
చ్చావచనావళుల్ నిగమశాస్త్రము లై [1]విలసిల్లు నెప్పుడున్.
చ. ధరణికిఁ గంఠభూషణము తన్నగరంబు తదీయమస్తకా
భరణము పార్థివాన్వయము ప్రాణము దానికి రాజనందనో
త్కరము తదాత్మకున్ [2]మదనదాహరసప్రదవైశ్యవీథి త
త్పరసివిలోచనల్ గుఱుతు చక్కఁదనంబున వారిలోపలన్.

{ మాణిక్యవల్లి యను వారవనిత శివభక్తిపారవశ్య
లగు కూఁతుల నిర్వురం గని పెంచుట }

క. మాణిక్యకలశజలనిధి
మాణిక్యం బగుచు మదనమతముల కిరవై
మాణిక్యవల్లి యనఁగా
నేణాక్షి యొకర్తు వన్నె కెక్కెను బురిలోన్. 6

1. విలసిల్లె. 2. మదనదారరసప్రద కళవీథి.

శా. ఆ వామేక్షణ దైవయోగమున గర్భాధానముం బొందినన్
వేవిళ్లయ్యె నరోచికంబు వొడమెన్ వెల్లంవనం బాస్యరా
జీవవ్యాపకమయ్యె నోకమి జనించెం జూపులుం గుక్షియున్
లావయ్యెన్ విటకోటిసంగసుఖ మల్పంబయ్యె నాపిమ్మటన్. 7

క. ప్రొద్దులనెల చొచ్చిన న
మ్ముద్దియకు జనించి రప్పుడు మోహనమూర్తుల్
ముద్దుమొగంబుల కన్యక
లిద్దఱు శివభక్తి తనుప్ర వెత్తిన పగిదిన్. 8

క. [1]రాజులకొడుకులు గణికా
రాజకుమారికలఁ గన్న రాజిల్లు మనో
రాజీవము గావున నా
రాజవదన సమ్మదాంబురాశిం దేలెన్. 9

మ. తలఁ బంకించిన సూనె పుక్కిట సదా తాంబూలము న్నేత్రక
జ్జలమున్ గంధరఁ గట్టుకొన్న పసపూసల్ గబ్బిపాలుబ్బుగు
బ్బలు నేకాంగుళికార్ప్య తాలకలస ద్భస్మంబు జిడ్డైనదు
వ్వలునం జెల్వుగ ఎడ్డకాన్పునడిపెన్ వామాక్షి బాలింతయై.

సీ. అలఁదు నలుంగు దేహమున వేణ్ణీళ్లార్చుఁ
దడియొత్తు మెత్తని ధవళవస్త్ర
మునఁ గాలిప్రేలి మ చ్చునబొట్టు వెట్టుఁ గ
న్నవఁ బెట్టుఁ గాటుక కసుపునకును
బెట్టుఁ బొత్తులమీఁదఁ బెట్టుఁ జన్నిచ్చు జో
కొట్టు జోలలు పాడు[2]మట్టుపఱచుఁ

1. రాజులు గణికలు. 2. మట్టెపఱచు. ము. పా.

దలయంటుఁ జిట్టాముదమున రక్షార్థంబు
ముసిఁడికోలలు మంచమున నమర్చుఁ
తే. బ్రాట నులిగాయఁ గూర్చి పాదములఁ గట్టు
నుప్పు వేపాకు పైఁ జల్లు నిప్పు లతివ
ద్రిప్పి యిడు దృష్టిదోషంబు దీర వీధిఁ
బ్రేమ మీఱంగ బిడ్డలఁ బెంచునపుడు. 11

చ. కనకపుఁ [1]బేర్లు సోయగము గల్గినము త్తెపుఁ గ్రొత్త తోట్లలో
నునిచి యనర్ఘరత్నముల నొప్పగు గుత్తులు మ్రోల వ్రేలఁ గ
ట్టిన వెలిఁగంది తెప్పలు సడల్పక తారకయోగమార్గవ
ర్తనరతులట్లఁ గన్గొనఁగ సాగిరి కన్య లనన్యచిత్తలై. 12

ఉ. కోకిలవాణి పాడుఁ దన కూరిమిబిడ్డలఁ దొట్లఁబెట్టి కో
క్కోకకళావిలాసములకుం గల యర్థము జోలపాటగా
నా కమనీయశైశవము నప్పటినుండియు వారధర్మవి
ద్యాకుశలత్వ మాత్మ జల కచ్చుపడఁగావలె నంచు నిచ్చలున్.

సీ. రతివధూమదనులు రంభానుబేరపు
త్రకు లూర్వశీపురూరవులు మేన
కాకౌశికులు గోపికాముకుందులు ధాన్య
మాలినీరావణుల్ మత్స్యలోచ
[2]నర్ష్యశృంగులు దాశనలినేక్షణాపరా
శరులు తారానిశాకరులు గౌత
మాంగనాదేవేంద్రు లమరవేశ్యాజయం
తులు ద్రౌపదీపాండవులు పృథాబ్జ

---

1. బెర్లు, బేరు. ము. పా; బేర్లు. 2. నా ఋశ్యశృంగులు దాశ-నలి...

తే. హితులు నడిచిన గతు లాత్మసుతలఁ బెంచు
నింటి గోడల వ్రాయించు నిందువదన
వనితలకు సరసతకల్మి వాసి వరుస
లేమియును లేమి వారల కెఱుక పఱుప. 14

క. వనిత చతుర్జాతి వయో
వనజాక్షుల బంధవైభవము భద్రుని ద
త్తుని గూచిమారుఁ బాంచా
లుని వ్రాయించెఁ గృహంబులోపలిగోడన్. 15

సీ. కూచిమార మనోజఘోణికాపుత్రాది
కానీత కామసిద్ధాంతములును
నిరుపమ కలనాద పరివాదినీ వీణ
లాదిగాఁ గల గాన యంత్రములును
కీర పారావత శారికా సారస
హంసాదు లైన విహంగములును
దత్తిల భరత మతంగాంజనేయకో
హళ మతి ప్రముఖ లాస్యాగమములు

తే. సంతరించె గృహంబులో జలజనేత్ర
రతులఁ జతురత గానధురంధరతలఁ
గంతరవనిపుణత నాట్యకౌశలములఁ
జిన్నపడుచులఁ బ్రోఢలఁ జేయఁ దలఁచి. 16

తే. పెక్కుతెఱఁగుల నీరీతిఁ బెంచి పిసివి
పంచకరపాట్లఁ బడ్డ నేపాటియైనఁ
బుణ్యధర్మంబు మదిలోనఁ బట్టుపడక
శైవధర్మంబె ధర్మంబుగా విధించి. 17

—దాసికూతుల చేష్టలు—

ఉ. ఆపసిబిడ్డ లేమిజననాంతరవాసనయో కనుంగవం
జూపు లిగుప్పుచో శివునిఁ జూడఁ దలంతురు పల్క నేర్చు
చోఁ, దాపసమానసాంబుధిసుధాకరు శంకరు రూపవర్ణనా
లాపము లాడఁ బోదురు కళానిధిశేఖర భక్తియుక్తలై. 18

తే. తోడివెలయాండ్రబిడ్డలతోడఁ గూడి
యాడఁబోదురు గాని పోరాడుతల్లి
మనసు రాఁ గోరి కన్యకామణులచిత్త
మాడు నర్ధేందుశేఖరు నందు నెపుడు. 19

ఉ. కన్యక లెల్లఁ గూడి రతికాముల నోఁచఁగఁ దాము భూమిభృ
త్కన్యక నీశునిం దలఁచి తత్తదలంకృతు లంబికాశివా
జాన్యఖిలార్చనావిధుల చందముగా వివరించి లోకసా
మాన్య [1]విహారగానము లుమాగిరిశస్తుతి గాఁగఁ బాడుచున్.

చ. కనకశలాకలం దెగడుకన్యలు గట్టిన బొమ్మరిల్లు శం
భునిగుడి బొమ్మ శంకరుఁడు బోనము గుజ్జెనగూడు వేడ్కఁ జే
సినపను లన్నియున్ శివునిసేవ యొనర్పఁగఁ బడ్డపాట్లుగా
మనమున నూహసేయుదురు మానునె తొల్లిటి జన్మవాసనల్.

మ. చదువం బెట్టినఁ బట్టదాత్మఁ గులాచారప్రధానోల్లప
న్మదనామ్నాయతదంగశాస్త్రములలోన న్లేశముం జిద్రసా
స్పదశైవాగమ మేకవారమె పఠింపన్వచ్చుఁ గన్యాద్వయం
బుదయంబైన ముహూర్త మెట్టిదొకో ధన్యల్మెచ్చఁగా
నిచ్చలున్. 22

1. విహార. ము. పా.

సీ. శివపూజనాసక్తి చిన్నిచన్నులపెక్కు
వయుఁ బ్రత్యహంబును నయముఁ జూప
శైవాగమాంతరజ్ఞానంబుఁ దనులతా
ప్రభయు నంతంతకు నభినవముగఁ
బార్వతీప్రాణేశభక్తియుఁ గూఁకట్లు
వెలసి నానాఁటికి వృద్ధిఁ బొంద
వార[1]కాంతాచారవాసనాబాల్యంబు
లొకపూఁట కొకపూఁట కుడిగిపోవ
తే. శాంభవంబైన తేజంబు శైవవాప
గమవయోగణ్య లావణ్య గౌరవంబు
హృదయమున నంగకంబుల నుదయ మొదవఁ
జదువఁ బోవుదు రిరువురు మదవతులును. 23

వ. ఆసమయంబున నియమంబున శ్రీకాళహస్తీశ్వరునకుఁ గవితా చమత్కారంబు మీఱ నత్కిరుండు చెప్పిన నూఱు పద్యంబులు పాఠంబుచేసి నిత్యవ్రతంబుగాఁ బఠించుచుఁ గఠిన కనకకుచకుంభలు శంభుండే తమకుఁ బరమపురుషుం డని యుండఁ బుండ్రేక్షు కోదండ విద్యారూఢకాంతామతల్లి యగు తల్లి దగ్గఱ కేతెంచి యిట్లనియె. 24

—వేశ్యమాత కూఁతులకు వారధర్మ ముపదేశించుట—

మ. పెలయాండ్రందఱు సన్నుతించిరి నను న్వేనోళ్లఁ గాణాచిక్రీ
గలిగెక్కె నిక్కని మీరు పుట్టినపుడే గారాము నా కింక ని
ష్ఫలమై పోఁ గులధర్మముల్ వదలఁగా భావ్యంబె యో

1. కులాచార.

యక్కలాస! లతాంతాస్త్రకళావిధిజ్ఞ లగు వారస్త్రీలలో
నక్కటా. 25

ఉ. ఎన్నఁడు నేర్తురో నడువ నెన్నఁడు నేర్తురొ మాటలాడఁగా
నెన్నఁడు నేర్తురో చదువ నెన్నఁడు నేర్తురొ యాడఁబాడఁ
గా, నెన్నఁడు నేర్తురో కళల నింపువలిర్ప విటాళిఁ గూడఁ
గాఁ, గన్నియ లంచుఁ బెంచిన సుఖం బిటు నేయఁగ మీకుఁ
బాడియే? 26

క. కళలుఁ బ్రమాణంబులుఁ జూ
పులు జాతులు గతులు బంధములుఁ బరిరంభం
బులు సత్త్వంబు లవస్థలుఁ
దెలిసి విటులఁ గలసి కులముఁ [1]దెలుపఁగ వలదే. 27

తే. జిహ్వ నాలుక జలము రాజీవదళము
నడుసుఁ గుమ్మరిపురువు దేహంబు గ్రచ్చ
కాయ బూడిద పొర యని కరణివిటులఁ
గలసియును గలయ కుండంగ వలయు లలన. 28

చ. జిగురునఁబడ్డ రాచిలుకచెల్వున సంపెఁగపువ్వు తావికిం
దగిలిన మిండతుమ్మెద విధంబునఁ దేనియ [2]లోనఁబడ్డ యీఁ
గ గతి విటుండు కూర్మిఁ దనకౌఁగిటి పొందునఁ జిక్కకున్న న
మ్మగువకు నేలయిచ్చు నసమానధనంబులు రిత్తమాటలన్?

సీ. మణిమంత్ర తంత్రము ల్మందులు మాయలు
సరసభాషలు వృథాసంభ్రమములుఁ

1. దేల్పఁగ. 2. ఁజిక్కినట్టి. ము. పా.

దెచ్చుకోలేవ్వులు నిచ్చకంబులు వట్టి
యానలుఁ దక్కులు నలపగతులు
నలుకలుఁ దరితీపు లాపలుఁ బ్రియములు
నగవులు బిగువులు నయము భయము
బలిమియుఁ జెలిమియు బాసలు నసువులుఁ
దిట్టులుఁ గొట్టులు దిట్టతనముఁ
తే. జాయవాటులు సన్నలు గాయకములు
మెచ్చులును దచ్చనలు పొరపొచ్చెములును
దగవులును వారకాంతావితానములకు
జలజలోచనలార! నైసర్గికములు. 30

క. ననువువిటునిఁ దక్కుచు నా
తనిచెలికానికిఁ బ్రియంబుఁ దగఁజెప్పిన న
వ్వనితపయి న్వోలుగదు మన
మనుమానము లేదు ధనము ననువుగఁ జేసున్. 31

తే. వేకువలయందు విటునిచే వీడియంబుఁ
బుచ్చుకొనఁ దగ దింటికిఁ బుచ్చుకొన్న
నూరనూరంగఁదద్ద్రివంబుమియ వలయు
వెలఁదులకు మంపుఁ బెట్టెపువేళ గాన. 32

చ. కలహాముచూపుచూపు దోలుకారుమెఱుంగులు తర్జనోక్తిగ
ర్జలు కపటాశ్రువృష్టి బలుచాయల [1]మేఘము లావిలాసినీ
తిలకము పల్లవావళి మదిం జనియించిన మోహశాలికం
దళములఁ బ్రోది సేయక వృథా వసియించిన నర్థ మబ్బునే.

---

1. మేఘముగా.

చ. మగల మనోనివాసముల మానిని దృఙ్మదనాస్త్రపావకుఁ
దగులు కొనఁ దగిల్చి చిఱున వ్వనుగందపుఁగొండగాడ్పు చేఁ
బొఁగ లెగయించి పల్కునెయి వోయుచు మండఁగ మాయ
కట్టుచే, నెగసనఁ ద్రోచి యార్పఁ దగు నించుక యించుక
కూర్మి తుంపరన్. 34

సీ. రసికులు మీగానరస మాన వచ్చిరి
పాడరే శివభక్తి [1]పాడుగాదు
జాణలు మీవిలాసముఁ జూడ వచ్చిరి
చూడరే శివభక్తి [2]చూఱవోదు
పల్లవుల్ మీతోడ భాషింప వచ్చిరి
పలుకరే శివభక్తి [3]పాఱిపోదు
పార్థివుల్ సకలసంపదలీయ వచ్చిరి
పిలువరే శివభక్తి [4]పెంపుచెడదు

తే. ధనము గలిగిన జంగమార్చనమొనర్ప
శివున కక్షోపచారముల్ సేయవచ్చు
వనజముఖులార! [5]మీసరివారిలోన
సిరుల మెఱయుచుఁ దలయెత్తి తిరుగవచ్చు. 35

వ. అని యిత్తెఱంగున మెఱుఁగుఁబోఁడులకు వెలయాండ్ర
పోణిమిఁ దెలుపఁ దమ తలంపులకుఁ గొలుపకున్న వారును
గన్నతల్లి కిట్లనిరి. 36

---

1. పాడుగాను. ము. పా. 2. చూఱవోను. ము. పా. 3. పాఱి
పోను. ము. పా. 4. పెంపుచెడను. ము. పా. 5. నాసరివారి. ము. పా.

వేశ్య లిర్వురును వారధర్మమును రోయుట

క. శ్రీకాళహస్తిపద
కోకనదారాధనంబె కులధర్మము త
ల్లోకవ్యాపకచిద్వి
ద్యాకారస్మృతియె కోణయాచి మదంబా. 37

మ. మణిమంత్రౌషధశక్తిచే విటులఁ బ్రేమగ్రస్తులం జేసి త
న్మణిభూషాదులు పుచ్చుకోఁ గొలుపదమ్మా బుద్ధి రుద్రాక్షమే
మణి పంచాక్షరి మంత్ర మౌషధము భస్మం బాత్మనాథుండు ద
క్షిణకైలాసవిభుండు భక్తి దమకుఁ శ్రీపాద మింకేటికిన్.

సీ. శివు నపేక్షించిన చిత్తంబు చిత్తజా
యత్తమై విటులపై నాసపడునె
పరశివస్తుతికథాభాషలు వినువీను
లాను నే కుంటెన లాడుపలుకు
లీశ్వరేశ్వరమూర్తి నీక్షింపఁ గోరెడు
చూ పన్యరూపంబుఁ జూడఁ జను నె
ముక్తివల్లభు ననురక్తిఁ గూడఁ దలంచు
కాయంబు గూడునె కాముకులను

తే. హరుని భవహరు శ్రీకాళహస్తినిలయు
వినుతి యొనరించు జిహ్వక మనుజతతికిఁ
బ్రియముఁ జెప్పంగఁ బోవునె నయము మీఱ
వారధర్మోపదేశంబు వలదు తల్లి. 39

ఉ. ఒక్కనిఁ దల్పుమూల మఱియొక్కనిఁ దల్లిగృహంబులోన వే
ఱొక్కని బోటిగేహమున నొక్కనిఁ జెల్లెలియింటిలోన నొం

డొక్కనిఁ జుట్టముంబలె యథోచితచౌర్యరతిప్రసక్తిమై
నొక్కని నొక్కరుం డెఱుఁగకుండ రమింపఁగ నమ్మ నేరమే!

ఉ. దానవనీమునీంద్రకుల దారభుజంగుఁడు భక్తబల్లహా
క్షారమణాంగనామణిభుజంగుఁడు ముక్తిపధూభుజంగుఁ డి
చ్ఛాకలితాంగభూషణభుజంగుఁడు మాకు భుజంగుఁ డమ్మ ని
స్సారమనుష్యమాత్రుఁడు భుజంగుఁడు గాఁ డికఁ మాట
లేటికిన్. 41

క. మగువకు శరీర మొసఁగిన
మగఁడు చిదంగనకు మగఁడు మాయాసతికిన్
మగఁడు మగవేల్పులకుఁ దగు
మగఁడు మగఁడు గాక మాకు మనుజుఁడు మగఁడే. 42

చ. అమృతము గ్రోలు జిహ్వ చవియంచుఁ దలంచునె కానె?
నింటిలో, [1]నమరమహీరుహం బుదయమైన నరుం డవనీశు
వేఁడునే?, యమిజనభాగ్యరూప మగునాదిమతత్త్వము గాళ
హస్తిదైవము భజియించుమానసము వారవధూ [2]మదసౌ
ఖ్య మెంచునే? 43

వ. అని తన యుపదేశంబు కర్ణప్రవేశంబు గానీక యున్నఁ గన్న
తల్లి చిన్నంబోయి. 44

కూఁతులవిరక్తికై వేశ్యమాత చింతించుట

శా. ఈ కేళిసదనంబు లీమృగమదం బీచంద్ర మీచందనం
బీకాశ్మీరము లీతులాంబరము లీహీరాది రత్నాంకితా
నేకాలంకృతు లీకరండనిచయం బీతూఁగుమంచంబు లే
నీకనార్థముగా ఘటించితిని దా రీక్షింప రింకెట్లొకో. 45

1. మమృతమహీధరం. 2. పద.

ఉ. కన్నులు చిత్తజాతుఁ డొకకాలము నేయని పుష్పబాణముల్
చన్నులు శృంఖలారహిత శంబరజిన్మదకుంభికుంభముల్
ప్రన్నని నవ్వు కాఱడవిఁ బర్విన వెన్నెల దేహకాంతిసం
పన్నత తప్తహేమరుచి భామలు పల్లవభోగ్య లౌదురే. 46

ఉ. ముట్టనిచిత్తజాతుశరముల్ దెలిగన్నులు రాజకీరముల్
ముట్టనిపక్వబింబములు మోవులు చన్నులు మిండతుమ్మెదల్
ముట్టని పుష్పమంజరులు మోములు రాహువు దంష్ట్రికా
గ్రముల్, ముట్టని చంద్రు లింతు లులిముట్టని లింగము లౌట
చిత్రమే. 47

మ. పదకంబు ల్హాలనూళ్ళు బాహుపురులున్ బంగారుఁ డంకం
బు లం, గదము ల్ముంగర లుంగరంబులు మణిగ్రైవేయముల్
దెచ్చి యిచ్చెద మంచున్ నృపనందనుల్ చెలులచేఁ జెప్పిం
చినం బల్కరీ, సుదతుల్ వారలతోడ నక్కటకటా సొమ్మెల్ల
వమ్మయ్యెనే. 48

ఉ. ఏ నెఱజాణలైనఁ గమలేక్షణల న్మణిమంత్రతంత్రవి
ద్యానవచాతురీమహిమ నైనను మందుల నైన నీశ్వర
జ్ఞానము మాన్పి కామసుఖసక్తులఁ జేసిరయేని యిత్తు గా
నైనను బుచ్చుకోక కమలాస్యల కన్నెఱికంబు వారికిన్. 49

ఈశ్వరుఁడు త్రోవలో వేశ్యలం గాపాడుట

శా. ఈరీతిం [1]గుమతోక్తులన్ జనని తమ్మిాండ్రింప నారాటమున్
బోరాటంబు ఘనంబులైనఁ బరశంభుం గాళహస్తీశ్వరున్

1. గుపితోక్తులన్.

జేరంబోవక మాన దింక మదిలోఁ జింతింప నిప్పాట నే
వ్వారచ్చోటికి మమ్ము నెమ్మిఁ గొనిపోవన్ శక్తు లుద్యుక్తులై.

క. ఏధన్యులు మము హిమగిరి
జాధవునిం గాళహస్తి సర్వేశ్వరునిన్
బోధమయున్ సంసారాం
భోధితరణిఁ గొలువఁ [1]గొంచు బోయెద రనుచున్. 51

మ. తలపోయం దమపంచతిన్నియలమీఁసం జంగములొవ్వెలె ని
చ్చలు దొంగుండెడు కన్నగాండ్రు విని రాజద్వారము
ల్లొచ్చి కా,వలికాండ్రం గనుఁబ్రామి చొప్పడఁచి త్రోవ
ల్దప్పిపో నేల యిం,తుల నమ్మించినఁ గాళహస్తి కని వత్తుర్
దక్కఁ దద్ద్రవ్యముల్. 52

మ. అని యక్కన్యలఁ జేరఁగాఁ బిలిచి యేలా తల్లితోఁ బోరఁగాఁ
బనిలే దాతిరు కాళహస్తిపతిఁ జూపన్ మాది భారంబు మా
వెనువెంటం జనుదెందు నమ్ముఁడు నిశావేళం బ్రయాణంబు రం
డన భక్తిన్ శరణార్థిఁ జేసి [2]తిరుసోహం బెల్లఁ జెల్లించుచున్.

సీ. కుట్టిన చెంగావిగుడ్డలయొడికట్టుఁ
బొంకపుఁదామ్రతాటంకములును
వివిధవస్త్రచ్ఛేదవిరచిత కంథలుఁ
బూతవిభూతిత్రిపుండ్రకములుఁ
గరమూలముల వ్రేలు కప్పెరల్ జోలెలు
భద్రరుద్రాక్ష నైపథ్యకములు

1. దొడుక. ము. పా. 2. తమ. ము. పా.

శివసూత్రబంధభాసిత శంభులింగముల్
    కుట్టిన కుఱుమాపుఁ బుట్టములును
తే. జిగురు డాకేల భసిత భస్త్రికలుఁ దనర
దొంగజంగము లెలయింప జంగమాంగ
నావిలాసంబుఁ గైకొని నళినముఖులు
కాళహస్తీశు దర్శించు కాంక్షఁ గదలి. 54

ఉ. ఇద్దఱు నింటిబిడ్డల ననేకధనంబుల వారి చేతికిన్
ముద్దియ లిచ్చి యాతపసి మ్రుచ్చుల నచ్చి గృహంబుపాడుగా
నద్దమరేయిఁ బోయిరి శివా యని పల్కుచు రెండ రామడన్
బ్రొద్దు పొటుక్కసం బొడువ భూధరకూటము లెక్కి
డిగ్గుచున్. 55

వేశ్య లిర్వురును గాళహస్తికిఁ బయనం బగుట

తే. తప్పుత్రోవల నీరీతిఁ జొప్పు మార్చి
[1]కుంభఘోణంబునకు శాతకుంభకుంభ
ఘనపయోధరకుంభలు గడచి చనిరి
భేశరేఖావతంసుఁ గుంభేశుఁ గొలువ. 56

ఉ. అక్కడనుండి వారు సుఖమైన ప్రయాణమునం జిదంబరున్
మ్రొక్కుల యిక్క తాండవసముద్ధతపాదనిపాతితాంగదున్
వాక్కమలేశమానసనివాసభవున్ శివకామసుందరిన్
బ్రక్క ననారతంబుఁ బెడఁబాయఁగనీని జితాంగసంభవున్.

క. కలిభంజనదక్షుఁ బతం
జలిమౌని వ్యాఘ్రపాద సంయమిపూజా

1. కుంభకోణ.

ఫలమూర్తి గగనకసభా
నిలయు విలయనటనచటుల నిటలోగ్రాక్షున్. 58

క. వచ్చి భజియించి రచ్చో
నుచ్చరదంబుచరచంక్రమోగ్రస్వన మై
యుచ్చావచవీచీపా
టచ్చరహృతవియదసితపటల మగు నబ్ధిన్. 59

సీ. దరిఁదన్ని తిరిగెడుతరఁగలు చనుదెంచు
తరఁగలు నొండొంటిఁ దాఁకు [1]రవము
గుములు గూడుక కంధరము లాకసము డిగ్గి
నీరంబుఁ గ్రోలెడు నిబిడరవము
మబ్బునఁ గసరెత్తి యుబ్బి యంతంతకుఁ
బొరలంగఁ బడియెడు భూరిరవము
ననుదినపూర్వాపరాహ్ణవేళలఁ బోటు
పొడిచి వచ్చిననీటి బోరు రవము
తే. దశదిశాభాగములఁ బ్రతిధ్వనులనీన
వలయ శైలాది గిరిగుహా [2]వాసిసింహ
శరభ శార్దూల హృదయభీకరము లగుచుఁ
దనకు నైజంబులుగమించు వనధిరాజు. 60

క. భంగకరస్ఫురఘట్టన
భంగసముద్భూత బిందుపటలంబు మరు
త్పుంగవులకుఁ దా నొసఁగు న
భంగుర మౌక్తికవితానభంగిం దనరెన్. 61

1. నురము. 2. వాస.

క. రత్నము లిభరత్నముఁ దరు
రత్న వధూరత్న ధేనురత్నంబులు గ్లౌ
రత్న మమృతరత్నము హరి
రత్నమునుం గలిగి మెఱయు రత్నాకరమున్. 62

సీ. తనయందుఁ బజ్వలించిన నీలవర్ణుని
నీడ నీరం బెల్ల నిండె ననఁగఁ
పోలికి నోడి తా నెటకుఁ బాఱఁగ లేక
తనయందుఁ దిమిరంబు దాఁగె ననఁగఁ
దనయందు బడబాగ్ని ఘనతరజ్వాలలు
మండఁగ నుదరంబు మాఁడె ననఁగఁ
జంబూఫలద్యుతి నంబరం బంతయుఁ
దనయందుఁ బ్రతిఫలించినది యనఁగ

తే. నీరదవ్రాత పురుహూత నీలకజ్జ
లాతసీపుష్ప కస్తూరికాళిజాత
సన్నిభచ్ఛాయఁ గనుపట్టుసాగరేంద్రుఁ
గాంచి రద్దేవు పూర్వభాగమునవారు. 63

ఉ. అచ్చట ముచ్చులున్ జలరుహాక్షులునుం బయనంబుఁ జేసి వే.
వచ్చిన నొప్పిఁ దీర్చుకొని వర్ణమయిన్ శివకామసుందరిన్
జిచ్చుఱకంటి కాహుతిగఁ జిత్తజుఁ జేసినయొజ్జఁ దాండవం
బిచ్చల నింగి రచ్చ రచియించినవ ర్తకునిన్ [1]భజించుచున్. 64

వ. మూఁడవనాఁ డాపురంబు రేపకడ వెడలి యడవి నడుమ
నడచునప్పుడు. 65

---

1. భజింపుచున్.

దొంగలయత్నంబుల నెల్లఁ బరమశివుఁడు వారించుట

ఉ. ఇక్కడఁ గూయి చెప్పుటకు నెంతయు దూరపుఁజొప్పుమా
ర్పిపో, నిక్కడ వైపు నట్టడవి యిక్కడఁ జేరువ నూరు పల్లె
లే, దిక్కడ నెవ్వరుం దిరుగ రిక్కడ నేఁడిదె ప్రొద్దు దోఁ
చుకో, నిక్కడ వాట మంచు మది నెంచఁగ వారికి నక్క
డక్కడన్. 66

ఉ. రాజును సేనయుఁ శబర రాజుఁ బులింద భటాళియుఁ వణి
గ్రాజును వైశ్యులుం దసిరాజును శిష్యతతిం గపాలభృ
ద్రాజును జోగిపింఛుఁ బళురక్షక రాజును గొల్లవాండ్రు నై
రాజధరుండు దోఁచు నుమరాజముఖీమణి రక్షణార్థమై. 67

శా. ఊరూర న్వెడిదిండ్లఁ జంపుటకు నుద్యోగింపఁగా జంగమా
కారం బొప్పఁగ వచ్చి పూజఁగొని శ్రీకాళద్వివేశుండు యో
షారత్నంబుల కాత్మవిస్య యుపదేశం బిచ్చు వ్యాజంబునఁ
గారుణ్యంబున వారినిచ్ర యుడుగంగాఁ జేయు నక్తంబులన్.

శా. ఆడొంగల్ దెగి యిట్లకృత్యములు నేయుం జూడఁగా దేవ
తా, చూడారత్నము వారియత్నముల కెచ్చోఁ గూడ
కుండఁ సుఖక్రీడం గన్యలఁ గొంచుఁ బోఁ గనిరి భక్తిఁ
ముందర న్మందర, [1]క్రీడాకృత్తిమకాళశైల[2]కృతక శ్రీభంగ
శృంగంబులన్. 69

చ. కనుఁగొని యారణీతటినిఁ గాయము దోఁచి తదీయసైకతా
వని నభవుఁ భజించి యపవర్గరమావిభు వాలిపూజనే
సిన శివలింగముం గొలిచి సిద్ధుల కయ్యణిమాదిసిద్ధు లి
చ్చిన వరభైరవుఁ దలఁచి చిత్తములోపలఁ దన్మహత్త్వమున్.

1. ప్రీడా. 2. కృదజ.

వ. తెలియఁ గోరి యడుగుటయు నప్పురాణజ్ఞు లగు పౌరు లి
ట్లనిరి. 71

## వాలి పూజించిన శివలింగకథ

ఉ. ఒక్కసరోవరం బిచట నుండఁగఁ దొల్లి తదీయతీరమం
దక్కపిరాజు వాలి రచితాసనుఁ డై తనసజ్జలింగము
న్నిక్కపు భక్తిఁ బీఠమున నిల్పి [1]భజించుచు నుద్వసింపఁ బో
నక్కడ దేవుఁడుండఁ బ్రియమందుచుఁ జేతికి రాక తక్కినన్.

క. ఒకచేతఁ బట్టి తివిసిన
నొకయింతయుఁ గదలకున్న నొగి [2]మోఁకాలిం
చుక బలిమి రెండు చేతులఁ
బెకలింపఁగఁ బూనుటయును భేదిల కున్నన్. 73

ఉ. గ్రక్కున లేచి వాలమున గాఢతరంబుగఁ జుట్టి పిక్క లు
క్కెక్కఁగఁ ద్రొక్కి నిల్చి తను వించుక వంచి కరంబు లూరు
లన్, నొక్కి ముఖాంబుజంబునఁ గచుంగవఁ గెంపు జనింపఁ
జేవ మై, నిక్కఁగఁ గ్రుంగెఁ బాదములు నేలఁ జలింపదు
లింగ మేమియున్. 74

క. వాలముబిగువున నతది
క్పాలుని దేహంబు తలులు వడుటయు భీతిన్
జాలిఁబడి వాలి నేలకు
వ్రాలి ప్రణామంబు లెన్ని వలసినఁ జేసెన్. 75.

క. చేసి మహేశ్వర నీకేఁ
జేసిన యపరాధ మెద్ది చిత్తంబున నన్

1. భజింపుచు. 2. మోకాలిం.

రోసియొ భుజబల మెసఁగఁగఁ
దీసిన రావైతి వేవి తెలుఁ గిందులకున్ ? 76

క. ఒకపూఁటయు మిము దర్శిం
పక యుండఁగ లేని నన్ను భక్తమరున్నై
చికి ! నిమిషములో విడిచితి
వకటా నిష్కారణమ కృపాంబుధి వయ్యున్. 77

సీ. నాపాలి మూలధనంబవు నాపాలి
భాగ్యదేవతవు నాపాలి నిధివి
నాపాలి దేవరత్నమవు నాపాలిక
ల్పకపాదపమవు నాపాలి మతివి
నాపాలియిహసాధ నంబవు నాపాలి
పరసాధకుఁడవు నాపాలి గతివి
నాపాలి శుభకారణంబవు నాపాలి
పరమపుణ్యమవు నాపాలి సిరివి

తే. దేవ నాపాలి దేవతా ధేనుమణివి
శూలి ! నాపాలితంగేఁటిజున్న వీవ
నన్ను విడనాడఁ గత మెద్ది నతనిలింప !
యేమి యపరాధ మొనరించితీశ యనుడు. 78

చ. పరశివలింగ మింద్రజుఁ గృపామయదృష్టినిఁ జూచి యేటికీ
బొరలఁగఁ జిత్త మీశొలని పొంత వసింపఁగ వేడుకైన సు
స్థిరగతి నిల్చినాఁడ విరతి న్నినుఁ బాసిన వాఁడఁ గాను ద
త్పరత భజింపు మెప్పటివిధంబున నీ మదిలోన నుండెదన్. 79

చ. అని తనసజ్జలింగము దయాతిశయంబున నానతిచ్చిన
న్విని యిచట న్వసింతు నను వేఁడుక దీలు సరోవరంబుఁ బూ

డ్చినఁ దనయంత శంకరుఁడు చేతికి వచ్చు నటంచు గోత్రభి
త్తనయుఁడు నిమ్మహానగము దానిపయి న్వడిఁ దెచ్చి వైచినన్.

క. దశదిశలఁ దత్సరోవర
విశదపయఃపూర ముబ్బి వెడలఁగఁ దొడఁగెన్
శశిధరునిదండ దక్షిణ
దిశ నిర్ఝరజలము ధరణిఁ దేఱుచుఁ బొడమెన్. 81

మ. ఇది తీర్థోత్తమ మిందు నాడిన నరుం డీఘోరసంసారదుః
ఖదవాగ్నివ్యథఁ బాయుఁ బంకరుహభూదృక్కంజాతగర్భాదిక
త్రిదశుల్ గూడి చరింతు రిందు నణిమాదిప్రాప్తి యీ భైర
వాస్పద మిక్కొండఁ [1]జరించుచుండు నుమతో సర్వేశ్వరుం
డిమ్ములన్. 82

సీ. ఎఱుకు లీగిరిమీఁద నిచ్చఁ ద్రిమ్మర నయో
మయసాధనములు హేమంబు లగును
శబరులు మృగములఁ జంపి యిమ్ముల డిగ్గి
వచ్చునాలో సజీవంబు లగును
వ్యాధు లీకొండపై వన్యాశనంబులు
సేవింపఁగాఁ గాయసిద్ధి యగును
జెంచు లీయద్రి నిద్రించి మేల్కాను వేళఁ
దమవధూటుల తల్పతలము లగును

తే. దృశ్యమగువారి కిందు నిధివ్రజంబు
దృశ్య మగుఁ గూడితమతోడఁ బసుగుజనము
విస్మయముఁ జెప్ప నొక్కొక్కవేళ దీని
సానుభూముల మహిమాతిశయవిధంబు. 83

1. జరించుచుండు.

క. వాసవసుతుఁ డాలింగముఁ
బాసి చనఁగ లేక గాసిఁ [1]బడియుం దనుఁ దా
రోసియుఁ బలునిట్టూర్పులు
నేసియు నాఁడెల్ల నుపవసించుచుఁ జనియెన్. 84

మ. ఇది యీ తీర్థమహత్త్వ మీ మహిమ వాణీశ ద్విజిహ్వా
శులుం, దుదిముట్ట న్వినుతింప లేరు నరమాత్రుల్ చెప్పఁగా
శక్తులే?, సుదతీ రత్నములార! మీరు పరమేశుం గొల్చి
యీ ప్రొద్దు న్నెమ్మది నిచ్చోట వసించి పొం డనఁగ రామల్
సంతసం బందుచున్. 85

ఉ. మజ్జన భోజనాదులకు మాపు శయించుటకున్ వధూమణుల్
సజ్జనగేహ మొక్కటి విచారము చేసి యొసఁగ్చి వారి పెన్
సజ్జఁ దొలంగి యచ్చటఁ బ్రసన్నత నిల్చిన లింగమున్ భవా
పజ్జలరాశికుంభజుని భక్తి భజింపఁగఁ బోవునంతటన్. 86

## సూర్యాస్తమయాదివర్ణము

శా. సాయంకాలరఘుక్షితీశ్వరుఁడు కెంజాయ న్ముఖం బొప్పఁగా
డాయ న్వచ్చి తమిస్రతిప్రతరకాండధ్వస్తపాదంబుగాఁ
జేయం జక్రవధూధరాసుతకు విశ్లేషవ్యథాపాది యై
మాయామేచకమృగంబు నాఁ బడియె న మ్మార్తాండుఁ
డస్తాద్రిపై. 87

క. పంకేరుహాప్తబింబము
గ్రుంకఁగఁ దిమిరం బజాండగోళము నిండెన్

---

1. బడియెం.

శంకాతమఃపరంపర
శంకరచిద్రహితమానసంబును బోలెన్. 88

తే. తపనుఁ డుదయింపఁ దద్బింబదర్శనమున
లోకపాతకపటలంబు లోఁగి పఱచి
యతఁడు గ్రుంకినఁ జనుదెంచె నన(గ)ఁ [1]బర్వి
యంధకారంబు జగమెల్ల [2]నాక్రమించె. 89

సీ. వామాంగభామినీ శ్యామధా[3]మాళియుఁ
గంఠహాలాహల కాళిమంబు
నాకాశకేశపాశాసితచ్ఛాయయుఁ
జూళికాసింధుశైవాలరుచియుఁ
[4]గరకృష్ణసారాక్షి ఘనధూమనీలిమ
శేషభూషణఫణాసీమనలువుఁ
[5]గటితటకీలిత కరటిచర్మద్యుతి
మేచకశూలశోభాచయంబు

తే. భువనలోచను పైనెత్తి పోవునంధ
కారబృందంబునకుఁ దోఁపు గాఁగఁ గూర్చి
వెనుక నేతెంచుభూతేశువిధముననఁ
జంద్రుఁ డుదయాద్రిపై నొప్పెసాంద్రకాంతి. 90

చ. తిమిరదినేంద్రజాజలము దెచ్చి యజాండఘటంబునందుఁ బో
సి మరలఁ బశ్చిమాశ యను చెల్వ వహించిన పద్మరాగకుం
భముగతి సూర్యుఁడుం జనియెఁ బ్రాక్సతి వెన్నెల వేల్పు

1. బర్వె. 2. నాక్రమించి. 3. మావళి. 4. గరకృష్ణసారాగ్ని ఘనధూమనీలిమ. 5. కటితటీ.

చేటి తోయము వడఁ బోయు హేమకలశాకృతిఁ జం
ద్రుఁడు నొప్పె నయ్యెడన్. 91

ఉ. కాముకహృద్దధిం గలఁచు కవ్వము బువ్వము దేవకోటికిన్
వ్యోమపథంబు తేనెపెర కొప్పెడు పర్వము మవ్వ ముత్పల
శ్రీమతికిన్ జకోరమహిషీమధుపాళికిఁ బ్రోచునన్నమై, యా
మవతీశబింబ ముదయాచల మెక్కెఁ బ్రభాళిపెక్కువన్. 92

ఉ. వెన్నెలగుజ్జు నంజుకొని వెన్నెలప్రోవు భుజించి నాలిక
న్వెన్నెల గ్రొజ్జుఁ జాలఁగొని వెన్నెలతేటలఁ ద్రావి వేడుకన్
వెన్నెలకాను జుఱ్ఱుకొని వీథులయందుఁ జకోరదంపతుల్
మిన్నులుముట్టి వెన్నెలలు మేపుచుఁ బిల్లలుఁదాము నాడఁగన్.

క. వాలీశ్వరభైరవులం
బాలికలు భజించి భూతపతి నభవుని శ్రీ
కాళద్విపేశు మదిలోఁ
గీలించుచు విడిదియింటికిం జని పిదపన్. 94

క. ఆజంగములును దారును
భోజన మొనరించి వాలి పూజించినయా
రాజకళాధరుచరితము
రాజముఖులు చదువుకొనుచు రాజిల్లంగన్. 95

శా. తారాప్రోష్ఠులఁ గాలసూతుఁడు వియద్వ్యారాశి వేఁటాడి ప్రా
ష్ఠారంభం బను బుట్టిఁ బెట్టి నులివాయం గుంజి యీఁ
దాఱఁ జెన్నారన్ వైచిన జాలమో యనఁగ శోభాకించ
నత్వంబునన్, దారానాయకమండలం బమరె నస్తగ్రావ
కూటంబునన్. 96

ఉ. చీఁకటి కానచిచ్చు భవుచేలకుసుంభము తూర్పుకొండకుం
గూఁకటిరత్న మబ్జరమకూరిమిసంట చకోరరాజిపే
రాఁకటిమంట శోణకిరణావళిగంట రథాంగకేళికిం
దేఁకువ వెంట మింటఁ జనుదెంచె దినేంద్రుఁడు కాలఘుంటరై.

క. అంతట భక్తస్వాంతని
శాంతు నుమాకాంతు హరు నిశాంతసపర్యం
గాంతలు సేవించుచు నా
శాంతంబుల నెండ మొలక లలరఁ బయనమై. 98

దొంగలు విఫలమనోరథు లై చనుట

ఉ. నాఁడొకపల్లె కేఁగి మఱునాఁ డుదయార్చన సేయఁ గోరి పూఁ
బోఁడులు భూరిసత్త్వకులభూత్కృతి ఖాంకృతి ఘుర్ఘుర
ధ్వనుల్, గాఁడి చెవుల్ పగుల్ప ఘనకాననమధ్యసరస్తటం
బునన్, మూఁడవకంటివేల్పుఁ దమముందరఁ బెట్టుక నిశ్చల
స్థితిన్. 99

శా. ఆరాధింపఁగ దొంగజంగములు నేఁ డబ్జాస్యలం జంపి భూ
షారత్నాదిధనంబుఁ బుచ్చుకొని యిచ్ఛావృత్తిఁ బోవచ్చుఁ
గాం, తారంబుల్ నడి నిర్గమించి యటుగాదా మ వటీ
సందునన్, జేరంబోదురు కాళహస్తి కనుచుం జింతింపఁగా
నంతటన్. 100

శా. అప్పావాత్తు లరిష్టసాధ్వసము సేయం [1]జెల్లియల్ మెల్ల నే
యప్పా! చూడు మటన్నఁ గన్నె నగి యోయమ్మా! పరా
కేటికే, చెప్పం జూపఁగరాని లోకజనకుం శ్రీకాళహస్తీశు

1. జేడియల్. ము. పా.

మా, యప్పయ్యర్ భజియింప నేమయిన నేమయ్యె న్నదిం
జూడవే. 101

క. నావుడుఁ దదేకనిష్ఠా
పావన భావనసమాధిఁ బరవశ లగుచున్
సేవింపంగా నంతటఁ
బూవుంబోణులకు వేడ్కపుట్టం గరుణన్. 102

సీ. శ్రీకాళహస్తిగౌరీపతి స్తోత్రముల్
పెట్టిన వెలిబూదిపెండెకట్లు
[1]గళములఁ గుఱుబోడ తలల రుద్రాక్షముల్
గండచలత్తామ్రకుండలములు
ధాతురాగాంగవస్త్రములు గోఁచులు
నెడమఁముంజేతుల నెసఁగుపజ్జ
[2]లును దీవ్రభావనంబునఁ బుట్టు చెమటలుఁ
జెదరి పువ్వులు గోయుశీఘ్రగతులు
తే. గలుగు ప్రమథులతోడ శ్రీకాళహస్తి
శివుఁడు సనుదెంచెఁ దనుఁ బూజసేయ నలచి
పత్రపుష్పఫలంబులు భక్తిఁ దెచ్చు
ద్రవిళజంగమ వేషంబు లవధరించి. 103

క. ఆకలకలమునఁ జిత్తం
బాకులతం బొంద దొంగ లడవులపాలై
కాకుల తెఱఁగునఁ జని రే
కాకు లగుచు నొకరి నొకరు గానక భీతిన్. 104

1. గరమున. 2. లఘుపమ సంభ్రమంబునఁ బుట్టు చెమటయుం.

ఇద్దఱుస్త్రీలును సాయుజ్యంబు వడయుట

క. మదనారియు నాపిమ్మట
సుదతులఁ గదియంగఁ బోయి చూపులఁ గరుణం
బొదలఁ గనుంగొని వారల
నిది యే మిచ్చోట నుండ నిటువలె? నన్నన్. 105

శా. ఆయయ్యం గని మ్రొక్కి ధన్య లగుకన్యల్ దమ్ము నమ్మించి య, మ్మాయాజంగము లిచ్చఁదెచ్చుటయు నాత్మస్వర్ణ భూషాదు ల, న్యాయంబూని హరింపఁ బూనుటయుఁ దా రచ్చోటి కాలోన వి,చ్ఛేయం గన్గొని దొంగ లేఁగినదియుం జెప్పం గృపామూర్తి యై. 106

క. మాయమ్మలార! కరుణా
తోయనిధిం గాళహస్తితుహినాంశుధరుం
శ్రేయోనిధి నారాధన
సేయం గొనిపోయెదము ప్రచింత యుడుగుఁడీ. 107

వ. అని యాదరించి తలోదరుల ముందరఁ బెట్టుక నెట్టుకొని జీవులం గొట్టుకట్టున కొడిగట్టు వేలుపుగట్టి వాయిదెస వెండి గట్టు వాయలేక తోకొనిపోవఁ ద్రోవ నా వనదేవతలు తనకు నర్పున లొనప్పు నేసవేసవడ సమీరకుమార ప్రేరితకుసుమి తలతాగళితప్రసూనంబులుఁ బూఁదేనియసోనలతానంబులు మధుపవితానానూనగానమానంబులు నగురుగుగ్గులు పటీర తరు పరప్పర కషణజనితానలధూపధూమంబులును గభీర నదీతీర సదారాదక నీవార ముష్టింపచ శైవభారతీ పరిచయ ధురీణ కీర శారికావ్యాహారమంత్రంబులుఁ తృణీకృత గగన మణి దక్షిణరజతగిరి మణిగణ ఘృణినీరాజనంబులును సరభ

నైన సైరిభ శరభ హరి ప్రభృతి మృగ విభు సభా గభీర
వినత గిరి దరీభవ ప్రతిరవ ఘుమఘుమాకార వాద్యంబులును
పనసరసాల సాల హింతాల రంభా జంబూ జంబీర కపిత్థ
వృక్షోత్కరంబులును వలసిన యెడల నిరుగడల
కుంభసంభవ కుంభినీధర కన్యాంభో
రుహ కల్హారాది సౌరభంబులును గంగోత్తమాంగలింగాంగ
రాగీకృత గంధసార ఘనసార కుంకుమ సంకుమద మృగమదా
మోదంబును నారామసీమా మాకంద మందార కర్ణికార నమేరు
దేవదారు మాలూర కేసర కుటజ వకుళ మల్లికాది ప్రసూన
వాసనారాశి నీసునం దమయుండుఁ బెనఁగొనఁగొను శీతల
వాతపోతంబులును యాతాయాత భూతేశ్వర పథి ప్రయా
సంబు నపనయించుచుఁ జనుదెంచె. చంచత్పంచాస్యంబును
నటన్నీలకంఠంబును విలసితశివంబును నాశ్రితలుంఠాకాతా
తంగకిరాతంబు నై యేపంకజాజిన శంకరాకార స్మరణ
కారణం బై సమున్నత శిలావిలిఖిత ఖతలంబును జతుర్భుజ
చతుర్ముఖ శతమఖావధి నిర్జర లోచనాగోచరంబును మునిజన
భాగధేయంబును ననపాయి సుఖప్రదాయకంబును బురాణ
వాణీప్రణీతమహిమంబును గణనాతీత ప్రభావంబు నై
యురులింగసముల్లాసంబు ననుకరించు దక్షిణకైలాసంబు
కట్టెదుటం బొడగట్టి నట్టియెడఁ బడంతు లడవి వెడలి యెడ
పడని సంతోషంబున నొడయనిం గొనియాడిరి. ప్రవిళ
జంగమపుంగవుండును సంగడిం జనుదెంచు జంగమలింగం
బులతోడం గూడి ప్రసన్న కాళహస్తి హిమగభస్తి చూడా
మణి పొంతకు నేతెంచునంత నంతర్ధానం బవధరించిన. 103

మ. తమలోన న్మధురాపురాంగనలు చోద్యంబంది శ్రీకాళహ
స్తిమహాదేవుఁడు జంగమాకృతివిభూతిం భృత్యులం గూడి
వచ్చి మదీయ వ్యథఁ దీర్చి యాత్మనగరీసీమాపకంఠంబుఁ జే
ర్చి మఱుం గొక్కటి పెట్టి పోయె నిఁక నేరీతిం గనుం
గొందుమో. 109

సీ. చింతింప లేమైతి మంతకాంతకుఁ డని
యెఱుఁగమైతిమి పార్వతీశుఁ డనుచుఁ
దెలియమైతిమి మది దేవదేవుం డని
పట్టమైతిమి ఖండపరశు ననుచుఁ
గానలేమైతిమి గంగాధరుం డని
భావింపమైతిమి భర్గుఁ డనుచుఁ
దలఁపలేమైతిమి దర్పకాహితుఁ డని
యెన్నమైతిమి జగదీశుఁ డనుచు
తే. నేరమైతిమి శివుఁ డని నిశ్చయింప
మ్రొక్కమైతిమి భవుఁ డని మోఁకరించి
చూడమైతిమి హరుఁ డని చొక్కిచొక్కి
యింక నెన్నఁడు [1]దర్శింతు మిందుధరుని. 110

సీ. కట్టుఁగొయ్యకుఁ జేరి కామధేనువు దప్పెఁ
గానవచ్చిన పెన్నిధాన మడఁగెఁ
గరతలంబున నున్న సురమణి పడిపోయెఁ
బండినతపము నిష్ఫలతఁ బొందె
మ్రోల వచ్చిన కల్పసాల ముప్పెనఁ బోయె
వచ్చిన భాగ్యదేవత వొలంగెఁ

1. దరిసింతు. ము. పా.

బ్రాప్తమయ్యును సిద్ధరసము నీరస మయ్యె
దొరకియు వృథయయ్యెఁ బరుసవేది

తే. యేమి సేయుదు మిట్లు విశ్వేశ్వరుండు
కాళహస్తీశ్వరుఁడు భవగహనదహన
దక్షుఁ డపవర్గవిభుఁడు ప్రత్యక్షమయ్యుఁ
దెలియకుండఁగ వెనువెంట మెలఁగి చనియె. 111

తే. ఫలముఁ గొమ్మని ముంగలఁబెట్టి యాసఁ
గొలిపి శిశువులఁ జేరంగఁ బిలిచి నట్లు
తపసులకు జన్మఫలమైన తనమహత్త్వ
మెఱుకపడనీక సర్వేశుఁ డేఁగె నకట. 112

శా. కానీ యాత్మనివాసదక్షిణదిశాకైలాసముం జూపఁడే
తా నేఁ డంచలు నద్దురాత్ములడపిం దాఁగెన్ సవాత్సల్యపూ
ర్ణానుక్రోశమనీష శంక నవఁ డేలా తేలిపోఁ జూచు న
త్యైనం జాలవె యీపురిన్ మనకుఁ దన్నర్చించు భాగ్యో
న్నతుల్. 113

సీ. ఈమూర్తి కాళహస్తీశలింగాకృతి
యీశీలది కుమారకాళహస్తి
యీపాటి కేతకీస్వేదనదీరూప
మీలాగు సిలాంచలేంద్రమహిమ
మీదారి దుర్గాధరాధరాగమగాద
యీతెలుంగుది సహస్రేశతీర్థ
మీప్రభావసమగ్రమింద్రతపస్స్థలం
బీరీతి ఘనము మయూరతీర్థ

తే. మిట్టి గతి మోహనక్షేత్ర మెన్న ననుచుఁ
జెప్ప విని కొల్వ సంకల్పసిద్ధి గాఁగ
నభవుఁ డిందాఁక మనవెంట నరుగుదేఁడె
యిచట సేవింప నిఁక మోక్ష మేమి యరుదు. 114

మ. శివభక్తాకృతి నున్నవారు ప్రమథుల్ శ్రీకాళహస్తీశుఁ డై
శివుఁ డున్నాఁ డిదె జ్ఞానపుష్పకలికాచిహ్నాంబతో నున్న దీ
శ విహారాద్రి యమాశ వెండిమల నా సంజాతమై యున్న దిం
క విచారింపఁగ నేల నేఁడె మనకుం గైవల్య సౌఖ్యం బగున్.

శా. రుద్రాక్షస్రగలంకృతుల్ భసితధాముల్ పంచవర్ణానుగో
న్నిద్రస్వాంతులు శాంతు లంగభవభిన్నిత్యార్చనాకృత్య
లో, లద్రాక్షిష్ఠులు మౌనముద్రితముఖు లై వైరాగ్యభాగ్యో
దయుల్, భద్రాకారు లటంచుఁ బౌరజను లా భామల్ విలో
కించుచున్. 116

సీ. సతత మే మొగలేట జలకంబు లాడిన
బహుజన్మపాపజంబాల మెడలు
నల్పమే జ్ఞానపుష్పాంబ సేవించిన
బరశివజ్ఞానసంపత్తి గలుగు
సన్నమే దుర్గాంబ సందర్శనము సేయ
నష్టపాశక్లేశ మడఁగి పోవు
సులభ మే దక్షిణ కలధౌతగిరిఁ గన్న
సంతతానందంబు సంభవించు

తే. సుకర మే యాదిమధ్యాంతశూన్యమూర్తి
భావనాతీతు యోగీంద్రభాగధేయుఁ

గాలసంహారకర్త శ్రీకాళహస్తి
శివునిఁ బూజింప మోక్షంబు సిద్ధ మనుచు. 117

చ. ప్రమదలు కుంభసంభవధరాధరకన్యకఁ దీర్థమాడి సి
క్తము లగు వస్త్రముల్ విడిచి ధౌతపటంబులఁ గట్టి కేశపా
శముఁ దడియొత్తికొంచుఁ గటిసంధి నటింపఁగఁ గీలుగంటు లం
దముగ నమర్చి సైకతవితర్దికలం గమలాపవస్థలై. 118

ఉ. అక్కరుఁ గాళహస్తిగిరిజాధిపు మానసవీధి నిల్పి పం
చాక్షర పూత భూతి విహితాంగములై ధరియించి భద్రరు
ద్రాక్షవిభూషితావయవలై శివపూజ యొనర్చి కర్మబం
ధక్షయకారణంబు లగు తద్గుణకీర్తనముల్ [1]పఠించుచున్.

క. ద్రవిళకవిరచితనుతిశత
మవిరళగతిఁ జదువుకొనుచు నన్యవిచార
వ్యవహారదూరు లగుచుఁ
భవభవనద్వారమునకు భామలు గదియన్. 120

సీ. నగవు రాకుండియు మొగమునెత్తముల
నగ నంకురించు సోయగము నిగుడ
మదము లేకుండియు నుదితతారుణ్యసం
పదమదం బుదయించునుదుటు దెలుప
మెఱుఁగు పెట్టకయును మెఱయునిద్దపుమేని
మెఱుఁగులుతరఁగలై తుఱఁగలింప
[2]నడపు బిత్తరముగా నడవ నేరకయును
[3]నడవ నొయ్యారంబు ముడివడంగ

1. పఠింపుచున్. 2. నడుపు. 3. నడుపు.

తే. నిర్వికార వికారాత్ముఁ బార్వతీశుఁ
గలయ నేతెంచెదరు గానఁ గామినులకుఁ
గలుగకుండునె తద్గుణ గౌరవంబు
పతికి సరిగారె హితలైన భాగ్యవతులు. 121

చ. భయ మను తొల్లికర్ విమలభావవసుంధరఁ బెల్లగించి భ
క్తి యనెడు విత్తుఁ బెట్టి వ్రతధీనది స్మృదవారిఁ జల్లఁగా
నయమున నంకురించుచు ననల్ గొనలై యెలమిం జెలంగి త
న్మయముగఁ బ్రాఁకె నంచనఁగ నారులమైపులకంబు లేర్పడెన్.

క. పులకకళికావితానముఁ
దిలకింపఁగఁ దొరఁగు పువ్వుఁదేనియల గతిన్
లలనామణితనులతికా
కలిత ప్రస్వేదవారి కణములు పొడమెన్. 123

క. ఆలతకుఁ గొనలుసాఁగు వి
శాలతకుం బొంత నీరు చాల దను గతిన్
బాలాచపలాంచితదృ
క్ఛీలాంబుద మంబువృష్టి నిలువక కురిసెన్. 124

క. ఆవానఁ దడిసి వడఁకెడు
కైవడిఁ గంపంబు వొడమెఁ గామినులు మహా
దేవుని ముక్తివధూటీ
జీవితనాయకుని సేవ సేయం గదియన్. 125

సీ. తనువు దుర్గతి త్రోవఁ జనకుండఁ గట్టిన
కట్టుల గతిఁ బెండెకట్టు లమర
వెనుకకు నొదిగె యొయ్యనజాఱు ఘనతమో
గ్రంథులగతిఁ గీలుగంటు లమర

రారాదు మీకుఁ గర్మములార నిలుఁ డని
పలికెను గతి జనభాష లెసఁగఁ
దమ యాత్మ చిన్మయాత్మ నుగూడఁబోఁ జేష్ట
లుడిగినగతి మన సూరకుండఁ

తే. పుండరీకభవాండకరండకుహర
బహిరబహిరవహారహాఃపూర్ణ భావనాది
కప్రకాశాంగు నిరుపాధికప్రభావుఁ
గాళహస్తీశు [1]వర్ణింపఁ గదియు నపుడు. 126

క. జ్ఞానప్రసూనకలికయుఁ
దానుం గన్యకల జన్మదైన్యం బుడుపఁగ
బూని యొకదేహమై యొదు
రై నిల్చె శివుండు భాగ్య మదిపో తలఁపన్. 127

వ. అప్పు డప్పరమదంపతుల శిరోభాగంబుల మిన్నేటి నీటం బొరలుపొరలై పొరలుచుం జెరలుతెరలై యురలం బొడముచుఁ దడఁబడ నెగసి తుంపురులైన చినుకులు హత్తి ముత్తియపుసేసల విలాసముఁ జూపె. చూపులకుఁ దదనురూపంబులై యెడమచెఱంగునఁ దెఱఁగొప్పుచున్న కొప్పును నప్పయోదంబున మెఱచి మఱచి పో నెఱుంగని మెఱపునొఱపు కేతకీదళంబున దళం బగు పరిమళంబునం గూడి జడియు పుష్పొడియు నేడువంకవంకసుధాలవంబులుం జెలువంబులై పొదలె; చదలేటి కదలికలం దలఁకెడు నిజకరంబు తుద లేటి వెడలుపాటి చూపుల వెఱపు తమకు సరి యనఁగలపాటి

1. వర్ణింప.

చుట్టటీకంబు వాటించి మానుపు నానుపుఁగొండరాచూలి వాలికచూపు నివాళికలు దనరెః శంకరి నెలవంక నుదటఁ బంకజమిత్రమండలంబు శంక నంకురింపఁజేయు కుంకుమ పంకంబునఁ బెట్టిన వట్రువబొట్టు తనభాగంబున నొక్క భాగం బడంగిన కతంబున సైకత నితంబల కామదురితగహన దహనం బొనర్ప నజు దెలిచిన చులుకుఁగంటిమంటవంటి కెంపున సొంపారెఁ; నీలరోలంబజాల నీలిమయుఁ బాటల జటాజూటపాటలత్వంబును గలసిమెలసి దినసావసానసమయ సంశయంబుల హ్రావయంబుల నుదయంబుగాఁ జేయ భయంబునఁ బ్రియుం బాసి యుషఃయతను ప్రభావిభాకరతనయానభోనదీ సంభేదసముద్భవ విశద కుముదసముదయంబులలో దాఁగిన జక్కవలీల విమల దుకూలంబులో నున్న యున్నత స్తనకలశంబు [1]వొడిఁకిపట్టు నాసపడు కుచికేలు కడకేలుఁదామర యమరెఁ; అభంగురాలింగనంబున నిజాంగనకుఁ బొరఁగు నానందబాష్ప బిందువులు గనుఁగొని తన తొడవు లగు పాముల నిడుదయూరుపులవలన వెడలు విషానలధూమంబులవలనం గావలయునని తదాభరణంబులు సడలింపఁదలంచు శివుని నాలోకించి యొనరించు నగవునం జెలువగు నగజ మొగంబును దనమొగంబును నేలుపలుప రాని సొబగునం గనుపట్టె; వామతను సీమంతినీలలామ యన్నువ నెన్నడుమున కైన గాక యోడుపడి యున్న యన్నెలవున నదుళ మిన్నుం దునుకలు సేయవలయు నని యెత్తిన తెఱంగునఁ

1. దొడగి పట్టు నాసపడు. ము. పా.

గెంగేల గండ్రగొడ్డలి వెలిఁగె; అంగజభంగం బొనరించు చూపునం దుదయంబైన చూపును గంఠనాళ కాలకూట కాలిమయుఁ గంఠసరాంతర పురంపరసీల నీలిమయును బ్రచండతాండవఖండిత బ్రహ్మాండపాదంబును యోగీశ్వరో పాస్య లాస్యరహస్యవిలసితపాదంబును బ్రమోదాపాదకంబు లయ్యె. జననీజనకశరీరంబును విద్యాపురుషసామరస్య సుఖా కారంబును శృంగారశాంతరసమయంబును బ్రత్యక్షభోగ మోక్షప్రదసమయంబును నై యొక్క మహాతేజం బెదురు కట్టఁ గన్నులకు మిఱుమిట్లుగొన నిల్చినం దలంచిన తమ తలం పీడేఱె నని వనిత లవనీతలంబున సాష్టాంగ వందప్రణా మంబు లాచరించి యెదుట నుదుట ముకుళిత కరపుటంబు లిడుకొని మిన్నకున్నఁ గన్నియల కన్నెఱింగి తన్ను నెడఁ బాయక సేవసేయం గాయంబునం సగం బొసంగె నని దాక్షా యణి సిగ్గుపడ సాయుజ్యం బిచ్చి యంతర్హితుం డయ్యె. అయ్యవసరంబునఁ గమలాస్యల రాక యాలస్యం బగుటయు సొమ్ములయొద్దం దలవాకిట నుండు నింటిబిడ్డ లిద్దఱుం దమ లోన. 128

హారకన్యలు ముక్తినందిన వార్త నశరీరి ప్రకటించుట

శా. దేవస్థానములోనికిం జని పురంధ్రీరత్నముల్ రా రదే
మో విశ్వేశ్వరదర్శనానవసరంబో శ్రీమహాదేవ సే
వావాంఛాత్మనో మమ్ము సొమ్మును బహిర్ద్వారంబునం బెట్టి చే
తోవైకల్యము లేక యింతతడ వెందు న్నిల్వ రెట్లో యనన్.

ఉ. స్థానమువారు వారి నొకజాడఁ జలింపకయుండఁ జేయుచున్
లోనికిఁ బోయి పంకరుహలోచనలన్ గుడియెల్లఁ జూచియున్
గానక సంభ్రమంబు పెరుఁగ న్వెఱఁగందఁగ సందియంబు వో
నానతియిచ్చెఁ దత్కథనమంతయు నంబరవాణి గ్రక్కునన్.

క. వారు విని వారలలనా
పారాభవభక్తిమహిమ భక్తులపై గౌ
రీరమణునకుం గలిగిన
కారుణ్యముఁ దెలియ నలవిగా దనుకొనుచున్. 131

క. గుడి వెడలి వచ్చి తమయి
న్నెడకుం జేటికలఁ బిలిచి యింతుల మమతా
జడధీజడధినిమగ్నతఁ
జెడకుండఁగ శివుఁడు మోక్షసిందువుఁ గలిపెన్. 132

మ. శివగేహంబున జ్ఞానపుష్పకలికాసీమంబు విఘ్నేశభై
రవ నారాయణ వాసవుల్ శబరసమ్రాడ్దక్షిణామూర్తి తాం
డవమూర్తి ప్రియధామముల్ వెదకుచోటం జెప్పె నాకా
శవాణి వృషాంకుండు సరోజలోచనలకు న్నిశ్శ్రేయసం
బిచ్చుటల్. 133

ఉ. ఇందున కింక శంకవలదింతయు సత్యము కాళహస్తి బాలేం
దుకళాధరుం గొలువఁ డక్కడ మీరు వసించి మోక్షముం
బొందిన వీరిభక్తిఁ గృతపుణ్య వెలుంగఁ బ్రతిష్ఠసేయుఁ డీ
శుం దలఁకెల్ల మాని యనుచుం జని రంకలు వారు నంతటన్.

క. తమ యేలికసానులపే
ర మహేశ్వరలింగముల నిరంతరభక్తిన్

క్రమమునఁ బ్రతిష్ఠఁ జేసిరి
యమదిక్కైలాసపతిగృహాంగణభూమిన్. 135

ఉ. నావుడు భక్తితో విని మనఃపరిణామముఁ బొంది యాదవ
క్ష్మావరుఁడున్ మహేశునకుఁ జాగిలి మ్రొక్కి మహానుభావ!
నా భావములోన సందియము పాటిలె నొక్కటి దీని నానతీ
వే వివరంబుగాఁ గరుణవేగమ నీ కది విన్నవించెదన్. 136

సీ. సకలవేదామృతజలధి గండూషించి
డప్పి నంగేతువుల్ చప్పిచప్పి
నిగమార్థ ధన మాత్మ జగతి నిక్షేపించి
న్యాయఫలంబులు నమలినమలి
ధర్మశాస్త్రమహౌషధములు నూఱుక త్రావి
బహుళపురాణకూపములు ద్రవ్వి
యోగార్థసాధనలుల్లం బుపాసించి
పరమత గాంగేయ మొరసి చూచి
తే. తపము లొనరించి పుణ్యతీర్థములు దిరిగి
వ్రతములన్నియుఁ జేసినవారు శివుని
నెఱుఁగ రీచెలఁ దీపామునిభము నెఱుకు
లెఱిఁగి పూజించి ముక్తులై రెట్లనంగ. 137

ఉ. జంగమలింగ మంగభవశత్రువు యాదవరాజుచిత్తవీ
థిం గల సంశయం బెడలఁదీర్పఁ దొడంగి చెలంది పాము మా
తంగము చెంచు పుట్టినవిధంబు సదాశివభక్తి తన్మతిం
బొంగిన హేతువున్ విన నపూర్వము లేరికి నంచు నిట్లనున్.

## చెలఁది పూర్వజన్మము వృత్తాంతము

చ. సకలముఁ బద్మసూతి నిజశక్తి రచింపఁగ విశ్వకర్మపు
త్రకుఁడగు నూర్ణనాభుఁడు మదంబున నాతని ధిక్కరించి సృ
ష్టికిఁ బ్రతిసృష్టి సేయ్పన సృజింపఁగఁ గోపమునన్ శపించెఁ గీ
టకత వహింపు మీవు ప్రకటంబగు పేర నటంచు గ్రక్కునన్.

క. ఆయూర్ణనాభుఁ డాతుఁ
డై యేటికి రాకమాను నన్యాయవిధిం
జేయఁ దలంచినఁ జనునె య
పాయం బని పద్మజునకుఁ బ్రణతుం డగుచున్. 140

ఉ. నాయపరాధ మేమియు మనంబున నెన్నక మౌనిమానస
ధ్యేయ కృపావిధేయ తుది దీనికి నెయ్యది? యేవనంబునం
బోయి వసింతు నేఁ బురువుపుట్టువు దీఱెడుదాఁక? నానతీ
వే యని విన్నవింప విని వేధ విధూతవిరోధచిత్తుఁడై. 141

మ. జగదుత్పత్తి విధిప్రధాన ధిషణాసామర్థ్య గర్వంబునం
దగిలెన్ శాపము ముక్తి గల్గెడు శివుం దర్శింప నందాఁక ధా
త్రి గజారణ్యమునందు బిల్వవనవీధీవర్తివై యుండు మా
త్మగుణాపాదితచక్రసంక్రమవినోదక్రీడ లూతాకృతిన్. 142

ఉ. మున్నచట న్వసిష్ఠునకు ముక్తిసుఖంబు ఘటింప లింగమూ
ర్తి న్నిలిచెన్ శివుం; డతనితీరు ఘనాకృతి నుండు భక్తిసం
పన్నుఁడు పూజసేయు నొక భక్తుఁడు నిత్యము వాని నిష్ఠవం
క న్నగజేశుఁ గొల్చి యెఱుకం భజియింతువు గాంతు సౌఖ్య
ముల్. 143

క. శ్రీనామధేయమున గజ
కాననమధ్యమున బిల్వకద్రుమశాఖా
స్థానంబుల నిజగుణపరి
ధానవిధానప్రవీణతం దిరుగు మిలన్. 144

క. ఈజన్మముకంటెను నీ
కాజన్మమె పావనము గజారణ్యములోఁ
దేజోనిధి సర్వేశ్వరుఁ
బూజింపు తదియపదముపొందం గలుగున్. 145

క. విడువు విచారము నీ విఁక
నడవిఁ జరింపంగఁ గలుగు టలిగి [1]పలుపుపైఁ
బడినగతి యయ్యెఁ జను మనఁ
దడయక నావిశ్వకర్మతనయుఁడు ప్రీతిన్. 146

శా. లూతాకీటక మై ద్విదంతవనమాలూరద్రుశాఖాశిఖా
యాతాయాతవిహారజాతనిజగర్భావిర్భవత్తంతుచ
క్రాతిప్రీతి వసింప నంతటను భక్తాగ్రేసరుం డీశ్వరా, ర్చాతా
త్పర్యమునం బ్రసూనఫలపత్రవ్రాతముల్ గోయఁగన్. 147

తే. చెలఁది యుండెడు మారేడుచెట్టుఁ జేరి
దర్పకారాతిపూజావిధానవేళ
తప్పకుండఁగఁ బోవుఁ దాత్పర్య మెసఁగ
సంభ్రమంబునఁ దత్పలాశములఁ గోయ. 148

క. ఆకీటము వేణుశలా
కాకల్పితపుష్పపేటికాపుటి మారే

1. పలుపుపై. ము. పా.

డాకులతోఁగూడఁ బడెఁ
శ్రీకంఠాలోకనంబు సేకుఱుకతనన్. 149

ఉ. ఆతఁడు కేతకీతటినియందు నిజాంగము దోఁచి తత్పరో
ద్ఘాతపమస్తదేహుఁ గలధౌతమహీధరగేహు నర్చనో
పేతునిఁ జేయఁ బిల్వదళపేటికలోఁ బడియున్న లూతయుఁ
జేతికి వచ్చి శంకరునిఁ జేసె విలోకన మంతనుండియున్. 150

వ. నిజజననహేతురూపం బగు జలజభవుశాపంబుఁ దలంచు
కొని యీశ్వరార్చనాజ్ఞానశాశ్వతైశ్వర్యం బవార్యం బగు
టయు నీకు మున్నెఱింగించిన తెఱంగున దక్షిణకైలాస
నివాసుం బూజసేసి సాయుజ్యసామ్రాజ్యంబుఁ గైకొనియె
నింకఁ గాళంబుకథఁ జెప్పెద వినుము. 151

కాళంబు పూర్వజన్మము కథ

సీ. గంధర్వకామినీగానంబు విని తల
లెత్తియాడెడు భుజగేంద్రములును
భుజగఫణారత్నములదీధితులఁ బ్రకా
శించు తమస్సమాశ్లిష్టగుహలు
గుహల ప్రతిధ్వనుల్ ఘుమఘుమ యనఁ బాఱు
నిర్మలోదకముల నిర్ఝరములు
నిర్ఝరతటముల నిరుపాధికసమాధి
యోగనిద్రారతి నుండుమునులు

తే. మునులతపములు నిర్విఘ్నముగ ఫలింప
భక్తిరక్షించుకొనివచ్చు ప్రమథగణముఁ
బ్రమథగణభామినీయుతపార్వతీవి
లాసములుఁ గల్గి దనరు కైలాసనగము. 152

చ. ఫణిపతిహార భావభవ భస్మ సుధాకర భూషితాళికే
క్షణ ధవళప్రభాకలిత సానుచరద్వృషభాధిపుల్ ఖనీల్
ఖనీలున అంకెవేయ కెఱుఁగక్ సమకూడదు చూడ నన్నగా
గణితరుచిప్రసారము జగత్త్రయగాహక మై వెలుంగఁగన్.

చ. ఫలములఁ గాచు నద్రిసుతపాణిశుకంబు వృషంబు కాచు శా
డ్వలములఁ గాచు దంతిముఖవాహన మక్షతరాజిఁ గాచుజో
గులయిలువేల్పు [1]బంటుగమి గోరక బోనము భక్తు లీశ్వరుం
గొలిచిన దాఁకఁ దత్కుధరకూటగళత్తటినీతటంబులన్. 154

క. అనవరతఫలితకుసుమిత
వనఫలరసమధునదీ ప్రవాహంబులు పై
కొని సెలయేఱులఁ [2]గూడుక
మునితతి సంభేదశంక మునుఁగుం బ్రీతిన్. 155

ఉ. పారదరాశి చంచలతఁ బాసి వసించెనొ శైలమై సుధా
నీరధి నిల్చెనో కుముదినీపతికాంతి ఘనీభవించెనో
నా రజతాద్రి ముక్తిలలనామణికేళిసుధాంశుకాంతిరా
జీరచితోరుసౌధగతిఁ జెల్వెసఁగు న్మునిసిద్ధసేవ్య మై. 156

క. శంభుఁ డొకనాఁడు వేడుక
నంభోజభవాండ మందిరాంతర్వీథీ
శుంభన్నివేశకాంతా
స్తంభం బగుచున్న రజతశైలమునందున్. 157

చ. గరుడుఁడు రాజహంసమును గంధగజంబును మేఁకపోఁతు కా
సరము నరుండు నక్రకులచంద్రుఁడు నిట్టియు గుఱ్ఱ మెద్దు ని

1. వాజి మది. ము. పా. 2. గూడఁగ. ము. పా.

ర్జరులవిమానపుల్ మొదటిచావడి ముందర సందడింపఁ శ్రీ
హరి విధి వాసవాదులు నిజావసరాళి వసించి యుండఁగన్.

సీ. తోఁగిలి తూల శార్దూలచర్మముఁ గట్టి
భూతిమైఁ దగ నెఱపూఁతఁ బూసి
క్రొన్నెలవిరి జటాకోటీరమునఁ దాల్చి
బ్రహ్మకపాలహారముఁ బూని
యురగేంద్రు శేషు నుత్తరజందెముగ వేసి
కర్కోటకుని నందెగా నొనర్చి
శ్రవములఁ గంబళాశ్వతరుల ధరియించి
తుంబురుఁ గరకంకణంబు సేసి

తే. వలయుభూషణవితతిగాఁ జిలువకులముఁ
జేయుచోఁ బ్రియవధూమణిఁ బాయునెడరు
తాళఁజాలక పోయి పాతాళసీమ
నున్న కాళంబుఁ గోపించి యుగ్రుఁ డపుడు. 159

తే. కొలువునకు వచ్చి నవరత్నకోటిఘటిత
పీఠికాసీనుఁ డై దైత్యభేదికమల
గర్భముఖ్యులు సేవింపఁ గాళమనుభు
జంగుఁ బిలిపించి యిట్లని శాపమిచ్చె. 160

ఉ వాసుకి శేషముఖ్యఫణివర్గము నిత్యము సేవసేయ భా
మాసురతప్రసంగసుఖమగ్నుఁడవై [1]మముఁ గొల్వవైతి వా
దోసమువంక మేదిని నధోభువనంబున నుండు రాకు కై
లాసముఁజూడ నన్న వికలత్వము నొందుచుఁ గాళనాగమున్.

---

1. నను. ము. పా.

క. నాయవివేకంబున ని
ట్లాయెం గైలాసపర్వతారోహణముం
జేయక మిము సేవాపతి
డాయక నె ట్లుండఁగల పృషం బగు శాల్మిన్. 162

మ. అని దుఃఖించుచు మ్రొక్కి లేవని ద్విజిహ్వాంబు న్వాలోకించి
మోమున మందస్మిత మంకురింప దివిషన్మార్గాభిషిక్తుండు లె
మ్మని నావాక్యము దప్ప దైన డవఁ దారాగం బవాచీనమై
తనరు న్నన్ను భజింపు మందు నవరత్నశ్రేణిచే నిత్యమున్.

తే. కొంత కాలంబునకు నన్నుఁ గొలువ నొక్క
హస్తి చనుదెంచు; దానితో నగువిరోధ
మచట మీకుఁ బరస్పరాహవము గల్గి
చచ్చి మోక్షంబుఁ గాంతువు చనుమనంగ. 164

సీ. తారాచలారోహణారంభమునకుఁ బ్ర
త్యూహరూపములు ప్రయోధనములు
శంకరపదపద్మసంపర్శనాంతరా
యనిధానములు కటాక్షాంచలములు
అభవ సామీప్య నిర్వ్యానంవిఘ్నహే
తువు లవియోగసంతోషలీల
లంగజవిమతాంగ సంగభంగాదికా
రణములు దృఢపరిరంభణములు

తే. గాన నిహపరసౌఖ్యంబు గలుగు టెట్లు
కామినుల వీడ నోపని కాముకులకుఁ
బ్రణయినీమృత్యుయోగంబు ప్రాప్తమైన
హరుని చిత్తంబునకు దూరమైతఁగాదె. 165

వ. అనుచు నపారవిచారంబున మునుంగుచు గజకాననంబుకుం
జనుదెంచి శివలింగార్చనాపరుం డై యుండు నవసరంబున.

—॥ హస్తిపూర్వజన్మకథ ॥—

సీ. అన్యోన్య సరసభాషామృతాధీనతఁ
ప్రణయరోషావహ ప్రార్థనముల
బహువిధాలింగనాభంగురక్రీడల
బింబోష్ఠచుంబనాడంబరముల
బంధసంధానవిభ్రమవిశేషంబులఁ
గేళీపరిశ్రమలాలసములఁ
సరభసరతిఘర్మ జలహారాంబరములఁ
దాంబూలచర్వణాదానములను
తే. గనకసౌధంబులోపలఁ గలసిమెలసి
సేవసేయు వయస్యలఁ జేరనీక
యేకతంబున గౌరీమహేశు లున్న
యవసరంబున మిగుల మదాంధుఁ డగుచు. 167

ఉ. హస్తి యనంగ నొక్క ప్రమథాగ్రణి వాకిటివారిఁ ద్రోచి
చేతస్తనువృత్తియుం బొరఁగి తద్రతిసమ్మదఖేలనక్రియా
వాస్తువు డగ్గఱం గని భవాని శపించె మదించి వచ్చితే
హస్తివి గమ్మటంచుఁ దను నల్కయు సిగ్గును గస్తిఁ బెట్టఁగన్.
క. గజగజవడఁకుచు నాతఁడు
గజచర్మాంబరుని గంధగజగమనపదాం
బుజములకు నెరఁగె భువనై
కజనని! యపరాధి నైతిఁ గావు మటంచున్. 169

క. వెండియు నధికభయంబున
దండనమస్కృతు లొనర్చి దైన్యంబున నో
రెండం బెదవులు దడుపుచు
నొండేమియు ననక మిన్న కున్నం గరుణన్. 170

ఉ. నావచనంబు దప్పదు మనంబున భీతి వహింప నేల త్రే
తావధియందు ముక్తిసుఖ మబ్బ గజాటవిలోన లింగ మై
భావజసంహరుండు ఫణిభాసమున న్వసియించినాఁడు త
త్సేవ యొనర్పు నీకు నొక చిల్వకు నర్చన మచ్చరం బగున్.

క. నీ వాభుజగముచే నీ
చే వాతాశనముఁ జచ్చి శివపదసుఖల
క్ష్మీవరు లయ్యెద రపుగుము
నా వేగమె హస్తి గంధనాగం బగుచున్. 172

శా. మాలూరచ్ఛద నోత్పలాబ్జసితపద్మశ్రేణిభారంబు శుం
డాలగ్నం బొనరించి హస్తి శశిజూటప్రాంతమం దుంచి త
త్కాళన్యస్తమణుల్ పడం దడిచి కేతక్యాపగం గ్రుంకుచుం
గేల న్నీరముఁ దెచ్చి మైవొడసి భక్తిం బూజనల్ సేయఁగన్.

క. ఏ మును చెప్పిన తెఱఁగునఁ
బామునకుఁ గరింద్రమునకుఁ బగరై ఫణిచే
సామజ మహిపతి కరటి
గ్రామణిచేఁ జచ్చి భవము గడతేఱంగన్. 174

క. సామజ మంబర మయ్యెన్
బాము నాభరణమయ్యె ఫణిమదకరులన్
హైమవతీపతికృపచే
నామొదటివిరోధ ముడిగి యభవత్వమునన్. 175

వ. ఇంకఁ గన్నప్ప తెఱంగెఱింగించెదను వినుము. 176

―◆ తిన్నని పూర్వజన్మవృత్తాంతము ◆―

ఉ. ఈశు జగత్త్రయేశు దివిజేశతనూభవుఁ డాత్మ నిల్పి ము
క్త్యాశనుఁ డై సమగ్రనియమాతిశయంబున నింద్రకీలశై
లేశుపయిం దపంబు రచియించె విపక్షకులక్షయార్థమై, పాశు
పతాస్త్రముం బడయఁ బ్రాగ్వరముఖ్యులు చోద్యమందఁగన్.

సీ. జడకొప్పు కేకిపింఛపుఁద్రాటి చుట్టగా
బిసరుహాహితరేఖ పీఁకె గాఁగ
సెగలు చల్లెడు కన్ను జేగుఱుబొట్టుగా
శ్రుతి ఫణి యౌషధ లతిక గాఁగ
మెడను బుర్రలపేరు మేటిలామరలుగాఁ
దోలుదుప్పటి యొడ దోలు గాఁగఁ
జేతిపినాకంబు సెలవింటిబద్దగా
శూల మేర్చిన యంపకోల గాఁగఁ
తే. బ్రమథు లెఱుకులు గా నద్రిరాజతనయ
శబరిగా నాల్గువేదముల్ జాగిలములు
గాఁగ మూకాసురునిఁ బందిగా నొనర్చి
శబరుఁ డై భర్గుఁ డర్జునాశ్రమముఁ జొరఁగ. 178

క. కాకోలాశనకృతమా
యాకోలము సేయఁవోడఁగె నలజడి మునిరా
జీకోలాహల మెసఁగఁగ
నాకోలాంగూలకేతు నాశ్రమభూమిన్. 179

చ. వెఱచిన మౌనిపుంగవులవిహ్వలత న్విడఁ డంచు బాణముల్
తఱగనితూణముల్ ధనువుఁ దాల్చి వరాహముఁ గూడముట్టి
ముం,దఱిఁ జను దెంచి ధూర్జటియుఁ దా నొక యమ్మున దాని
నేసె న,త్తఱి విజయుండు నేసె నొక దారుణ బాణమున్
సముద్ధతిన్. 180

క. ఇరువురు నేసిన బాణము
లిరుబసులును దాఁకి తిరిగె నిరుదెసలకు న
క్కిటి యిరుమొగముల నట్టువ
తిరుపుఁ గొనెను క్రమముతో నతిత్వరిత గతిన్. 131

క. ఖండేందుధరుని శరముం
బాండవమధ్యముని శరముఁ బ్రక్కలు గాఁడన్
రెండుతల లనఁగఁ దిరిగెం
జండగతిం బంది గఱచి శరములు దివియన్. 182

క. హరుఁడు నరుండును గిరి బిరు
దని కొనియాడి చేర నరుదేరఁగఁ ద
చ్ఛరముల నవియు న్మృత్తమై
ధరణిపయిం బడియెఁ బర్వతంబును బోలెన్. 183

క. ఏ మున్నేసితి ననుచుం
దా మున్నేసితి ననంచుఁ దమలోఁ గిటు కై
భీముఁడు భీమానుజుఁడును
భీమాహవకేళి సల్పి పేర్చిరి కిటి కై. 184

ఉ. సూనశరారియు న్నముచిసూదనపుత్త్రుఁడు దివ్యబాణసం
ధానమున న్మహాహవము దర్ప మెలర్ప నొనర్ప నొప్పి రిం

త్తైనఁ గొలంతలేక తమయందలి తేజము మిన్నుముట్టఁగా
భానుఁడు భానుఁడుం జటులభానుపరంపరఁ బోరుకై వడిన్.

ఉ. చెం చనుచుణ్ ధనంజయుఁడు చీరికిఁ గైకొన కేయుచుం బ్ర
తాపించి రణం బొనర్పఁ బురభేదికిఁ గోపము పుట్టి వీఁడు న
న్నించుక యేనియుం దెలియఁడి త్తఱి నూరకయున్న నీతి గా
దంచు మహేంద్రజాలకునియ ట్లొకమాయ రచింపఁ బూను
చున్. 186

ఉ. అక్షయతూణమందు నొక యంబకమైనను లేకపోవున
ట్లాక్షణమాత్రఁ జేయ మది నద్భుత మందియు ధీరుఁడై సహ
స్రాక్షసుతుండు మోఁదె విశిఖాసన మత్తఱి నెక్కుడించి ఫా
లాక్షునిమౌళిఁ బాటలజటావలి వీడఁగ శేషుఁ దూడఁగన్.

క. బేడిద మగు నాదెబ్బకు
నోడక వి ల్లెక్కుడించి యుగ్రుఁడు వైచెణ్
గ్రీడించువేడ్క ననిలోఁ
గ్రీడించుక వెగడుపడఁ బరిస్ఫుటశక్తిన్. 188

శా. కోదండంబుల నిట్టు లొండొరుజటాకోటీరముల్ గుత్తివ
క్షోదేశంబుల నంసభాగముల సక్రోధంబున న్వ్రేయుచుణ్
రోదోంతంబున నట్టహాసములు నార్పుల్ పిక్కటిల్లంగ బా
హాదర్పంబున మల్లసంగరము సేయం జొచ్చి రుగ్రార్జునుల్.

ఆ. మల్లచఱచికొనుచు మహి పాదఘట్టనఁ
దల్లడిలఁగఁ జేసి తనువు లించు
కించుకంత వంచి యిరువురుఁ దొడ లప్ప
ళించి వెదకి తెలపి లేమిఁ జేసి. 190

సీ. చెయ్యిచ్చి యొకకొంతసేపు నేర్పున బల్మి
యినుమడింపఁగఁ జోరనీక మలసి
యొకతెఱంగునఁ జొచ్చి యొండొంటఁ గాసెలు
దొడికిపట్టుక కొంతతడవు పోరి
యది మాని కొంతప్రొద్దవని చూఁదిన కాళ్లు
పెకలించి పడవైవఁ బెనఁగి పెనఁగి
మఱికొంతవడి మెడవిఱిచియ భుజమ్ములఁ
జిక్కించి యుక్కున నొక్కి నొక్కి
తే. నడుముల నొడిసి కబళించి పుడమిమీఁద
సమముగా వ్రాలి బలపరాక్రమము లెసఁగ
హెచ్చుఁ గుం దేమియును లేక యీశ్వరుండు
హరిహయసుతుండు మల్లసంగర మొనర్చ. 191

మ. మదమాతంగము సింధురార్భకముతో మార్కొంచుఁ జెల్లా
డు పెం,పుదయింపఁ బ్రలయకాలతాండవకరుం డుప్పొంగి
గాండీవితోఁ, గదనం బిట్లొనరింప నాతఁడు భుజాగర్వంబు
మాత్సర్యము, న్వదలం జాలమిఁ జూచి మెచ్చి శివుఁ డంతన్
దివ్యతేజంబుతోన్. 192

శా. వైకుంఠ ద్రుహిణాదిదేవతలు గొల్వన్ వామసీమావరో
ధాకారుం డయి నాగచర్మవసనుం డై చంద్రరేఖాధరుం
డై కాకోదరభూషణుం డయి పళత్తూనంగభస్మాంగుఁ డై
లోకవ్యాపకపాండుదీధితికరాళుం డై వృషారూఢుఁ డై.

క. ప్రత్యక్ష మగుచు సకలా
దిత్యులు జయజయ యనంగ దేవేంద్రసుతున్

గాత్యాయనీమనోహరుఁ
డత్యాదరమున నభీష్ట మొసఁగు మటన్నన్. 194

శా. ఆనందమ్మునఁ బాండునందనుఁడు సాష్టాంగప్రణామంబు లె
న్నైనం జేసి యెడ ల్వాడంకఁగ మదీయాజ్ఞానజాతాపరా
ధానీకంబున కోర్చి శత్రుదహనం బార్పం బ్రభాసారథా
రానిర్యత్ప్రళయాభ్రపాశుపతమంత్రశ్రేష్ఠ మీవే దయన్.

క. ఇదిగాక ముక్తిరమణీ
హృదయేశత్వము వహింప నీవలయును భ
క్తదురాశాపాశలవి
త్ర! దయావీక్షణ! ప్రసన్నతామతి ననుడున్. 196

సీ. పాశుపతాస్త్రోపదేశంబు సేసెదఁ
బరులఁ గెల్వుము ప్రతాపంబు మీఱ
సాయుజ్య సామ్రాజ్యసౌఖ్యమీజన్మంబు
నందు నందవు బంధుహననమునకుఁ
గాంక్షఁ జేసితి గానఁ గలియుగంబున మృగ
హంత వై పుట్టి శైలాటవులకు
నాఖేటకార్థమై యరిగి యస్మద్రూప
మగుదివ్యలింగంబు నచటఁ గాంచి

తే. దేహమోహంబు విడిచి సందేహ ముడిగి
భక్తి భజియించి కామితపదముఁ గాంతు
వనుచు సర్వేశ్వరుఁ డనుగ్రహమ్ము సేయ
ఫల్గునుఁడు తిన్నఁ డై పుట్టి పడసె ముక్తి. 197

వ. అని తత్కథావృత్తాంతం బంతయు మాయాజంగమాకారుం
డైన జగజ్జననీజనక శరీరుండు వీరనృసింహయాదవమేదినీ
కాంతున కానతిచ్చి కృతార్థుండ వయ్యెద వమ్మహాదేవుని
నివాసంబుఁ గట్టింపు మనుచు నంతర్హితుం డయ్యె సంతట.

ఉ. ఎంతయుఁ జోద్యమంది ధరణీశ్వరుఁ డీశ్వరుఁ బొందఁ గాం
చె నే,డెంత గృతార్థు రా ఓది నిజేచ్ఛ విహారము లానతిచ్చె
నే,నెంత కృతార్థుఁడఁ జనన మెంత కృతార్థతఁ బొందెఁ బట్ట
నం,బెంత కృతార్థతం బొరసె నే మని చెప్ప మదీయ భాగ్య
ముల్. 199

వ. అని యత్యంత సంతోషితస్వాంతుండై. 200

ఉ. అంగన నాదరించి వసుధాధిపుఁ డాక్షణమాత్రలోఁ బుర
ప్రాంగణభూమి సాహిణి రయంబునఁ బల్లనకట్టఁ బట్టసా
రంగజవంబుఁ గల్గిన తురంగము నెక్కి కదల్చి కాళహ
స్తిం గదియంగ వచ్చి డిగి చిద్వనధి న్మొగలెటఁ గ్రుంకుచున్.

లయగ్రాహి. మాకహరు శైలతనయారమణు
నంతకది శారజతపర్వతవిహారముదితాత్ము
మేరుధరకార్ముకు సరోరుహదృగంబకు
ధరారథు సరోజభవసారథిఁ బురారిన్
సారసహితేందుధరణీరసహుతాశన
సమీరఖమఖేశ్వరశరీరుఁ బరమేశున్
జేరి భజియించుచు దుషారగిరిపుత్రిఁ
బరివారసురలం గొలిచి గోరిక దలిర్పన్. 202

సీ. దక్షిణకైలాస దరహేమముఖరిన
భోనసేమద్యమ భూమియందుఁ
దిను కాళహస్తీశుఁ దినగు వాఱంగ
జలాంతశిలాంతపర్యంతముగను
నేల త్రవ్వించి యన్నెలవుననుండియు
రసవర్గమిళితచూర్ణంబుతోడ
నిటికల శిలల సందికుండ బంధించి
యామీఁద హిమగిరిజాఖువాహ
తే. చండగుహభైరవాదుల సదనములును
గోపురావర్ణ వర్తనకూటములను
భక్తిఁ గట్టించి యమ్మహీపాలవరుఁడు
ధరణి నేలుచునుండె శంకరునికరుణ. 203

శా. సీవాంగాగ్రరేఖాంశ చిద్రసమయానీవారముష్టింపచా
త్మా వాసస్థితదేవ షట్పమయనాథా రూఢభేదప్రతి
ష్ఠావష్టంభవిజృంభితాననవికార్యద్వాక్కవాటా మహా
దేవా జన్మజరావిపల్లయవశాదిక్లేశసంహారకా. 204

క. బంధత్రయనాశక భవ
బంధావికబంధరాశి బంధనవిద్యా
బంధుర! సమస్తభూత
స్కంధావారేశ భక్తకల్పమహీజా. 205

పంచచామరము. వటక్షమాజవాస ! ఖేదవాదిగఖండితా
జటాకుటీవిటంకలగ్నచంద్రఖండమండితా
కటీపటీభవద్దిగంత కాలకూటఘస్మరా
నటత్కృపీటభూశిఖాపినద్ధదృగ్జితస్మరా. 206

గద్యము. ఇది శ్రీమత్కాళహస్తీశ్వర చరణకమల సేవాపరా
యణ సింగమరమానారాయణ జక్కయ నారాయణ
తనూభవ భవపరాఙ్ముఖ ధూర్జటి ప్రణీతం బైన
శ్రీకాళహస్తి మాహాత్మ్యం బను
మహాప్రబంధంబునందు సర్వంబును
జతుర్థాశ్వాసము
సంపూర్ణము.

# శ్రీకాళహస్తి మాహాత్మ్యము

## లఘుటీక

సాలెపురుగు (శ్రీ), పాము (కాళము), ఏనుఁగు (హస్తి) అనునవి మూఁడును ముక్తినొందిన క్షేత్రము శ్రీకాళహస్తి; ఆక్షేత్రముప్రాశస్త్యమును వెల్లడిపఱచు గ్రంథ మగుటచే దీనికి 'శ్రీకాళహస్తిమాహాత్మ్యము' అను పేరు కలిగినది.

## ప్రథమాశ్వాసము

1. చెప్పెన్ = ప్రకాశించి; వసిష్ఠాజ...యాదవాధిపులకున్-అజ = బ్రహ్మ; లూతా = సాలెపురుగు; వాతాశన = పాము; సామజ = ఏనుఁగు; ఆటవిక = వేఁటకాఁడు - తిన్నఁడు; గోత్రాదేవ=బ్రాహ్మణుఁడైన; నత్కీర = నత్కీరుఁడు; రాజీవాక్షీయుగ = ఇరువురు (వార) వనితలు; యాదవాధిపులకున్=యాదవరాజగు వీరనృసింహరాయలు అను, వీరి కందఱకును. ఆర్యా వామాంగము = ఎడమభాగము పార్వతీదేవిగా కలది; సల్పెదున్ = నెఱ చేర్చునుగాక!

2. హిమ...ప్రసూన - హిమధరాధరమండలేశ్వర=హిమవంత మను కొండలరాజుయొక్క; కులపాలికామణి = ఉత్తమకులస్త్రీ యైన మేనక యొక్క; తనువల్లికాప్రసూన=దేహ మను తీఁగనుండి పుట్టిన పుష్పమయినది; (ఇది 'జ్ఞానప్రసూనకలిక'కు విశేషణము.) అసిత...లహరి - అసితకంధర = నీలకంఠుఁడగు శివునియొక్క; సింధురాజనాంబర = వస్త్రముగా నున్న గజ చర్మముయొక్క; ఘోరగంధ = దుర్గంధమును; బాధనకర = నిర్బంధించు - పోఁగొట్టు; గంధలహరి = పరిమళప్రవాహమైనది (ఇదియు 'జ్ఞానప్రసూన కలిక' విశేషణము.) సంతత...ధార - సంతతశివభక్తిసామరస్యజ్ఞాన = ఎల్ల

పుడును ఉండు శివభక్త్యనుభవజ్ఞానముయొక్క; సార = సార మను; మరంద నిష్యందధార = అమృతప్రవాహధారయైనది (ఇదియు 'జ్ఞానప్రసూనకలిక' విశేషణము.) పరమ... కేళి - పరమహంసోత్తంస = గొప్పయోగులయొక్క; భావ = మనస్సు లనెడి; భృంగవ్రాత = తుమ్మెదల గుంపునకు; తన్మయావస్థ ప్రదానకేళి = తన్మయావస్థ నొసంగు విలాస మయినది; (ఇదియు 'జ్ఞాన ప్రసూనకలిక' విశేషణము.) నిఖిల... పేటి - నిఖిల = సమస్తమైన; విద్యా= విద్యలయొక్క; రహస్యవాణీ = తత్త్వవాక్యము లనెడు; పరాగపాలికా= పుప్పొడిసమూహముచే; పూరిత = నింపఁబడిన; అఖండపద్మజాండపేటి = గొప్పదైన బ్రహ్మాండ మగుపెట్టె యైనది; చంద్రార్ధజూటకోటిజోటి = జడ యందు నెలవంక కల శివునకు భార్య యైనది; జ్ఞానప్రసూనకలిక = జ్ఞాన ప్రసూనాంబాదేవి. ఈసీసపద్యపు మొదటిపాదమున జ్ఞానప్రసూనాంబ యనెడుపుష్పము జన్మకారణము, రెండవ పాదమున దాని పరిమళము, మూఁడవ పాదమున అందలి మధువు, నాల్గవ పాదమున పుష్పమునందలి మధుకరములు, గీతమునందుఁ బుప్పొడియుం పర్ణితములు. అలం. సావయవ రూపకము. హిమవత్పర్వతము మండలాధిపతి యనుటచే పార్వతితండ్రి చల్లనిప్రభు వనియు, 'కులపాలిక' యనుటచే తల్లి శీలసంపన్న యనియు, పార్వతి 'వల్లి' యనుటచే సుకుమారియు, సుందరియు ననియు స్ఫురించు చున్నది. ఇతరపాదములఁబట్టి యామె పద్మినీజాతివనిత యనియు, జ్ఞాన ప్రదాయిని యనియు, మోక్షదాయిని యనియు, సమస్తవిద్యారహస్యములను వెల్లడించున దనియు తెలియుచున్నది.

3. వ్యాకీర్ణస్థితిలో = కలఁతపాటుచే బెదరినస్థితిలో; నకులి వారా హులు = ముంగిసయు పందియు; ఊటాడఁగా = చెదరిపాఱఁగా; భౌకా రాక్షగ న ద్ర్వర్ణముల కాద్యంబైన వర్ణంబు = 'భా' అను నక్షరము; ఏక గ్రీవము చేసి = సరియగునట్లు; తురంగేంద్రంబు = వాహనము - కుక్క;

లీలాహార్యలీలాలయున్ = విలాసపర్వతము, విలాసార్థ మగు నివాసముగాఁ గలవానిని.

4. కాసరా...పంకంబు = మహిషాసురుని కంఠమునుండి కారిన గడ్డకట్టిన నెత్తురు; శ్రీపాదపద్మలాక్ష = పాదములకుఁ బూసికొనిన లత్తుక; [దుర్గాదేవి మహిషాసురుని బడవైచి, మెడను త్రొక్కి, తలను ఖండింపఁగా, ఆమెపాదముల కంటిన నెత్తురు పారాణివలెఁ బ్రకాశించుచున్న దనుట.] చండ...రాజి - చండ = భయంకరమైన; ముండాహవ = ముండాసురుని తోడి యుద్ధమున; సంభ్రమ = తొట్రుపాటువలన; స్తనజాత = స్తనముల నుండి కలుగు; ఘర్మవారికణరాజి = చెమటనీరు; రక్త...హాసము = రక్త బీజుఁడు మున్నగువారిని మర్దించు సమయమునఁ జేసిన వికటపునవ్వు; లోధ్ర సుమరజంబు = మోమునకుఁ బూసికొను నెఱ్ఱనిపుప్పొడి; రక్షోవీరసంహార వేళన్ = రాక్షసవీరులను సంహరించుసమయమున; కనక...గేహాన్ - కనక ముఖరీసమాఖ్యా = సువర్ణముఖరి యను పేరు గల; గంగాప్రతీర = నదీతీర మందలి; హాటకాచల = సువర్ణపర్వతముయొక్క; తుంగశృంగాగ్రగేహాన్ = ఉన్నతశిఖరాగ్రము నివాసముగాఁ గలదానిని. దర్గ కాసరాసురుని ఖండిం పగా ఆనెత్తు రామెపాదములకుఁ దగిలి లత్తుకవలె నున్న దనియు, స్తనము లపైనుండి జారు చెమటబిందువులు ముత్యాలసరమువలె నున్న వనియు, వికటాట్టహాసపుకాంతి ముఖమునకుఁ బూసికొను ఎఱ్ఱని పుప్పొడివలె నున్న దనియు, దుమ్ము మేలిముసుగువలె నున్న దనియు యుద్ధశృంగారములు రెండును వర్ణితములగుటచే నామె వీర, శృంగారమూర్తి యగుచున్న దనియుం గ్రహింప నగును.

5. సర్గస్థిత్యపహారకర్మ నవదీక్షావేళన్ = సృష్టిస్థితిసంహారములను తమతమ కర్మలకొఱకు క్రొత్తగా దీక్షను గ్రహించు సమయమున, బ్రహ్మ స్వభూభర్గుల్ = బ్రహ్మ విష్ణు మహేశ్వరులు; సంస్మరణమాత్రన్ = తలఁ

చినమాత్రాన; దృఙ్నిర్గచ్ఛత్కరుణాకదంబుక్ = చూపులవలననే బయలు వెడలు దయాపరంపర కలవానిని; హేరంబునిక్ = వినాయకుని.

6. సమారాధనము = పూజ.

7. వాగర్థంబులు = శబ్దార్థములు; జగద్వంద్యుండు = లోక పూజ్యుఁడు; మత్...ర్థుండు = నా ప్రబంధమునకు సాటిలేని నాయకుఁడుగా నుండఁదగినవాఁడు; చేతోగమ్యుండు = ధ్యానగమ్యుఁడు; సమర్థించితిక్ = నిశ్చయించితిని.

8. మహాదేశికసార్వభౌముండు = గొప్పవాఁ డగు నాచార్యుఁడు; నవ్య...స్థితిక్ = క్రొత్తపద్ధతిలో వివిధమార్గముల రసము చిప్పిలునట్లు.

9. అనుపమకరుణావనధి = సాటిలేని దయాసముద్రుఁడు; వర... హంసముక్=ఉత్తమమునుల మనస్సు లనెడు కమలములకు రాజహంస యైన వానిని.

10. భూతవ్రజంబు = ప్రాణిసమూహము; కమలజాత, శ్రీధరుల్ = బ్రహ్మ, విష్ణులు.

11. అఖిలప్రపంచ భిన్నాభిన్నజ్యోతికిని = సమస్తప్రపంచమునకును భిన్నమును, నభిన్నము నగు వెలుఁగయినవానికి; నాద...శునకుక్=దీర్ఘ మగు నాదధ్వనియొక్కయు, బిందుసంబంధ మగు ధ్వనియొక్కయు కళ కతీతుఁ డగు పరమేశ్వరునికి.

12. బహుముఖ...పరిపూర్ణునకుక్ - బహుముఖ=అనేకముఖముల ప్రవహించు; సువర్ణముఖరీలహరీ = సువర్ణముఖరీనదీప్రవాహముల చేతను; శీతల = చల్లనైన; శిలాతలస్థిత = ఱాళ్ళపయిఁగూరుచున్న; ముని = మునుల యొక్క; హృద్బహిర్బహిఃపరిపూర్ణునకుక్ = మనస్సుల లోభాగమునకు బయటను నిండియున్నవానికి; అహరహరుదితునకుక్ = దినదినమును వృద్ధిపొందు (పెరుగుచున్న) వానికి.

13. పంచేంద్రియ...మునకున్ = పంచేంద్రియములు అను మదించిన ఏనుఁగులకు కొదమసింగమైనవానిని; భవ...కోటికిన్ = సంసారమను సర్పమునకు గరుడుని ముక్కుచివరిభాగ మైనవానికి; సదయదృగంచలనటనకున్ = దయతో కూడిన క్రీఁగంటిచూపు ప్రసరింపఁజేయువానికి.

14. జ్ఞాన...భృంగమునకున్ = జ్ఞానప్రసూనాంబాదేవియొక్క గబ్బిగుబ్బలను పూలగుత్తు లకు మదించిన తుమ్మెదయైనవానికి; సంధ్యా... హంసునకున్ = సంధ్యాసమయములందు నాట్యము అను విహారముచేయు మహానటుఁడగువానికి.

15. సతత...తునకున్ - సతత = ఎల్లప్పుడును; త్రైగుణ్యావశ = సత్త్వరజస్తమోగుణములకు లొంగిన; అచ్యుత = విష్ణుసంబంధమైన; కేళి జగన్ముహుర్ముహుర్నిర్మాణస్థితి = విలాసార్థముగ మాటిమాటికిని నిర్మింపఁబడిన లోకముల సృష్టిస్థితులయొక్క; భంజనకర్మఠునకున్ = నశింపఁజేయుం కర్మయెడ దీక్ష గలవానికి; హతభవపాశునకున్ = నశింపఁజేయఁబడిన సంసారబంధము కలవానికి.

17. సంసార...కీల = సంసారమను పాదరసమును నశింపఁజేయు నగ్నిజ్వాల; కలుష...గంధకంబు = పాపసమూహ మగు తామ్ర(రాగి)మునకు గంధకమయినది (గంధకము రాగిని భస్మమొనరించును); కామ...కుద్దాలంబు = కామ మను తీఁగయొక్క దుంపలకు (త్రవ్వి పాఱవేయు) గునపము; సంకల్ప...ముఖము = కోరిక లను రాళ్లకు (పగులగొట్టునట్టి) ఉలి కొనయైనది; రాగ...కడంగరీయంబు = అభిమాన మను వరిపంటకు (దానిని మేయు) ఎద్దు; శంకా...నకులి = సందేహ మను పామునకు ముంగిసయైనది; నవ...రజ్జువు = మన స్సను కొదమయెద్దునకు ముకుఁద్రాడు; కోప...కోపలంబు = కోపపుఁజూ పను బాణమునకు డాయి; దివ్య...నివాసము - దివ్య దేశికహంస = గొప్ప గురువులచేతను, మునులచేతను; ఉపదిష్టమార్గ = ఉప

దేశింపఁబడిన పద్ధతిని; నిర్గుణధ్యాన = నిర్గుణ (స్వరూపరహితమగు) పరమాత్మనుగూర్చిన ధ్యానముయొక్క; సంధాన = సంధానముచేత; నిరుపమాన సౌఖ్య = సాటిలేని సౌఖ్యముచే; సంపన్న = సంపన్నులయిన (కూడిన); సాధకజననివాసము = యోగసాధనచేయు జనులకు నివాసమైనది; అమృత లింగాకరము = అమృతమయలింగములకు గనియైనది.

18. అడన్ = అక్కడ; వాడవాడన్ = ప్రతివీధియందు; ఘన... ద్యుతుల్ = గొప్పవైన గోడలమీఁది బంగారముయొక్కయు, రత్నములయొక్కయు కాంతులు; షణ్ముఖీకరణతేజోగూఢి = ఆఱు ముఖములు కనఁబడునట్లుగా నుండు గొప్పతేజస్సునను కుమారస్వామిగా నొనరించు రీతిని; చిత్తే...వార్ధిన్ = మనోనేత్రమున కగోచరమగు రీతి నున్న ఆనందరస సముద్రమునందు; తత్పట్టనక్రోడక్షోణి=ఆయూరి నడిమి నేల; కొండాట= పొగడ్త.

19. అతులై...విలసితంబు = సమస్త సంపత్సమూహముతోను, ఒప్పుచున్నది; చంద్రకాంతరచితప్రాకారము = చలువఱాళ్లతోఁ గట్టఁబడిన చుట్టుగోడ; అద్భుత...స్థితిన్ - అద్భుత = ఆశ్చర్యము; మాయా, బహువిభ్రమ = బహువిధములగు మాయావిలాసములు; భ్రమిత = భ్రాంతి గొనిన; వస్తువ్రాతలోకోదయస్థితిన్ = వస్తుసమూహముయొక్క యభ్యుదయ స్థితిని; లోఁగొన్న = లోపలికిఁ దీసికొనిన; అలం. ఉత్ప్రేక్ష.

20. జనలోకోన్నతము = భూలోకమున గొప్పది; తూ, చా తప్ప కుండంగన్ = కొంచెమైనను విడువకుండ; దుర్వాసన్ పాసి = పాపమయమైన జన్మాంతరవాసనను విడిచి.

21. ఎలఁదోఁటల్ = ఉద్యానములు; వనముల్ = తపోవనములు; వాతెరలు = పెదవులు; అంగజాగమకళాబంధంబులు = కామశాస్త్రము నందలి బంధరతులు; ఇచ్ఛాసనంబులు = స్వేచ్ఛయైన ఆసనబంధములు; కైవల్యము = మోక్షము.

22. అపవర్గరమాసతి = మోక్షలక్ష్మి; హ స్తిమశకాంతరము=ఏనుఁగు నకును-దోమకును గల భేదము.

23. ఈ సీసపద్యపాదములు నాలుగింటను క్రమముగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు వర్ణింపఁబడిరి; వారందఱును రాజయోగు లనియు వర్ణితము. నైజంబులు = స్వాభావికములు; నిత్య, నైమిత్తికంబులు= సంధ్యా, జపాదులు, వ్రతాదులును; [రాజయోగులును తా మేమి యొనర్చి నను స్వార్థ మెంచక, బ్రహ్మార్పణ మొనర్తురు; బ్రాహ్మణులును తమ విధుల నొనర్చి 'తత్సత్ బ్రహ్మార్పణమస్తు' అనియే అందురు]; శాంతనవస్ఫూర్తిన్= క్షత్రియుఁడగు భీష్మునిరీతి; వైరివర్గంబు = శత్రువులు, కామక్రోధాదులగు అంతశ్శత్రువులు; [శత్రుసంహారము రాజులకు ధర్మము]; ప్రబల...స్థితి - ప్రబల = బలముగల; మహార్ఘ = గొప్పసంపదయొక్క; ప్రభా = కాంతిచే; అసమానస్థితి = సాటిలేనిరీతి అని వైశ్యపక్షము; గొప్ప నివృత్తియొక్క కాంతిచే సమానమైన పదవి యని రాజయోగిపక్షము; కోశంబు లుండెడు కొలఁదులు = ధనాగారము లుండెడు చోట్లు [వైశ్యపరము]; అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయము లను పంచకోశ లున్న తావు లని రాజయోగిపక్షము; సమముగాన్=భేదము లేక ద్వంద్వా తీతులయి; ఆత్మప్రయత్నంబులందున్ = తమ వ్యవసాయమునం దని శూద్ర పక్షము; ఆత్మ విచారమునం దని రాజయోగిపక్షము. శూద్రులును రాజ యోగులవలెనే ఎండను, చలిని, గాలిని లక్ష్యపెట్ట రని భావము. అలం. క్రమము.

24. ఆనగరమునందలి వారకాంతలు యోగులను పోలుదు రని యీ పద్యమునఁ జెప్పఁబడుచున్నది. పరిచితబంధనైపుణిన్ = బాగుగా నెఱిఁగిన బంధముల నేర్పుచేతను - [యోగిపక్షమున ఆధారబంధము, ఉడ్డీనబంధము, జాలంధరము మున్నగు బంధములును, వారవనితలపక్షమున కామశాస్త్ర

ప్రసిద్ధములైన భ్రమణ, చక్రబంధాదులును గ్రాహ్యములు.]; అపారకళానుభవప్రసక్తిః = సాటిలేని కళల ననుభవించుటను—యోగిపక్షమున యోగకళలను, కామినిపక్షమున కళాస్థానములను గ్రహింప నగును. నాదరసవివేకసంపదః = (యోగిపక్షమున) నాద, బిందు ధ్వనిసంపదను, (వారకాంతా పక్షమున) వీణాదివాద్యధ్వనిసంపదను; సదా, శుకవాక్యరసానుభూతిః = (యోగి ప.) ఎల్లప్పుడును శుకయోగి సిద్ధాంతమునందలి రసానుభవమును, (వారకాంతా ప.) చిలుక పలుకులవంటి ముఖప్రీతికరములగు మాటల మాధుర్యపు టనుభవమును; మోహరహితవృత్తిః=(యోగి ప.) అజ్ఞానము లేని రీతిని, (వేశ్యా ప.) మోహరమునందు (మొగ్గరమున) హితమగు వ్యాపారమునను; ప్రస్ఫురత్ = బాగుగ ప్రకాశించు; అనంగరహస్యవిచారబుద్ధిః=(యో. ప.) బహుశాఖలు లేక ఏకమార్గమున నుండు తత్త్వవిచారమునను (వేశ్యా ప.), మన్మథశాస్త్ర విచారణయెడఁ గల బుద్ధిచేతను. అలం. శ్లిష్టోపమ.

25. ఆయూరిలోని మదవుటేనుఁగు లవధూతలను బోలుచుండు నని యిందు చెప్పఁబడినది. ఏనుఁగులు క్రీఁగంటఁజూచుచు, మెల్లఁగా నడచుచు, అహంకారము కల్గి, మావటీనిచే బుజ్జగింపఁబడి యాహారమును గ్రహించుచు, కట్టువిడిచినచో జనులకు భయముకల్గించుచు. మదమెక్కి, గొప్ప బలముకల్గి, పద్మములను నలిపివేయుచు నుండును; అవధూతలకు నీ విశేషణములు వర్తించును. ఆపక్షమున—అరగంటం గనుగొంట = ముక్కుకొనను దృష్టిని నిలుపుట; మందగతి = మెల్లని నడక; [యోగులు ప్రాణశక్తిని కోలుపోకుండుటకయి మెల్లఁగా నడచెదరు.] పూర్ణాహంకృతి = పూజ్యమైన (నశించిన) అహంకారము; ప్రార్థనా కర భుక్తిస్థితి = ప్రార్థించి, కరతలభిక్షను గ్రహించుట; ముక్తలోకభయశంకావృత్తి = జనమును, భయసందేహములను విడిచి యుండుట; ఉన్మత్తనవ్యరతి = పిచ్చివానివలెఁ గనఁబడుటలో ఆసక్తి; సత్త్వసమగ్రత = పూర్తి యగు సాత్త్వికగుణము; మృదిత పద్మాభ్యున్నతి =

మర్దింపఁ (తిరస్కరింపఁ) బడిన సంపదభివృద్ధి; గంధమంధరదంతావళకోటి = మదముచే అలసములైన యేనుఁగుల గుంపు; అలం. శ్లిష్టోపమ.

26. తేజులు = గుఱ్ఱములు; సిబ్బితిఁబో = సిగ్గుచేతనే కాఁబోలు; చాపలవిరహితసౌఖ్యంబు = చాపల్యమును విడుచుటచేఁ గల్గు సుఖము.

28. ఇందు పాలకుఁ డగు రాజునకును శివునకును నభేదము చూపఁ బడినది; శక్తిత్రయంబు = (రాజపక్షమున) ప్రభు, మంత్రోత్సాహశక్తులు, (శివునిపక్షమున) జ్ఞాన, బల, క్రియాశక్తులు. రాజశేఖరుండు = గొప్ప రాజు, చంద్రమౌళి యగు శివుఁడును; కమఠ...భారవహులకున్ - కమఠ = ఆదికూర్మము; శఠకిటిపరివృఢ = మాయావరాహ రాజు; కరటి = దిగ్గజ ములు; కుధర = పర్వతములు; విషధరాధీశ = ఆదిశేషుఁడు; భారవహుల కున్ = భూభారమును మోయువారికి; ప్రాణంబు ప్రాణము = ప్రాణములను రక్షించువాఁ డనుట; అలం. శ్లిష్టరూపకము.

30. అడుగుఁదమ్ములు = పాదపద్మములు; అపరంజి పావలు = బంగరుపాదుకలు; కేదారకంకణంబు = పంచలోహముల కడియము; బంగారు...గోణాము = బంగారు సరిగంచుగోచి; గళము = కంఠము; భసితభస్త్రిక = బూడిదసంచి; సంది = సందిట; తరుణేందుధరుఁడు = బాల చంద్రుఁడు; మాణిక్యరుచులు = మణులకాంతులు; తృణముగాఁ జూచు = లెక్కచేయని - సరిపోలు.

32. తాల్మి దూలని = ధైర్యముచెడని; శంపాలలితాంగి = మెఱపు వలె నందమైన దేహము కల వనిత.

33. పుర......లతిక - పురపల్లవప్రకర = పట్టణములోని విటుల గుంపుయొక్క; నేత్ర = కన్నులకు; ఆనందబాష్పాంబుధారా = ఆనంద బాష్పములను వర్షధారలకు; వర్షాగమ = వానకాలమునకు; చంచలాలతిక = మెఱుపుతీఁగ; దుర్వార...సామిధేని - దుర్వార = వారింపరాని; ప్రసూ

నాస్త్రతేజోవైశ్వానర = మన్మథతేజస్సను అగ్నికి; సామిధేని = సమిధ; రశనా...కపర్దిని - రశనాసూత్ర = మొలనూలియందలి; స్వర్ణపేటీ = బంగారుపెట్టెయందు; విన్యస్త = ఉంచఁబడిన; కపర్దిని = శివుఁడు (శివలింగము) కలది.

34. వికారము = వేషము; ప్రపదములు = గొప్ప పాదములు; తన్మృదుల...భూతి = అతని మృదువైన పాణి పద్మముచే నీయఁబడిన విభూతి.

35. బిజమాడు = విజయంచేయుఁడు; దేవరు = దేవరవారు; బిడార = విడిసి - బసయిల్లు; నడలింగమూర్తి = చరలింగము; మూర్త మాడి = క్షణము విశ్రమించి; ఒడయ = ప్రభూ! చిత్తేశ = మనోనాయకా! మాడబేకు = చేయవలెను; ఆవటెంచెదర్ = సిద్ధముచేసెదను; తనివుపడనొల్లర్ = తృప్తిని పొందఁజాలను; విజితకందర్ప = మన్మథుని జయించిన వాఁడా! - (మన్మథుని మించిన అందగాఁడా! - అనుట).

36. మహాత్మురాలు, ఇది=ఈమె గొప్పమనస్సు గలది; అశ్రాంత... సామర్థ్య = ఎల్లప్పుడును జంగములను పూజించుటయందు నేర్పు కలది; కందర్ప...సౌందర్య - కందర్పశుద్ధాంతశ్రీ = మన్మథుని భార్య యగు రతీదేవి సౌందర్యమును; పరిహాసకృత్ = అపహసించు - సరిపోలు; నిఖిల లోకాతీత సౌందర్య = సర్వలోకోత్తరమగు చక్కఁదనము కలది; మనః కంజంబు = హృదయకమలము.

37. తెరువెఱుఁగక = దారి, తెన్ను తోఁచక - అనురాగముతో తహతహపడుచున్న; దప్పి = తృష్ణ.

38. పనివినియెదర్ = నెఱవేర్చెదను.

39. పారావతకంఠి = పావురముకంఠముఁబోలు కంఠము కలది; కోకిలవిరావ = కోకిలస్వరమువంటి స్వరము కలది; చంద్రికా శ్రీ = వెన్నెల

సంపద; నానావిధభోగ్యవస్తుకలనన్ = పెక్కు రకముల భోగ్యవస్తువుల సంపాదనముచే (జతకూర్పుచే),

41. మరువిరికుంతంబులన్ = మన్మథుని పూవుటమ్ములయందు.

43. కళలయిక్కువలు = కళలస్థానములు; చెయ్వులు = చేష్టలు.

44. తగులు = ప్రేమము.

46. తివియంగన్ = లాగఁగా; మగుడన్ = మఱల.

47. వడిగొల్పి = తొందరగా; చిన్నకెంపులతోడి = ఎఱ్ఱగానున్న చిన్న దంతక్షతములతోడి, కలఁగని మనముతోన్ = కలఁతపడని మనస్సుతో; [ఇచట 'అంభోజవదన రాజుముందర నిలిచె' నని చెప్పుటచే చంద్రునిముందు వెలవెలఁబోవు పద్మమువలె నామె యుండె నని ధ్వనిత మగుచున్నది.]

48. మండి = కోపించి; అనక = అని యాలోచింపక.

49. జలదము వాసిన చంచల = మేఘమును విడిచిన మెఱుపు. చంచరీకము = తుమ్మెద.

50. పీన కుచభారమువంకన్ = బలిసిన స్తనముల బరువువలన; కఠికిడెందము భూపతి=కఠినమైన మనస్సు గల రాజు; పికాంగనాగతిన్ = ఆఁడుకోయిలరీతిని.

51. ఓంకారమనువు = 'ఓం' అను మంత్రము; నీలోత్పలములు = నల్లకలువలు; దండంబు = సాష్టాంగ నమస్కారము; అవధరించెనొకాక = గ్రహించెనో యేమో!

52. ఎత్తినన్ = లేవనెత్తఁగా; ఇంద్రజాలగురుఁడు = ఐంద్రజాలికుఁడు; పువ్వు......నారినాన్ = పుష్పధనుస్సుయొక్క గండుతుమ్మెదల నారి యనునట్లు; నీలకుంభిరుచిహిండనమో = నల్లని కుంభపు కాంతియొక్క వ్యాపనమో. అలం. ఉత్ప్రేక్ష.

53. నెఱి = పట్టము.

54. చతు రలంకారంబులు = నాలుగు విధములగు అలంకారములు. చిత్తజాతుఁడు = మన్మథుఁడు; చేతఁడి యాఱుదు = చాల తక్కువ కాలమే యైన దనుట.

55. సర్వమంగళాసన్నమనోహరాంగము = సమస్త మంగళములతోఁ గూడిన అందమైన దేహము కల దనుట. [సర్వమంగళకు (పార్వతికి) సహచరమగు మనోహర రూపముకల శివుఁ డని ధ్వనితము.]

56. భంగపడి = అవమానముపొంది; పొగులన్ = దుఃఖింపఁగా.

57. కొనలుసాగు = వ్యాపించు; కనలుసకున్ = కోపమునకు; చతు...పతి = నాల్గుసముద్రములచేతను జుట్టుకొనఁబడిన భూమికి అధిపతి - రాజు.

58. చెయ్యంగాఁగల యూడిగంబు = చేయఁగల సేవ; ఫణిగ్రామణీశయ్యాస్త్రుండు = శేషుఁడు పాన్పుగాఁ గల విష్ణువు అస్త్రముగాఁ గల శివుఁడు.

59. మహాలింగనివాసము = మహాదేవుని దేవాలయము; 'నమశ్శివాయ' అనునది విచారమును తెలుపుట కుపయోగించిన సంస్కృత వాక్యము.

60. మహాకపటలీలన్ = గొప్పదైన విలాసలీలను; కలధౌతశైలశిఖరాలయగేహము = కైలాసశిఖరము నివాసముగాఁ గల శివుని దేవాలయము.

62. ప్రపంచభర్త = భగవంతుఁడు; అనుకంపాలింగితస్వాంతుఁ డై= దయతోఁగూడిన మనస్సుకలవాఁ డై.

63. జమునెసవెండికొండ = దక్షిణకైలాసము - కాళహస్తి కొండ; ఘనసాలము = గొప్ప ప్రాకారము; అగస్త్యాధరాత్మజాలలామము = సువర్ణముఖరీనది; పరిఖాబ్ధి = అగడ్తగా నున్న సముద్రము; అపవర్గసుఖంబు = మోక్షసుఖము; రాజరత్నము = శ్రేష్ఠుఁడైన రాజు; పటునాథుఁడు=విఘ్నేశ్వరుఁడు.

64. శమనాశారజతాద్రి = దక్షిణకైలాసము; భాస్కుఖరి = సువర్ణముఖరీనది; ముక్తివధూటికిక్ = మోక్ష మను వనితకు - అలం. రూపకము.

65. పునః...బంధురమై = శబరులయిండ్లనుండి మాటిమాటికిని వెడలు గానధ్వనిచే మనోహరమైనదై; శబరీ...కుడుంగమై - శబరీకిరాత = శబరదంపతులచే; సమ్యక్కృత = బాగుగా చేయఁబడిన; మన్మథశ్రమ విహార = ప్రణయవిహారమను; మహాఖురళీ = గొప్పగరడికి; కుడుంగమై = నిలయమయి; వాక్కబ...వనంబు=మాటచేతనే ఇతర వనములను దహింపఁ జేయు కార్చిచ్చు గల వనము.

66. వారణకుంభముల్ = ఏనుఁగుల కుంభస్థలములను; శబరవల్లభులు = ఎఱుకరాజులు; ప్రక్కలించి = చీల్చి; రక్తారుణమౌక్తికావళిక్ = రక్తముచే నెఱ్ఱనైన ముత్యముల సమూహమును; నీరేరుహపత్రనేత్రలకుక్ = తామరరేకులవంటి కన్నులు కల కామినులకు.

68. గాధినందనుకతంబునక్ = విశ్వామిత్రుని కారణమున; కడలేని = హద్దులేని; కందుకంబు = బంతి; కుందు = దుఃఖము; ఎడలింపక్ = పోఁగొట్టుటకై.

69. తెగినక్ = చావఁగా; పుట్టువుతీరునే = పునర్జన్మము రాకుండ నశించునా? రోసినక్ = ఏవగించినయెడల; ధాత్రి = భూమి.

70. తానకము = స్థానము-చోటు. ఉమాజాని = పరమేశ్వరుఁడు.

71. తరుణేందుభూషణధ్యానసుధాధారక్ = బాలచంద్రుఁడు నగాఁ గల శివుని ధ్యానామృతధారచే; ఘోరక్షుధాబాధక్ = ఆఁకటి చిచ్చుబాధచే; కుటిలపడక = వంగిపోక - శ్రమపడక. సక...కమునక్ = అన్నియవయవములకుఁ బూసిన విభూతి యను అంగీచేత; విష...భీతిక్ = తేలు పాము మున్నగువానివలని భయముచేత; వెగడుపడక = బెదరక; ఘన...గేహము - ఘనభక్తిగర్త = గొప్ప భక్తి యను గోతియం దున్న,

నిర్ఘాతచిత్తస్తంభ = పిడుగువంటి మన స్సను స్తంభము గల; తనుగేహము = శరీర మను ఇల్లు; గాలిదలఁకు=గాలివలని కదలిక; ఉద్దవిడిన్ = మిక్కిలిగా. రాజయోగజాలము = రాజయోగముల సమూహము.

72. దావానేకపముల్ = అడవి యేనుఁగులు; కరాపహృతపాథః పూరముల్ = తొండముచేఁ దీసికొని రాఁబడిన జలధారలను.

73. శుండాలా...గ్రావము - శుండాలార్భకమండ = గున్న యేనుఁగులగుంపుయొక్క; గండతల = గండస్థలము (దవుడల) నందలి; ఖర్జూభర్జన= తీఁటను పోఁగొట్టుటను; ఉపార్జన = సంపాదించుటకు; అఖండగ్రావము = గొప్పబండతాయి; చండకుండలివిశంకవ్యాప్తికిన్=క్రూరసర్పములు స్వేచ్ఛగా తిరుగుటకు; శ్రీఖండస్థాణువు=చందనవృక్షపు బోదె; శారికా...క్రీడకున్ - శారికా = గోరువంకలు; శుక = చిలుకలు; (మున్నగు) విహంగవ్రాత = పక్షిగుంపులయొక్క; పుంద్రేక్షుకోదండక్రీడకున్=మన్మథక్రీడకు; నీడము= గూడు; (ఇచట కర్త ముని.)

74. కాచియున్న = వేచియుండు; హరి...నీకమునున్ = విష్ణువు, బ్రహ్మ, మున్నగు దేవతల సమూహమును; అవనీధరజాదరహాసలోలతన్ = పార్వతీదేవి చిఱునవ్వుయొక్క విలాసమువైపు; భక్త...నైష్ఠికుఁడై=భక్తుల భక్తి యను కన్యకయొక్క పద్మమువంటి కరమును గ్రహించుటలో నిష్ఠ కలవాఁడయి; (కర్త శ్రీశంకరుఁడు) సంభ్రమంబునన్ = తత్తఱపాటుతో.

75. మనో...ప్రదేశంబు - మనోదృష్టిదురభివేశ = మనోదృష్టికిని ప్రవేశింపరాని - అగోచర మగు; నిరవకాశీకృత = వ్యాపింపఁ జేయఁబడిన; దశదిశాప్రదేశంబు=పది దిక్కులును గలది; పంచభూతములు పృథివ్యప్తేజో వాయ్వాకాశములు; పంచేంద్రియములు త్వక్చక్షుః శ్రోత్ర జిహ్వాఘ్రాణ ములు. పంచవిషయములు = రూప, రస, గంధ, స్పర్శ, శబ్దములు. (ఇంద్రియ విషయములు) పంచక్లేశములు = అవిద్యా, అస్మితా, రాగ, ద్వేష, అభి

నివేశములు. పంచకోశములు అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞాన మయ, ఆనందమయములు. పంచవర్గములు = మీఁది పంచభూతాదులు; ముక్తకంచుకాకారంబునన్ = కంచుకమును విడిచినరీతి - తేజస్వంతముగ- లేదా - ముత్తులకు రతుకుఁ దగు నాకారంబున. పంచశరభంజనుండు = మన్మథుని నశింపఁజేసిన శివుఁడు.

76. నిజ...స్వరూపంబు = తన మనస్సులో ధ్యానించుచున్న శివునిస్వరూపము. పిసాళింపన్ = ప్రకాశింపఁగా; ప్రహర్షంబునన్ = ఎక్కువ సంతోషముతో.

77. పురఘస్మరుఁడు = శివుఁడు. ప్రమోద...భాగమునన్=సంతోషముచేతను, తొందరపాటుచేతను చెమటపట్టిన నొసటిభాగమున.

78. విశ్వకల్పకుఁడు = సర్వమును సృజించినవాఁడు.

79. ఇరువదినాలుగు తత్త్వములు - పంచభూతములు, మనోబుద్ధ్యహంకారములు, విక్షేపశక్తి, పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, శబ్దస్పర్శరూపరసగంధములును. దృశ్యేతరమూర్తి = అదృశ్యమూర్తి.

80. అఖండాద్వైతజ్ఞానమయాకృతి = జీవ, పరమాత్మలకు భేదము లేని అఖండజ్ఞానమయస్వరూపము; తెలియుటది = తెలిసికొనుట.

81. పటుబుద్ధికిన్ = గొప్పబుద్ధికలవానికి. భవపయోధి = సంసార సముద్రము. పశు...మాత్రంబు = పశువుల గిట్టల (దెబ్బల)చే ఏర్పడిన గుంటమాత్రము; ముక్తిప్రమద = మోక్షలక్ష్మి.

82. కాలభుక్తంబులు = కొంతకాలమునకు నశించునవి. కమలజాది పదవులు = బ్రహ్మ మున్నగువారి ఉత్తమపదవులు; చిన్మయాకృతి = చిదానందస్వరూప మగు ఆకారము.

83. ఆదిగృహస్థశేఖరుఁడవు = మొదటి గొప్పగృహస్థుఁడవు; భవ... వేదన చేన్ = సంసారవేదన యను ఆకలిబాధచే, తపనకుఁ తపవేళన్ - బ్రహ్మవిద్యాదనభిక్ష=ఆత్మవిజ్ఞాన మను బిచ్చము; పునరయాచితవృత్తిన్ = తిరిగి

ప్రార్థింపకుండఁగా. ఆకలిచే బాధపడు నతిథి పగలు రెండుజాములసమయ మున గృహస్థునాతిథ్యమును కోరును. ఆరీతినే నేనును సంసారబాధల నోర్వలేక తపస్సుచే తొల్లిటిగృహస్థువగు నిన్ను బ్రహ్మజ్ఞానమును వేఁడు చున్నాను. నీవు దయయుంచి నాకు దానిని ప్రసాదింపుము.

84. ఘోర...మోన్నతిక్ - ఘోరసంసారగద = భయంకరమగు సంసారరోగముచే; ఆపన్న = ఆపదను పొందినవారికి; ఔషధఘుటికా = ఔషధరూపమగు కుప్పె యను; మహిమోన్నతిక్ = గొప్ప మహిమతో; అలం. రూపకము.

85. నేత్రకోణములక్ = కనుఁగొలుకులనుండి. కృపాపూరంబు = దయాప్రవాహము; తొరఁగక్ = ప్రవహింపఁగా. భక్తకల్పభూరుహము = భక్తులపాలిటి కల్పవృక్షము.

86. వటచ్ఛాయ = మఱ్ఱినీడ; నిజదీప్తి = తన కాంతి; మొగులు = మేఘము; నింగిక్ పర్వక్ = ఆకాశమున వ్యాపింపఁగా. బ్రహ్మ...... ఛటలునాక్ - బ్రహ్మసంహనన = బ్రహ్మశిరస్సును ఖండించిన శివుఁ డను అమరద్రుపల్లవచ్ఛటలునాక్ = కల్పవృక్షపుచిగుళ్ళకాంతులో యనునట్లు; ఈశ్వరోఽహమ్ = నేను ఈశ్వరుఁడను; తెల్పుమురువునక్ = తెలుపువిధ మున; చిద్రసములోక్ = ఆనందరసములో; ఎసకమెసఁగక్ = ప్రకాశిం పఁగా. యౌవనశ్రీసమేతుఁడై = యౌవనసంపదతోఁ గూడినవాఁడై; అవత రింపక్ = ఆవిర్భవింపఁగా; శక్తితంద్రియుఁక్ = వసిష్ఠుఁడును.

87. పౌనఃపున్యప్రణతివిధానుం డై = మాటిమాటికిని నమస్కార ములను చేయుచున్నవాఁడై; మ్రోలక్ = సమీపమున; తడయక = ఆలస్యము చేయక; కారుణ్యానూనాపాంగుం డై = దయచేత తక్కువకాని కనుగొలు కులు కలవాఁడై; భవార్తి = సంసారబాధ; అడఁచెదుకొఱకై = నశింపఁ జేయుటకొఱకై.

83. చింతాంతస్థల మై=ఆలోచనకు అవధియై; ప్రకాశితజగచ్చిత్త క్రియాభోగమై = వ్యక్తముచేయఁబడిన లోకముమనోవ్యాపార పరిపూర్ణత్వము కలదై; భ్రాంతి...ప్రథితమై = భ్రాంతిని పొందించఁబడిన జీవత్వముచే పేరుపొందినదై; పద్మ......వ్యాపకమై = పిపీలికాది బ్రహ్మపర్యంతము వ్యాపించినదై; మనోవిషయదూరానందమై = మనస్సునకును గోచరము కాని ఆనందమయమై; సంహృతాద్యంతంబైన=ఆద్యంతరహితమైన; పాశానీకముఁ = పాశముల (బంధముల) సమూహమును; ద్రోయుచుఁ = త్రెంచుచు.

89. ఉపకంఠంబు = సమీపము. పరమేశ్వర.....భారంబు = పరమేశ్వరునివలన కలిగిన ఎక్కువైన వియోగము.

90. కాంచనదండముల్=బంగారుదండములు; చతుర్భాగంబులఁ = నాలుగువైపులను; తద్రమణుల్ = వారి (ప్రమథుల) భార్యలు; డగ్గఱి = సమీపించి; పిఱుందఁ = వెనుకను; సందడింపంగ = సందడిచేయఁగా.

91. శంబర...శాసనముఁ = శంబరాసురుని చంపిన మన్మథుని విరోధి యగు శివునియానతిని; సమస్తభక్తభృంగంబులఁ = సర్వభక్తులు అను తుమ్మెదలను; చిన్మ......త్ములఁ = చిదానందమను మకరందపానముచే సంతోషించిన ఆత్మ కలవారినిగా; అవ్యయభూభువనైకవాసనఁ = ఎక్కువ యయిన భూలోక వాసవాసనచేత; అలం. రూపకము.

92. సవిషాదస్వాంతమునఁ = విచారముతోఁగూడిన మనస్సుతో; రజతశైలంబు = కైలాసము. వసిష్ఠ...ఉదవసితులు = వసిష్ఠమహాముని ఆశ్రమవసమే విలాసార్థ మగు నివాసముగాఁ గలవారము.

93. తగవగునె = న్యాయముకాదు. దీనతామతిఁ = దైన్యముతోఁడి మనస్సుతో.

94. అగజేశులఁ = పార్వతీపరమేశ్వరులను; దేవతాశైలంబు = మేరుపర్వతము; ధనదాశ = ఉత్తరదిక్కు; యమాశాలీలాగమనంబునఁ =

దక్షిణదిక్కునుగూర్చిన విలాసగమనముతో; శశిదినస్వాముల్ = చంద్రుఁడును, సూర్యుఁడును; వియద్వీథిన్ = ఆకాశమార్గమున.

95. పూర్వదిశాదేశంబునన్ = తూర్పుదెసను; విహారసదనంబు = విహరించుచోటు; దేవ......ప్రగ్రన్ = దేవుని సంతోషముతో సేవించు ప్రఖ్యాతితో.

96. యోగి...వోన్నతిన్ = యోగిజనులతో వ్యాపించి, గొప్ప వైభవముతో నుండునట్లుగా.

97. అణిమాదిప్రదమై = అణిమము, మహిమము, గరిమము, లఘిమము. ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము నను ఎనిమిది ఐశ్వర్యముల నిచ్చునదై; శివాజానికిన్ = పార్వతిభర్త యగు శివునికి; గిరిజా... వారి - గిరిజా = పార్వతీదేవియొక్క; కర్ణోత్పల = చెవియందలి నల్లకలువచే; ధ్వంసిత = నశింపఁజేయఁబడిన; ఉల్బణ = ఎక్కువైన; గండస్థల ఘర్మవారి = చెక్కిళ్లపై నుండు చెమటనీరు కలది; భ్రమ్మరున్ = తిరుగును.

98. విపినా...చ్ఛాయలన్=అడవులలోని మామిడి చిగుళ్లనీడలలో; గిరి...నిదాఘుఁడు = కొండగుహలనుండి వెలువడు సెలయేళ్ల ప్రవాహములచే పోఁగొట్టఁబడిన యెండవేఁడిమి కలవాఁడు; శబర...సమీహుఁడు = కిరాతవేషమున వేఁటయందలివిహారమున కోరిక కలవాఁడు; విధురిత = వికలమైన; రతిపరిశ్రమ = సంభోగపరిశ్రమమున; చంద్రికా = వెన్నెలచే; ఆవృతోత్సంగుఁడు = ఆవరింపఁబడిన పైభాగము కలవాఁడు; ఆనందవిపినము= ఆనందవనము.

99. పార్వతీచరణపుష్కరముల్ = పార్వతీదేవి పాదపద్మములు; కఠినాశ్మఘట్టనంబునన్ = కఠినములైన ఱాళ్లతాఁకున; నవభూరుహపల్లవరాజి = చెట్ల లేఁజిగుళ్లగుంపు; ధనదసఖుండు = శివుఁడు.

100. కురంగాలోకముల్ = జింకచూపులు; గ్రావంబునన్ = ఱాతిపయి - పర్వతముపై.

101. నీవారముష్టింపచులు = మునులు; పక్కణము = బోయపల్లె; అంతర్యాగసాధకస్థలములు = మానసికపూజను సాధింపఁదగిన చోట్లు; చతుర్విధాలంకారములు = కర్ణ, కంఠ, హస్త, పాదముల యాభరణములు, జముకైసవెండికొండ = దక్షిణకైలాసము.

102. సగణేశవాసము = గణములతోఁగూడిన శివుని నివాసము; యమ... దేహులకున్ = యమున కాహార మగు గొప్ప దేహము కలవారికి; హంసమంత్రమణి = గొప్పదైన హంసమంత్రము.

103. అంగజుఁడు = మన్మథుఁడు; అజినాంబరముల్ = తోలుబట్టలు, శివత్వమున్ = శివతాదాత్మ్యమును.

104. భవదావాగ్నివిదాహము = సంసార మను కార్చిచ్చువలని తాపము; పవమానంబులు = వాయువులు.

105. అఖండసౌఖ్యరసదాయకము = అఖండానందసౌఖ్యప్రదము; శివాగమప్రభావమున్ = శివతత్త్వమును దెల్పు ఆగమముగొప్పతనమును.

106. వేలుపుఁగొమ్మలు = దేవతాస్త్రీలు; చలవృక్షములు = కదలుచుండు చెట్లు; చాలుగాన్ = వరుసఁగా.

107. ఉత్తరాశాభూమి = ఉత్తరదిగ్భాగము; క్రుంగి = క్రుంగిపోయి; ఒడ్డగెడవు = మీఁదికిలేచినది; ఎగసినన్ = లేవఁగా; ఘటసూతి = అగస్త్యుఁడు; గౌతమీకృష్ణవేణ్యవగాహనములు = గోదావరి, కృష్ణలలో స్నానములు; జ్యోతి, సిద్ధవటనాథున్ = జ్యోతి, సిద్ధవటములలో నుండు దేవదేవుని.

109. కుంభజుఁడు = అగస్త్యుండు; అంబికా... న్యాసమున్ = పార్వతీపరమేశ్వరులచేఁ జేయఁబడిన పాదవిన్యాసము కలదానిని; భవమహామాయావిపర్యాసమున్ = సంసార మను గొప్ప మాయకు మార్పు కలిగించుదానిని.

110. జలనిధి...కాంచీమణి - జలనిధికాంచీవలయ = భూమండలమున; ప్రసిద్ధ = పేరుపడిన; కాశీ...మణి = కాశి, మధుర, కంచి మున్నగు పురముల సంపద యను లక్ష్మికి మొలనూలియందలి పదకము; యామ్య భాగకైలాసగిరి = దక్షిణకైలాసపర్వతము.

111. ప్రగ్గంబులు = త్రాళ్లు; ప్రమదాశ్రుతతుల్ = ఆనందబాష్పముల ప్రవాహము; తొరఁగఁగన్ = కారఁగా.

112. వంచిత...కారాంగమున్ - వంచిత = (విడువఁబడిన) తిరస్కరింపఁబడిన; పాంచభౌతికసుఖ = ప్రపంచసుఖముయొక్క; ఆకార = ఆకారముగల; అంగమున్ = అవయవములు కలదానిని. అనిత్యమగు ప్రపంచసుఖమున కతీతమగు సుఖము కలిగించున దనుట; చిన్నటీ...రంగమున్ = చిదానంద మను నట్టువకత్తెయొక్క సంచారము (నటన) చేత ఒప్పుచున్న రంగస్థలము కలదానిని; మునిమనస్సమ్యక్పరిష్వంగమున్ = మునుల మనస్సులను బాగుగా ఆకర్షించుదానిని; పంచాస్త్రాసుమరుద్భుజంగమున్ = మన్మథుని ప్రాణములను వాయువునకు పామైనదానిని; కృపాపాణింధమాపాంగమున్ = దయను వెదచల్లు క్రీఁగంటిచూపు కలదానిని; ప్రాంచన్ముక్తికళత్రసంగమున్ = ఒప్పుచున్న మోక్షలక్ష్మితోఁ గూర్చుదానిని; ఫణారాజన్మహాలింగమున్ = విప్పారిన పడగతో నొప్పు గొప్ప లింగమును.

113. కించి...చక్షుఁడై = కొంచెము మూసిన రెండు కన్నుల కొలుకులు కలవాఁడై.

114. కాశికా...విదూరుఁడు = శివుని విడుచుటచే; గల్గిన బాధకు దూరమైనవాఁడు—కాశిని విడుచుటచే విచారింపనివాఁడు; వసిష్ఠతపోరమానుభావమున్ = వసిష్ఠుని తపస్సంపదకు ప్రతిఫలమైన శివుని.

115. పంచాశద్వర్ణమూర్తి = ఏఁబది యక్షరముల మంత్రమునకు దేవత; పంచవిద్యాస్వరూప = సద్యోజాతాది మంత్రప్రతిపాదిత బ్రహ్మ

విద్యాస్వరూప; పంచాశత్...ప్రదాత్రిన్ - పంచాశత్కోటిపృథ్వీ = ఏఁబదికోట్లజనము గల భూమిని; భరణచణ = భరించుటయందు సమర్థమైన; మహాభాగ్యలక్ష్మీ ప్రదాత్రిన్ = గొప్ప భాగ్యసంపద నిచ్చుదానిని; సంచారా...హృదయన్ = సంచారమే నివాసముగాఁ గల యోగిజనుల హృదయమైన దానిని.

116. చొక్కెన్ = పరవశమయ్యెను; దక్కెన్ = చిక్కెను; ముక్తితాటంకపతి = మోక్షలక్ష్మి.

117. చంద్రికాకందళితంబు = వెన్నెల అంకురించినది; సంకల్పంబు = కోరిక; గోత్రంబు = పర్వతము; రాత్రించరదిశాభాగంబునన్ = నైరృతిదిక్కున.

118. ఆత్మసరసీరుహలోచన = తననవిత - తనభార్య; సూక్ష్మవలగ్నము = సన్ననినడుము; పొందు = ఉచితస్థలము.

120. ప్రభవించుఁగాక = పుట్టుఁగాక! భవ...సింధువు = సంసారపాపములకు వైరి యగు ఆకాశగంగ; విపుల = భూమి; అభ్రవాణి=అశరీరవాక్యము.

121. శంకాతంకము=సందేహభయము; చంద్రమోఁ లంకారున్= చంద్రుఁడు భూషణముగాఁ గల శివుని; మీనాంకధ్వంసకున్ = మన్మథుని నశింపఁజేసినవానిని.

122. దూరీ...జనము = స్తనములకు బరువుగా నున్న రవికెలను తీసివేసిన స్త్రీజనము కలది; మానవకరాంచద్వ్యజనము = మనుష్యులచేతులలో నుండు వీవనలు కలది; గంధ.. జన్యము = మలయాచలమునుండి వచ్చు గాలియందు విహరించు కోరికను పుట్టించునది; విక్షిప్త...భూతలము- విక్షిప్తజల = చల్లఁబడిన నీటివలన; సమావిర్భూత = పుట్టిన; బాష్ప = ఆవిరితోఁ గూడిన; భూతలము = భూప్రదేశము కలది; అధ్వగాయాసదాయ

కంబు = బాటసారులకు బడలికను కలిగించునది; ప్రాణేశ్వరీ...కారి = ప్రియురాలి కౌఁగిలింతలకు విఘ్నము కలిగించునది; ఘర్మోదకోద్గమనకర్త = చెమటనీటిని పుట్టించునది; అంబరాం...తాపము - అంబరాంతర = ఆకాశ మధ్యమునను; విశ్వంభరా = భూమిపైని; అంబుపూర = నీటియందును; సంచరిష్ణు = తిరుగు స్వభావముకలవాని (పక్ష్యాదుల) యొక్క; పరస్పర = ఇతరేతరమగు; స్థలవిహార = స్థలములలో సంచరించుటలో; సమభిలాష = కోరికను; ప్రవర్ధిష్ణు = మిక్కిలి వృద్ధిని పొందించు; చటులతాపము = తీవ్రమైన వేఁడిమి కలది. ఎండవేఁడిమిని భరింపఁజాలక ఆకాశమున సంచరించు పక్షులు భూమిపైఁ దిరిగిన తాపశాంతి యగునేమో యనియు, భూమిపైఁ దిరుగు జీవములు నీళ్లలో నుండిన సుఖపడుదుమేమో యనియు, నీటిలో నుండునవి తక్కినయెడలకుఁ బోయిన సుఖపడుదుమేమో యనియుఁ దలఁచుచున్న వని భావము. దారుణోష్ణాగమంబు = మండువేసవి.

123. దవవహ్నికీలలన్ = దావాగ్నిజ్వాలలచే. మంగలము = వేఁపుడుచట్టి. ఆవరణాంబురాశి = చుట్టును ఆవరించియున్న సముద్రము.

124. దేవతాచక్రవర్తిత్వంబు = ఇంద్రపదవి; పన్నగము=పాము; ఊర్ధ్వాండకర్పరంబు = పైకప్పుగా నున్న స్వర్లోకము; పాథోరాశి = సముద్రము; అహంమన్యమనుచున్ = అన్న సూక్తవాక్యమును పఠించుచు - అత్యాసక్తితో నగుట. ఇతని తెరువేలపో నని=ఇతని జోలి మనకేల యని; ఇనుఁడు = సూర్యుఁడు; ఆతపస్తంభనంబు నేర్చెనో = అగస్త్యుఁడు ఎండ వేఁడిమి తనకు తగులకుండునట్లు అరికట్టు విద్యను నేర్చెనోయేమో!

125. పంచశిఖిమధ్యక్షోణిన్ = పంచాగ్నిమధ్య భూభాగమున; (నాల్గువైపుల అగ్ని, మీఁద ఎండ); ఖద్యోతన్యస్తనిరీక్షణుండు = సూర్యుని పైనే ఉంచిన చూపు కలవాఁడు; (ను, ద్యోతప్రతీతప్రభాన్వితుండు - అనియు పా.) తద్ద్యోత...న్వితుండు = ఆసూర్యుని వేఁడిమి ప్రతాపము

కాంతులచే వృద్ధిపొందినవాఁడు; దిశాబృందారకాధీశ్వరుల్ = దిక్పతులు; స్వాధికారగరిమల్ = తమ గొప్ప అధికారములు; పేడెత్తును = పోవును.

126. వింధ్యగ్రావకూటంబులు = వింధ్యపర్వతశిఖరములు; అభ్రాంతంబు = ఆకసము నలుమూలలు; భాస్వంతుణ్ =సూర్యుని; ఇరులు=చీఁకటి; కాలాభ్రముల్ = కాఱుమబ్బులు. అలం. ఉత్ప్రేక్ష.

127. మొగులుమొగులునణ్ = ప్రతిమేఘమునందును; మెండుకొనియెణ్ = అధికమయ్యెను; ఉప్పతిల్లెణ్ = పుట్టెను.

128. ప్రళయ...వర్షాంబువు - ప్రళయవేళాసముద్భవ = ప్రళయకాలమున పుట్టిన; పుష్కలావర్తకాది = పుష్కలావర్తకములు మున్నగు; పయోద = మేఘములయొక్క; వర్షాంబువు = వాననీరు; ఊర్ధ్వాండకర్పరంబు = కప్పుగా ఉన్న మీఁదిలోకము; వ్రక్కలై = బ్రద్దలయి; ఆవరణాంభము = చుట్టును ఆవరణముగా నున్న జలము; చండాంశుకరములు = సూర్యకిరణములు; ధరాభువనంబుణ్ = భూలోకమును; ఒక్కటణ్=ఒక్కసారిగా; పొదివెను = ఆక్రమించెను; అభ్రగంగాప్రవాహము = ఆకాశగంగ పాఱుదల; వసుమతి = భూమి; జీవనాకారముగను=నీటిస్వరూప మగునట్లుగా; ఓడక = వెఱవక. అలం. ఉత్ప్రేక్ష.

129. తటిత్తీవ్రప్రభాపుంజమై = మెఱుపులయొక్క తీవ్రమైన కాంతిసమూహము కల దయి; మేదినీధరశిఖాదంభంబునణ్ = కొండశిఖరముల నెపమున; ఎలుఁగిచ్చుణ్=ధ్వనించును; తముణ్ = తమ్ము - పంచభూతములను; జలదాసారము = మేఘువర్షధార.

130. అణంకువేది = నమ్రత లేక; యోషాతతి = స్త్రీలు; శశిబింబము = చంద్రబింబము; భీతిఁదొఱంగణ్ = భయపడఁగా.

131. విజితనీరధి = అగస్త్యుఁడు; ఆఖండలముఖ్యులు=ఇంద్రుఁడు మున్నగు దేవతలు.

132. క్రోడాకారము = వరాహరూపము; పోత్రము=పందిముట్టె; వైకుంఠుండు = విష్ణువు; పదము = అడుగుభాగము, పాదము; 'బ్రహ్మయు, విష్ణువును పరస్పరము ఆధిక్యమునకై కలహించి శివునియొద్దకుఁబోయి తెలుపఁ గోరిరఁట! శివుఁడు "నాశిరస్సునుగాని, పాదములనుగాని చూచివచ్చువారే అధికులు" అనెనఁట! బ్రహ్మ హంసయై శిరస్సును చూచుటకును, విష్ణువు వరాహమై పాదములఁ జూచుటకును బోయి, ఎప్పటికిని అవి కానరామిని విసుగుచెంది వచ్చెనఁట! ఇది యిచటి పురాణగాథ. నేఁడు శివుని సేవించు టచే ఆతని పదదర్శనభాగ్యము లభించె నని చమత్కారము.

133. పడయనో = పొందుటకొఱకో; ఏకాంతి = ఏకాంతముగా ఉన్నవాఁడు; చేతఃప్రీతి = మనస్సంతోషము.

134. దరహాసము = చిఱునవ్వు; రౌప్యధరాధరంబు = కైలాస పర్వతము.

135. చదవేలు = ఆకాశగంగ; నీబడిన్ = నీవెంట.

136. కామితవస్తువు = కోరినది; చిర...ఖేదము - చిరకాలకృత= చాలకాలము చేయఁబడిన; ఉగ్ర = భయంకరమైన; తపస్సమాధినిష్ఠా = తప స్సమాధినియమముచేతనైన; అమితఖేదము = గొప్పశ్రమము; నిమిషార్థము= అరనిముసము.

138. దేవతాపతి = ఇంద్రుఁడు; హవ్యము = హోమద్రవ్యము; అసుర = నిర్మృతి; అంభోభర్త = వరుణుఁడు; కరువలి=వాయువు; ధనపతి = కుబేరుఁడు; భావమునన్ = మనస్సులో; అజుఁడు = బ్రహ్మ.

139. పయోజసంభవుఁడు = బ్రహ్మ.

140. తమ్మిచూలి = బ్రహ్మ; సువర్ణశోభావిభవంబుతోన్ = గొప్ప బంగారుకాంతితో; బహుళ...సంపదన్ = ఎక్కువైన అలల ప్రతిధ్వను లతో; దేవనదీఝరంబు = ఆకాశగంగాప్రవాహము; విరించి = బ్రహ్మ;

తద్గుణశ్రీ = ఆప్రవాహగుణసంపద; సువర్ణముఖరీప్రథ=సువర్ణముఖరి యను ప్రసిద్ధి. [అయ్యది సువర్ణవర్ణము కలదగుటను, అలలచే ప్రతిధ్వనించుటను, అనుట.]

141. అంతర్ధానముసేసెన్ = మాయమయ్యెను; అగస్త్యగ్రావవిఖ్యాతి = అగస్త్యపర్వత మను ప్రసిద్ధి. ఆశాంతంబుల్ = దిగంతములు; నభంబు, ఆద్యంతముగ్ = ఆకాశమంతటను; శీకరాక్రాంతంబై = నీటితుంపరచే నిండినదై.

142. పవనాశనభవనభువనంబు = నాగ (పాతాళ) లోకము; హరి...ఫలంబులు - హరి = సింహముయొక్క; నఖరముఖ = వాఁడిగోళ్లచే; వినిర్దళిత = చీల్పఁబడిన; కుంభి = ఏనుఁగుయొక్క; కుంభ = కుంభస్థలము నుండి; గళిత = జాఱిన; ముక్తాఫలంబులు = ముత్యములు; నిజ...ఫలంబులు = తనలో నున్న ముత్యపుఁజిప్పలనుండి వెడలిన ముత్యములు; నీలవాలంబులు = నల్లని తోఁకలు; శైవాలంబు = పాఁచి; వళక్షచామరజాలంబులు = తెల్లని సవరమృగముల వెండ్రుకలు; డిండీరికాధవళితకల్లోలంబులు = నురుఁగుచేఁ దెల్లనైన యలలు; కుసుమ...కాండంబులు - కుసుమశరపరితాప = మదనవేదనచే; పరవశ = పరవశములయి; వశ = లొంగిన; అనిమిత్త = కారణములేనియట్లు; మత్తవేదండ = మదపుటేనుఁగులతోడి; ఖండనక్రీడా = యుద్ధమున, ఖండిత = నఱుకఁబడిన; దండకాండంబులు = తొండములగుంపులు; రసాలసాలములు = తియ్యమామిడిచెట్లు; కాదంబము = ఒక జాతి హంస; ఉప్పరంబెగయు = ఆకాశముపై కెగురు; నిలింపదంపతులు = దేవతల దంపతులు; పూర్వదుర్వాసనాసక్తులై = వెనుకజన్మములోని పాపపుసంబంధమునకు లొంగి; చీరులేఅంగునన్ = పిలిచెడి రీతిని; అభంగ భంగములు = ఎడతెగని యలలు; అరుణధరణీభాగము = ఎఱ్ఱని నేల; స్రోతంబులు = ప్రవాహములు; క్షీరతరంగిణి = పాలేఱు; అవనీజనం

బులు = భూప్రజలు; మేలపునన్ = రీతిని; అమందబిందు సముదయంబును = తక్కువకాని బిందురూపధ్వనుల సమూహము కలదియు, ఎక్కువ నీటిబిందువులు కలదియు; నాదప్రసాదమేదురంబు = నాదధ్వనితో గొప్పగా నున్నదియు, ధ్వనితో గొప్పగా నున్నదియును; వారాకరము = సముద్రము; తరణము = దాఁటుట, తరించుటయు; లంఘితా లంఘ్యవిషయప్రదేశంబును = దాఁటఁబడిన, దాఁటరాని (తప్పించుకొనరాని) ఇంద్రియ విషయములు కలదియు, దాఁటఁబడిన అసాధ్యమయిన దేశములు, ప్రదేశములు కలదియు; జీవనంబు = బ్రతుకు, నీరు; మత్స్య, కచ్ఛపాద్యవతారములు = మత్స్య, కూర్మాను లగు అవతారములు, చేప, తాఁబేలు మున్నగు జలచరములును; శంఖ, చక్రశోభితాకారంబు = శంఖ, చక్రములతోఁ బ్రకాశించు ఆకారము కలదియును-శంఖములు, సుడులు కలదియును; పర్వతోత్పాటన పాటవము = గోవర్ధనపర్వతమును పెల్లగించి యెత్తు నేర్పు. పర్వతములనుగూడ పెల్లగించు నేర్పు; పలాశకలాపంబు = రాక్షససమూహము, ఆకులగుంపు; గోరక్షణము = గోవులను రక్షించుట, భూమిని రక్షించుటయును; అర్జున శర సమూహము = అర్జునుని బాణములగుంపు - కసవు, రెల్లుల సమూహము; మదితమన్మథ సముత్సాహంబు = మర్దింపఁబడిన మన్మథుని వేడుక కలది, నశింపఁజేయఁబడిన పెలఁగల పెంపు కలదియు; గగనతరంగిణి = ఆకాశగంగ; పురభంగుర ప్రభావము = త్రిపురములను నశింపజేయు శివుని ప్రభావము, పురములను (ముంచి) నశింపఁజేయు ప్రభావమును; శివాభోగంబు = పార్వతి యందు భోగము కలది, జమ్మియందు భోగము కలది; వెల్లివొడిచినన్ = పొంగిరాఁగా; నిరుపేదనడుములు = సన్నని మధ్యములు; ఎడరు = అపాయము; వెఱపు = భయము; ఉడుపు నెపంబునన్ = పోఁగొట్టెడు మిషచే; చిత్తజాయత్తంబులు = మన్మథునికి వశమైనవి; ఉపనాథులు = విటులు; కొండనెత్తంబులు = కొండమీఁది బయళ్లు; నిధానంబు = ఉనికి; రథాంగము = చక్రవాకము; ప్రతిఘటించు = ఎదుర్చు, ఉభయ......

బృంహితంబులు = రెండు తీరములందలి యడవులందును ఉండు ఏనుఁగుల ఘీంకారములు; అసహ్యంబులు = ఓర్వరానివి - భయంకరములు; ప్రోదిసేయు = పోషించు - అనుకరించు; తురంగగళగళారావంబు = గుఱ్ఱముల సకిలింతలు; రోదసీకుహరంబులు = భూనభోంతరాళంబులు; చండతరంబులు = మిక్కిలి ఘోరమైనవి; దురితంబులు = పాపములు; రంగవల్లిక = ముగ్గు; పుటభేదనము = పట్టణము; భాగ్యదేవతాలలామంబు = గొప్ప సంపల్లక్ష్మి; వీచీకరోక్షిప్తశీకరముక్తికాఘటితజాలంబులన్ = అలలను చేతులతోఁ జిమ్మఁబడిన నీటితుంపరలను ముత్యాల తలఁబ్రాలను, వారాకరవరుఁడు = సముద్రుఁడను పెండ్లికొడుకు; [అనువర్ణముఖరి సముద్రమునఁ గలిసె ననుట] ఘటసూతి = అగస్త్యుఁడు.

143. హేమ...వ్యాపారంబులన్ = సువర్ణముఖరిలోని చలించు అలలలో ఉయ్యాలలూఁగుటలచే; భూతి = విభూతి; విద్యాపుంరూపములో = పురుషరూపములు ధరించిన విద్యలో; ఉపాంతంబునన్ = చేరువ.

144. మనోఽధ్వగునిన్ = మనోమార్గమున చరించువానిని - మనోగమ్యుని.

146. నిమగ్న...ప్రకాశా = తక్కువచేయఁబడిన బ్రహ్మాండ భాండముల కాంతి కలవాఁడా! భవార్ణో...దీపా = సంసారసముద్రమునఁ బడినవారికి రత్నద్వీపమైనవాఁడా! నిర్లేప = గుణాతీతా! జీవునింజేసి = జీవునిగా భావించి; మహదాదితత్త్వాత్మకంబు = పృథివ్యాదులగు ఇరువది నాలుగు తత్త్వములు కలది; త్రైగుణ్యము = సత్త్వరజస్తమోగుణములు; షడంతర్విరోధుల్ = కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను ఆఱు అంతశ్శత్రువులు; తమోఽంధీకృతా లోకులు = అజ్ఞానముచేత కన్నులు తెఱయని తేజస్సు కలవారు; కాలదిగ్భాగ కైలాసశైలంబు=దక్షిణ కైలాసపర్వతము; కంఠశోషంబుగాన్ = గొంతుక బొంగురువోవునట్లు; బుద్ధి

వైదగ్ధిని = నేర్పుయిన బుద్ధికి; సిద్ధ...భ్యాస = సిద్ధాసన, పద్మాసన, కూర్మాసనాదులగు ఆసనముల యభ్యాసము; నాడీసదా శోధనాయాసము = నాడీశోధన మను ప్రాణాయామభేదమువలని శ్రమము; ఆధార...బంధంబులన్ = ఆధార = మూలబంధము; జాలంధర = కంఠమును వంచి గడ్డమును ఱొమ్ము మీఁద నిలుపు బంధము; ఉడ్డీనబంధంబు = నాభియొక్క క్రిందిభాగమును, మీఁది భాగమును వీఁపునకుఁ దగులునట్లు లాగుట; కుండలీశక్తివక్త్రంబు = కుండలీ శక్తియొక్క ముఖమును; అవక్రంబు = వంకర లేనిది - తిన్ననైనది; షట్చక్రికావీథి = మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞాచక్రము లను ఆఱు చక్రములు; గంధవాహములు = వాయువులు; బ్రహ్మరంధ్రోపరివ్యాపకంబైన = బ్రహ్మరంధ్రము మీఁదుగా వ్యాపించిన; సంవిన్మయాకాశదేశాంతర = జ్ఞానమయమగు ఆకాశప్రదేశ మధ్యమున; ఉద్యత్ = ఉదయించుచున్న; పర...జ్యోత్స్నన్ = పరమాత్మ యను చంద్రునివలనఁ బుట్టిన వెన్నెలయందు; తాదాత్మ్యమున్ = ఐక్యమును; పుత్రపుత్రీకళత్రంబులు = సంతానము, భార్యయు; శీతవాతాతపాది చలి, గాలి, ఎండ మున్నగునవి; వ్యవస్థాదిభేదంబు = నియమాది భేదము; ఖేదంబు = దుఃఖము; మోదంబు = సుఖము; బ్రహ్మకీటాంత జంతువ్రజంబుల్ = పిపీలికా బ్రహ్మపర్యంతము కల జీవరాసులు; జ్ఞేయము= తెలిసికొనఁ దగినది; జ్ఞాత = తెలిసికొనువాఁడు; ఏపట్టునన్ = ఏవిషయమునను; పట్టకే = లెక్కింపకయే; భక్త...నైచికీ = భక్తులను దూడలను వెంటనంటి వచ్చు కామధేనువగువాఁడా! భక్త...కల్పకా – భక్తులను ఉద్యానవనమునకు కల్పవృక్షమువంటివాఁడా! భక్త...వజ్రాయుధా = భక్తుల సమూహముయొక్క ఆపదలను కొండలకు వజ్రాయుధమైనవాఁడా!

147. తపస్వికేసరి = గొప్పముని యైన అగస్త్యుఁడు; సువర్ణ...మణిన్ = మేరువు విల్లుగాఁ గల శివుని యంతఃపురకాంత (భార్య) యగు పార్వతీదేవిని.

148. జ్ఞానప్రసూనకలికన్ = జ్ఞానప్రసూనాంబను.

149. సువర్ణముఖరీద్వీపవతి = సువర్ణముఖరీనది.

150. అభవుఁడు = శివుఁడు; వినయగరిమన్ = ఎక్కువ వినయముతో.

151. హేమవర్ణ = పచ్చనిచాయగలది - లోపాముద్ర; కులవధూటి = భార్య - లోపాముద్ర. అనుభావము = మహత్త్వము.

152. కల్పధరణీజాతము = కల్పవృక్షము.

153. తత్ప్రతిగాన్ = దానికి మాఱుగా.

154. దొరయును = కలియును - తగును

155. అనిమిషశైలము = మేరుపర్వతము.

156. అవిముక్తము = కాశీక్షేత్రము.

157. తోఁగు = మునుఁగు; ఆటవికాధిపు పుక్కిటినీరు = తిన్నని పుక్కిటినీరు; శివైక్యము చెందు నని భావము.

158. అహీనము = హీనముకానిది - గొప్పది; సామజపూజ = ఏనుఁగువలని గౌరవము; సామజారి = సింహము (శివుఁడు).

159. ఉటజంబు = పర్ణశాల.

161. భర్గుఁడు = శివుఁడు; అర్థంబులు = కోరికలు.

162. పాశ...మూర్తి = సంసారబంధము, క్లేశములు, సత్త్వరజస్తమోగుణములు, దారేషణ, ధనేషణ, పుత్రేషణలును, ఇంద్రియములును, అంతశ్శత్రువులును, తాపములు, షడూర్ములు, పంచకోశములు - అను వీనికి వ్యతిరిక్తముగా ఉన్న దేహము కలవాఁడా! త్రిజగ...కార = ముల్లోకములను నిండిన ఆకారము కలవాఁడా! మాయా...గ్ధాంత = వేషము చేత, శృంగారముకల వనితయొక్క విలాససంపదచే కట్టఁబడిన (స్వాధీనము చేసి

కొనఁబడిన) చక్కనిరూపు కలవాఁడా! శర్మావహ = శుభములను కల్గించు వాఁడా! తార...ప్రదా = రామతారకమంత్రము నుపదేశించువాఁడా!

163. ఇదంతా...దూర = 'ఇది, నేను' అను ఆలోచనకు దూరమైనవాఁడా! అపవర్గ...కాంత = మోక్షలక్ష్మికి భర్త అయినవాఁడా! దిగంతా...కరా = దిక్కుల చివరివఱకు వ్యాపించిన ఆకాశమునందలి మేఘముల తుది (ప్రళయ) కాలమున నాట్యాభినయముల నొనర్చువాఁడా!

164. అపారతా...నిధీ - అపారతా = అంతములేకుండుట; గభీరతా = లోఁతు; అమృతాదిహేతుభూతతా=అమృతము మున్నగువాని పుట్టుకకు కారణ మగుట; తపస్విసంగృహీతతా=మునిజనులచే సంగ్రహింపఁబడుట; విధాతృ...మానతా = బ్రహ్మ మున్నగు గొప్ప దేవతలచే తలఁపఁబడుట; నదీ...మగ్నతా = నదుల కాధారములగు జలపాతముల స్థానము అనువానిచే; అభిరామ మనోహరమగు; చిత్పయోనిధీ = చిదానందసముద్ర మగు దేవా!

## ద్వితీయాశ్వాసము

1. శ్రీఖండా...ఖని - శ్రీఖండాచల = మలయపర్వతమునుండి వచ్చు; మారుతలేఖాస్పర్శాది = వాయుసమూహముయొక్క స్పర్శము మున్నగు; విషయ = విషయములను; లిఘాకృద్విద్యాఖని = అస్వాదింపని విద్యకు గని యైనవాఁడా! - స్పర్శాదీంద్రియవిషయములయెడ అసక్తిని కలిగింపని వేదాంతవిద్యకు నిధీ యనుట; మునిజనకల్పకశాఖీ = మునులకు కల్పవృక్షమైన వాఁడా!

4. శంకలు = సందేహములు; స్వస్తికహస్తులై = చేతులు కట్టుకొన్నవారై; బరాబరిగన్ = హెచ్చరికగా; సుపర్వులు = దేవతలు; పత్త్రములు= నోళ్లు; కప్పుక = మూసికొని; పూర్వదేవతలు = రాక్షసులు; కింకర్వాణులు = సేవకులు; అబ్జగర్భుండు = బ్రహ్మ.

5. లావణ్యరసాలయంబు = లావణ్యరసమునకు నిలయము; లావణ్యమువంటి నీటికి నిలయమును; గుణరత్నస్థానము=శ్రేష్ఠములగు గుణములకు స్థానము, గుణములవంటి రత్నములకు స్థానమును; ఆస్య...దయను = ముఖమను చంద్రునియొక్క ఉదయము కలది, చంద్రబింబమను ముఖము కలదియుఁ; ఉన్నత...వ్యక్తి = ఎత్తయిన కొండలవంటి స్తనములు కలది, స్తనములవలె ఉన్నతములగు కొండలు కలదియు; వాచాసుధాభవదేశంబు = అమృతము లొల్కు మాటలకు చోటు, మాటలవంటి అమృతమునకు స్థానమును; వళీతరంగము = తరంగములవంటి వళులు కలది, వళులఁబోలు అలలు కలదియును; తనూ...విలాసంబు = నురుగువంటి దేహకాంతివిలాసము కలది, దేహకాంతివంటి నురుఁగు కలదియును; తత్కళత్రము = బ్రహ్మభార్య - సరస్వతి; సుధాబ్ధి = పాలసముద్రము. అలం, ఉపమ, రూపకమును.

6. కెలంకులు = ప్రక్కలు; వజ్ర...ద్వయంబుక్ = మణులు తాపిన రెండందెలును; మానికపుకెంజాయలు = ఎఱ్ఱని మాణిక్యముల కాంతులు; దువాళించు = సమముగా ఒక్క ధాటిలో ప్రసరించు; కొల్వుమోసాల = కొలువుకూటము.

7. రాజసక్రీడాభిరతులు = రజోగుణసంబంధము గల ఆఁటలయెడ కోరికలు; పొదలనీక = కలుఁగనీయక; వ్యాహారసింహాసనము; పలుకుగద్దె; వ్యాహృతి = సంభాషణము.

8. అతలికత్స్యాంతరమునక్ = అవతలి గుమ్మములో; కరానీత...పుస్తక = చేతితో తీసికొనిరాఁబడిన (ధరింపఁబడిన) వీణ, చిలుక, స్ఫటిక జపమాల, పుస్తకములు కలది.

9. పరిసరము = సమీపము; పంపు = ఆజ్ఞ; మణి...ధగద్ధగితంబు = మణులయొక్క ఎఱుపుమించిన, పసుపువన్నెచే ధగధగ మెఱయుచున్నది; సరిగద్దియ = సమానమగు సింహాసనము.

10. కైదువ = అయుధము; తలఁపుతెర్వరి = ఆలోచన యను బాటసారి; రాయిడి = రాపిడి; తాల్మి = శాంతము; తుమురుగాఁ = శిథిలములుగా; నలువ = చతుర్ముఖుఁడు - బ్రహ్మ. వలరాజు చిలుకుములికి=మన్మథుని వాఁడియైన బాణము; తలఁకి = బెదరి - ధైర్యముచెడి.

11. అహ్లాదము = సంతోషము; తగవు = ధర్మము.

12. నెయ్యమునఁ = ప్రీతితో; వాణి = సరస్వతి.

13. వాచాగోచరము = మాటలకు అతీతమైనది; అప్రతర్క్యము= ఊహింపరానిది; వినిర్ద్వంద్వంబు = ద్వంద్వాతీతమైనది; అచోద్యఁబు = మిక్కిలి యాశ్చర్యమైనది; అప్రతిమపర్యాయంబు=సాటియు, సరియు లేనిది;

14. ప్రమద...కృతులు = ఎక్కువ సంతోషముతో గ్రహింపఁబడిన రూపములు.

15. శతవాగ్వనజాననలు = నూఱుమంది సరస్వతులు.

16. పుష్పితవల్లులు = పూచిన తీఁగలు; ఇందిందిరశాబకంబు = కొదమతుమ్మెద; శతానందుఁడు = బ్రహ్మ - నూఱుగురితో ఆనందించువాఁడు; విధాత = బ్రహ్మ.

17. ఆరామంబులు = తోఁటలు; కేలిశైలములు = క్రీడాపర్వతములు; స్వర్ణదీ...పుంజములు = ఆకాశగంగానది యొద్దునఁ గల పొదరుటిండ్లగుంపులు; హృజ్జాతాంధకారాంధుఁడై = కామాంధకారమున కన్నుగాననివాఁడై; నీరేజాసనుఁడు = బ్రహ్మ.

18. అనపెట్టుచు = ఒట్టుపెట్టుచు; ఓరంతప్రొద్దు = చాలకాలము - ఎల్లవేళలు.

20. పరిరంభణంబు = కౌఁగిలింత; సోలుఁ=పరవశత్వముపొందును.

21. తోరపుఁగోరికల్ = ఎడతెగని (ఎక్కువ) కోరికలు; గండము= చెక్కిలి; నల్వ = బ్రహ్మ.

22. పోముత్తి = విడిచి.

23. దోషకారులు = తప్పుపనులు చేయువారు; లోకకంటకులు = లోకులకు బాధ కలిగించువారు; తోడ్తోన్ = వెంటనే.

24. మిహిరమండలము=సూర్యమండలము; పసుపు = ఆజ్ఞాపింపుము; తమ్మిచూలి = బ్రహ్మ.

25. ఉమ్మలించి = దుఃఖించి; అలరమ్ములు = పూవుటమ్ములు; కటకటంబడి = కష్టపడి; వెక్కసులు = సహింపరానివారు; గగన...శృంగాటకంబు = ఆకాశమును చొచ్చుకొనిపోవు ఎత్తయిన శిఖరములను చతుష్పథములు కలది; ఉదీ......దుర్గంబు = ఉత్తర దక్షిణములకు, తూర్పు పడమరలకును తగిన అగడ్తలుగా నున్న గంగా, గోదావరీనదులచేతను, సముద్రముచేతను ఆవరింపఁబడిన దుర్గమయినది; నిర...మధ్యంబు = అడ్డులేని వివిధమృగములసందడిగల మధ్యభాగము కలది.

26. దిక్కడుంగముల్=దిక్కులను పొదరిండ్లు; మషీ...భానులై= మసివలె మలినమైన శరీరముయొక్క నల్లని కాంతిపుంజముచే తక్కువచేయఁబడిన సూర్యుఁడు కలవారై; కయిదువల్ = ఆయుధములు.

27. ప్రమదావళి = స్త్రీసమూహము; సంహతి = సమూహము. కందఁజేయుచున్ = బాధపడునట్లు చేయుచు.

28. గాసింబెట్టి = బాధించి; చార్వాకమార్గరతుల్ = చార్వాకమార్గమున ఇష్టము కలవారు; ప్రత్యక్షమునే ప్రమాణముగా గ్రహించు నాస్తికులు చార్వాకులు; 'ఋణంకృత్వాఘృతంపిబే' త్తనునట్టి సిద్ధాంతము వీరిది.

29. జాతిభీతులు = జాతివివక్షయు భయమును; అనుక్రోశ... శంకలు = దయ, సిగ్గు, నీచము, సందేహమును; అపవర్గానందము=మోక్షమువలని ఆనందము; కులశీలాదులను దూరముచేయుట భ్రష్టులకును యోగులకును సమానమే; సంసారమగ్నులు భ్రష్టులై నరకమునకు పోవుదురు; యోగు లింద్రియములను జయించి, మోక్షము పొందుదురు. ఇదియే భేదము.

30. భాండాగారములు = కోశాగారములు; బందీ.. కాంతలు = చెఱలలో ఉంపఁబడిన, చండాలస్త్రీలు చివరగాఁ గల వనితలు; ఆత్మకుల యోషారత్నముల్ = తమయిల్లాండ్రు; సత్క్రియల్ = మంచిపనులు; చండక్రీడలు = క్రూరములైన పనులు; భోజ్యశ్రేణి = తినుబండారములు; కాదంబరీభాండవ్రాతము = కల్లుకుండలు;

31. మూర్ధ్ని...ములతోన్ = తలపై ధరించిన (బ్రహ్మయొక్క) పద్మములఁబోలు పాదములతో; భాషాబద్ధుండు=సరస్వతితోఁ గూడి యున్న వాఁడు.

32. తోయజగర్భుండు = బ్రహ్మ.

33. కెరలినన్ = విజృంభింపఁగా; బెగడన్ = భయపడఁగా.

34. సహజన్ములు = సోదరులు; నింగి = స్వర్గము; సారసగర్భుఁడు= బ్రహ్మ.

35. కుంజరముల్ = ఏనుఁగులు - దిగ్గజములు; జలరాశి = సముద్రము; రథాంగము = చక్రము; కులక్షితిధరంబులు = కులపర్వతములు; రథ్యమృగేంద్రసాంద్రహేషావళిన్ = వాహనము లగు సింహములయొక్క భయంకరగర్జనలచే; హరిదంతము=దిక్కుల చివరిభాగము; వ్రక్కలయ్యెన్ = బ్రద్దలయ్యెను.

36. తేరు=రథము; జోదు = యోధుఁడు.

37. గంధా.. బృందముల్=మదపుటేనుఁగు లనేకములును; గుఱ్ఱముల సమూహము లనేకములును; రథముల గుంపులును; కార్ముకామోఘాస్త్రంబులు = విల్లును, వ్యర్థముకాని యస్త్రములును; హేమరథముల్=బంగారపు రథములు; ఎత్తిన = లేఁగిన; ఆడుసుగాన్ = బురదగా కాఁగా.

39. కాలుబలంబు = పదాతిసేన; పిఱుఁదన్ = పిదప - తరువాత; వెఱఁగు = ఆశ్చర్యము.

40 గరళంబు=విషము. ఉగ్రవ్యగ్రవిస్ఫూర్తిన్ = శివునియొక్క భయంకరాకారమువలె; కుంభజునిరేఖన్ = అగస్త్యునిరీతిని; ధ్వాంతసంతానము = చీఁకటిసమూహము; దినేంద్రుచందమునన్ = సూర్యునివలె.

41. చదివెన్ = అణఁచివైచెను; ఫౌఁజు=సేన; గగ్గులకాడు = గింజలులేని కంకి - నిస్సారము;

42. సోమసూర్యవీథులు = ఎదురెదురుగా - నున్న ఇండ్లవరుసలు;

43. కదనంబు = యుద్ధము.

44. పటాపంచలై = చెల్లాచెదరై; పాయల్వాఱి = చీలికలయి; ఫిటుపోటులు = శస్త్రాస్త్రప్రయోగములు; సమిద్భూమ్యయుక్తాంగములు=యుద్ధభూమిమీఁదఁ బడిన దేహములు కలవి; వక్త్రములు = ముఖములు.

45. వెఱపు = భయము; ఉఱవడి = (ఉఱవు+వడి) వేగము.

46. తుములము = దొమ్మియుద్ధము; తెమలక = చలింపక. నిర్ఘాతము = పిడుగు; శరపరంపరలు = బాణములగుంపులు.

47. తుమురుగన్ = ముక్కముక్కలుగా; దావశిఖి = కార్చిచ్చు; విశిఖకీలలన్ = బాణాగ్నులను.

48. శరనిధి = సముద్రము; వమ్ము = వ్యర్థము.

49. శోణరుచి = ఎఱ్ఱనికాంతి; దృక్కోణంబులు = కనుగొలుకులు; వేసోఽండంబు = బ్రహ్మాండము; కోదండవిద్య = విలువిద్య; మనుజా..... పాళిగన్ = రాక్షసుల దేహమునుండి వెడలు రక్తముచేఁ గడుగఁబడిన నేలమీఁది ధూళి కలుగునట్లుగా; మృగేంద్రస్యందనుండు = సింహరథుఁడు - ఉగ్రుఁడు.

50. శోణపవరులు = రాక్షసవీరులు.

52. క్రక్కదలంగన్ = గజగజలాడఁగా; చక్ర...ధ్వనుల్ = ఆకర్ణాంతము లాగఁబడిన వింటినారిధ్వనులు; కంకపత్రంబులు = రెక్కల

బాణములు; జోదు = యోధుఁడు; బేతాళముల్ = పిశాచములు; గ్రుక్కిళ్ళింగఁగన్ = మాంసరక్తములు లభించు నను ఆశతో గుటకలు వేయఁగా; వాఁగులు = ప్రవాహములు; క్రవ్యాదులు = రాక్షసులు.

53. నుగ్గుచేసి = ముక్కలుచేసి;

54. మాంసాహారవీరుల్ = రాక్షసవీరులు.

55. నిశాత = వాఁడియైన; రథాంగము = రథచక్రము.

56. శిలీముఖావళి = బాణములగుంపు.

57. అంపవానలు = బాణవర్షములు; మానవాశనుల్ = రాక్షసులు; బేగుబబేటులు = ఎఱ్ఱనినదులు; జాఱొప్పునన్=ప్రవహించురీతిని; (జాఱు నొప్పున నని యుండవలెను.)

58. టెక్కెంబుల్ = పతాకలు; కోటీరంబులు = కిరీటములు; తూణములు = అంపపొదులు; వర్మంబులు = కవచములు.

59. ఆరిగలు = ఒక జాతి యాయుధములు (కేడెము లనియు); పట్టెములు = పెద్దకత్తులు.

60. రక్షోమాతంగములు = ఏనుఁగులఁబోలు రాక్షసవీరులు; ఉగ్రుంబోలి = శివునివలె; శాతాంధకారామిత్రాంబకము = వాఁడియైన అంధకారశత్రువను నస్త్రమును; కడికండల్ = ముక్కముక్కలు.

61. భీరువోక = భయపడక; అసురనాథుల్ = రాక్షసవీరులు; సమితేక్ళిలీలోలతన్=యుద్ధక్రీడయందలి యాసక్తితో; శిలాజాలాసారము= రాళ్లవాన; వాతూలాస్త్రము = వాయవ్యాస్త్రము.

62. నిర్జరులు = దేవతలు; ధాత్రి = భూమి; హారిరథప్రదరాహతిచేతన్ = సింహరథుని యాయుధములదెబ్బచేత; ఇందు నరులు మున్నగు వారికి గుండెఁగూడు దిగుట మున్నగునవి స్వాభావికములు.

63. వారణాంబులయట్టులు = ఏనుఁగుల మొండెములు; తొట్టిన=ప్రవహించిన; తెట్టువలఁగట్టిన = ఒకప్రక్కగాఁ జేరిన; అంపకట్టియలు = కట్టెల

వలె నున్న బాణములు; ఎడ్డెతనంబు = తెలివిలేమి; పొలసు = మాంసము; తొడవుల నెడలి = నగలనుండి విడువడి; కండలు=మాంసపుముక్కలు; బరికట్టియలు = అలుఁగులేని యీఁటెలు; కఱుకట్లు = కఱ్ఱలకుఁ గుట్టిన మాంసఖండములు; మిట్టకోలలన్ = చివర గుండ్రనిబంతి (గుండు) గలబాణములచే; గులగులలై = చూర్ణములై; రజోగుణంబు = ఎఱ్ఱఁదనము; క్రందు = కలకలము; పదడు = బూడిద; ప్రదరంబులు = బాణములు; తూము = కాల్వ; అమరించి = ఏర్పఱచి; కాడ = చోట; కూశ్మాండకుమారము = పిల్లపిశాచము; హాసనము = నవ్వు; ఘూకము = గ్రుడ్లగూబ; వ్రచ్చి=చీల్చి; డుక్కి = దాఁగి; మునుపడి = ముందుగా పడి; మానవ...కళేబరంబులు = మనుష్యులకు వాహనములయిన గుఱ్ఱపుపిల్లల దేహములు; సజీవశంకాతంకంబు = బ్రతికి యున్నవేమో యను అనుమానము; గోమాయుపరంపర = నక్కల గుంపు; జర్జరితాంగంబులు = శిథిలములైన అవయవములు కలవి; శరీరప్రోతశరవ్రాతులు = దేహమున గ్రుచ్చుకొనిన బాణముల గుంపులు కలవారు; కోదండంబులు = విండ్లు; నికేతనంబులు = నివాసములు; తనుత్రంబులు = కవచములు; విదారితకూటంబులు = తెగఁగొట్టఁబడిన అగ్రభాగములు కలవి; వేణుశలాకంబులు = వెదురుముక్కలు; పుండరీకంబులు = తెల్లగొడుగులు; శిలీముఖంబులు = బాణములు; మావంతులు = మావటివాండ్రు; యమకింకరాయత్తులు = యమభటులకు స్వాధీనమైనవారు - మరణించినవారు; రాహుత్తులు = రౌతులు; కలనిన్ = యుద్ధభూమిని; గ్రథితము = కూర్పఁబడినది, దందహ్యమానమానసుఁడు = మిక్కిలి దహింపఁబడుచున్న మనస్సుకలవాఁడు.

64. కరుణేక్షణుఁడు = దయతోడి చూపు కలవాఁడు; రౌప్యశైలము = కైలాసము; భక్తజనతామరభూజము = భక్తజనముల కల్పవృక్షము; సుతఘస్మరతా = కుమారులను మ్రింగివేయుట; అఘము=పాపము; దుర్దాంతము = అణఁపరానిది.

67. మొగరేలు = సువర్ణముఖరీనది.

68. గోత్రంబు = పర్వతము; వంచించి = విడిచి.

69. అంబుకణంబులు = నీటిబిందువులు; పవనాశనంబు = వాయుభక్షణము; పరాయత్తబుద్ధిన్ = ఆసక్తి గల బుద్ధితో; భువనభవనము = జగత్తు గృహము.

70. గాంగేయముఖరి = సువర్ణముఖరి; సదాగతి = వాయువు; వాచంయమీశ్వరులు = మునీశ్వరులు; క్రతువు = యాగము; నీలకంఠంబులు = నెమిళ్లు; బిఱుసు = ఆధిక్యము; నాగంబులు = పాములు; ఆభోగభోగంబులు = విప్పారిన పడగలు; ఉడుపన్ = పోఁగొట్టఁగా; విధికిన్ = బ్రహ్మకు.

71. తెప్పున = తటాలున; బోదలు = పిల్లలు; పిడియేనుఁగులు = ఆఁడు ఏనుఁగులు; కేసరి = సింహము; స్తనితము = ఉఱుము.

72. ఆడన్ = అక్కడ; విధాత = బ్రహ్మ; చదువులమ్మ=సరస్వతి; పలుకుఁదోడుగన్ = మాటసాయముగా.

74. కరుణాధారలు = దయారసము ప్రవాహములు; నేత్రకోణములు = కనుగొలుకులు; చిందన్ = చిమ్మఁగా; గోరాజు = నందీశ్వరుఁడు; పరివేష్టించి = చుట్టుచేరి.

75. సురజ్యేష్ఠుఁడు = బ్రహ్మ; భాషానాథుండు = బ్రహ్మ; నిటల... త్వంబునన్ = నొసటిపై నుంచిన దోసిలితోనవుట; కంపము = వణఁకు, రోమహర్షము = గగుర్పాటు.

77. పారము = అంతము; లోకాతీతమై = లోకము నతిక్రమించి; చిదాకృతి = చిదానందస్వరూపము; ఉపశ్లోకింపఁగా = కొనియాడఁగా.

78. కాలధర్మము = ఆయాకాలములఁ జేయఁదగిన ధర్మము; మదన కేళి = మన్మథక్రీడ; సర్వంసహాదేవత = భూదేవి; రోషించినపుడు = కోపింపఁగా.

79. గోత్రము = పర్వతము; ఉషఃకాలంబు = ప్రాతఃకాలము; పంచాక్షరీమంత్రంబు='ఓం నమశ్శివాయ' అను మంత్రము; నూటయెనిమిది సేసి = నూటయెనిమిదేసి; అరవిందనందనుండు = కమలగర్భుఁడు - బ్రహ్మ.

80. నెల, రెణ్ణెల్లకుఁ = ఒకటి, రెండు నెలలకు; త్రిజగన్నిర్మాత = సృష్టికర్త, బ్రహ్మ; చిట్టుములు = ఓకిలింతలు; ప్రభాతేందుమండలము=తెల్ల వాఱుజామున (వెలవెలపోవు) చంద్రబింబము. కౌను = నడుము; డాసెఁ = పొందెను; నెన్నడ = నిండునడక.

81. పుష్పితమల్లి = పూఁచినతీఁగ; పుష్పమంజరులు=పూలగుత్తులు; ఇందిందిరములు = తుమ్మెదలు.

82. కళంకము = మచ్చ, అపకీర్తి.

83. త్రిమ్మరఁగఁ = తిరుగఁగా; ఏకాంతమునఁ = ఒంటరిగా, అప్రార్థితప్రాప్తము = కోరక లభించినది, దీపనాదివ్యథ = దీపనము మున్నగు బాధ; విష్టపవ్యాపకంబు = లోకమున వ్యాపించినది.

84. పద్మభవుండు = బ్రహ్మ; మఖాతారక = మఖనక్షత్రము; నీరజ వైరిశేఖరుఁడు = చంద్రశేఖరుఁడు - శివుఁడు; ప్రమదంబు = సంతోషము.

85. చిద్విధుండు=ఆనందస్వరూపుఁ డగు చంద్రుఁడు, తమ్మిచూలి= బ్రహ్మ.

86. ఈశదయావర్ధితదివ్యతేజము = శివుని దయచేత వృద్ధిపొందిన దివ్యతేజస్సు అయినది.

87. శతపత్రజుఁడు = కమలభవుఁడు - బ్రహ్మ; నిర్మలప్రతిపత్తిఁ= పరిశుద్ధమగు బుద్ధితో.

88. ఖండపరశుండు = శివుఁడు; అవగ్రహరహితంబు = కఱవు లేనిది - సంపత్సమృద్ధము; కలుషాహితంబు = పాపములను దూరీకరించునది.

89. ఆత్మారామత్వము = తనలోఁ దా నానందించుట.

91. ధాత్రీచక్రేశుఁడు = భూవిభుఁడు - యాదవరాజు.

92. కుహనాజంగమతనువు = కపటపు జంగమవేషము; సుధాంశుధరుఁడు = శివుఁడు.

93. చెలఁది = సాలెపురుగు.

94. కైవల్యము = మోక్షము.

95. మర్కటకకీటకము = సాలెపురుగు; గరళకంధరుఁడు=గరళకంఠుఁడగు శివుఁడు; కుంభజ...శరీరము = అగస్త్యపుత్రిక యగు సువర్ణముఖరీజలమున స్నానముచేసిన దేహము; తంతుపంక్తి = దారముల సమూహము.

96. ఆయతనవీధి = గృహములవరుస; పరిణయహేమవైభవనిశాంతము = బంగారు కల్యాణమంటపము; జాలకంబులు = గవాక్షములు; ఇభముఖుఁడు = వినాయకుఁడు; అనలజాతుఁడు = కుమారస్వామి; వటుకుఁడు= కాలభైరవుఁడు.

97. తుషారశీకరచయము = మంచుబిందువుల గుంపు; లసన్మౌక్తికోపేతాగారములు = ప్రకాశించుచున్న ముత్యాలతోఁ గూడిన యిండ్లు; తద్బిందుచ్ఛటాసూర్యతఖద్యోతచ్ఛాయలన్ = ఆ మంచుబిందువుల కాంతియందు చొచ్చిన సూర్యునికాంతులచే; లూతాకల్పితతంతుసద్మములు=సాలెపురుగుచే నిర్మింపఁబడిన దారములయిండ్లు.

98. ఇందులు = ఇండ్లు; త్రెవ్వనపోఁగుల్ = తెగిన దారములు.

99. చెలందినేమము = సాలెపురుగు నియమము; లలాటాక్షుఁడు = శివుఁడు; దీప...బరమై - దీపశిఖాకీలా = దీపాగ్నిజ్వాలలయొక్క; అభీల =

భయంకరమై; తీవ్ర = ఎక్కువైన; ప్రభా = కాంతిచే; వ్యావిద్ధాంబరమై= చొచ్చుకొనఁబడిన ఆకాశము కలదై.

100. సదనంబులు = గృహములు; గుదె = గుదియ.

101. అఱునే = నశింపదు; ఆటమటము = వ్యాకులము.

102. మీఱింబోవన్ = విజృంభింపఁగా; కెంగేలునన్ = ఎఱ్ఱని హస్తముతో.

103. ప్రమథపతి = శివుఁడు.

104. శ్రుతులు = వేదములు.

105. భవదుఃఖంబులు=సంసారదుఃఖములు; కైవల్యము=మోక్షము.

106. అనిమిషకోటి = దేవతల సమూహము; అహరహంబు=ప్రతి దినము; రోయన్ = ఏవగింపఁగా; అన్యదర్శనరతులు=ఇతర నిగమములయెడ ఆసక్తికలవారు-ఇతర దైవతములను చూడఁ గోరిక కలవారు సమయసంగతి= ఆగమనియమసంబంధము.

107. అహిపుఁడు = నాగాధిపతి; రవముల్ = ధ్వనులు; ఊర్ణనాభము = సాలెపురుగు.

108. లూతాధీశ్వరుఁడు = గొప్ప సాలెపురుగు; మహా...నిర్ఘాతములు = గొప్ప పాపములను పర్వతములకు వజ్రాయుధము లైనవి.

109. కాలఫణి = నల్లతాచుపాము; బాలేందుచూడార్చనల్ = చంద్రలేఖను ధరించిన శివుని పూజలకు; హస్తిశ్రేష్ఠము = గొప్ప యేనుఁగు.

110. కేతకినది = సువర్ణముఖరీనది - మొగలేఱు; తోఁగి=మునిఁగి; కానలు = అడవులు; మాలూరశాఖలు = మారేడుకొమ్మలు; నాళీకకహ్లార కుముదపుష్పంబులు = తామర, ఎఱ్ఱకలువ, నల్లకలువ పువ్వులు; పోఁద్రోచి= త్రోసివేసి; తోయములు = నీళ్లు; ధరణీధరము = కొండ; మజ్జనముచేసి = స్నానముచేసి - స్నానముచేయించి; పాపఱేఁడు = పాముల రాజు; నిజ...

దీప్తి=తన పడగ చివరి గొప్ప మాణిక్యముల కాంతి; తపనుఁడు=సూర్యుఁడు; ఉషఃకాలతమముల్ = ఉదయకాలమందలి చీఁకటిని.

111. గగ్గులకాటల్ = కంపతో; ఎగ్గు = అపకారము.

112. ఎడఁద = మనస్సు; ఈసు = అసూయ. మల్లాడల్ = మల్లడి గొనఁగా - పెనగొనఁగా; వాతాశనము = పాము.

113. రత్నసంక్రాంతశరీరుల్ = రత్నములతో కూడుకొన్న దేహము కలవానిని; అజ్ఞతాసంతమసంబు = అజ్ఞానాంధకారము; ఎకసక్కెము = వేళాకోళము; భ్రాంతులు = భ్రాంతిపొందినవారు - బుద్ధిచెడినవారు; కపర్ది= శివుఁడు.

114. ఎప్పటి యనువులర్=ఎప్పటిరీతిని; పనివడి = ప్రయత్నించి- లేక - అత్యంతము; దంతి = ఏనుఁగు.

115. బిల్వ ..నాంగము - బిల్వవిటపశ్రేణీ=మారేడుచిగుళ్ల గుంపు; సనాళ = కాడలతోఁగూడిన; అబ్జభేద = తామరలు, కలువలు మున్నగు వానిచే; విలీనాంగము=మునిఁగిన దేహము కలది - నిండిన స్వరూపము కలది; సఖేదస్వాంతము = విచారముతోఁగూడిన మనస్సు కలది; ఎల్లియుల్=జేఁపు కూడ; కొల్లంబోయినల్ = పాడయినచో.

116. దుర్మదుండు = మదాంధుఁడు; జగతీరుహశాఖలు = చెట్ల కొమ్మలు; తమ్మి = తామర; కొంచువచ్చి = తీసికొనివచ్చి.

117. కంటకము=ముల్లు; నాక = అనక - సరికాదనక; పార్వతీ... సంగతిల్ - పార్వతీ = పార్వతీదేవియొక్క; కంటకిత=గగుర్పాటుపొందిన, అంగ = శరీరముయొక్కయు; బాహులతికాయుగ = తీఁగలవంటి రెండు బాహువులయొక్కయు; సంగతిల్ = సంబంధముచే; దుఃఖ...కాండములు= కష్టమును కలిగించు ముండ్లతోఁగూడిన మారేడు, తామరకాడలును.

118. అత్రేశుఁడు = శివుఁడు; దంతికృతపూజల్ = ఏనుఁగు చేసిన పూజలను; అనర్ఘ్యరత్నములు = విలువైన మణులు; చక్షుశ్శ్రోత్రము = పాము. తదంతరాయజనితోన్మాదంబునన్ = ఆ పూజావిఘ్నమువలనఁ గలిగిన వైకల్యముచేత; దూఱుచున్ = నిందించుచు, వివరములోనికి ప్రవేశించుచు.

119. భోగవతీర్ఘురంబు = భోగవతి యను నది; పొత్తులన్ = ఒకరిప్రక్క నింకొకరుగా; తొలఁగి = విడిచి; పర్యంకసీమలు = పడకలు; మసకానన్ = మసకమున - సురతమున; జాగరమ్ము = మేలుకొనియుండుట.

120. అనేకపము = ఏనుఁగు; చలంబు = పట్టుదల.

121. నీలవర్ణచ్ఛదావలి = నల్లనిరంగు గల తాళ్లసమూహము; అరుణాశ్మఖండములు = ఎఱ్ఱని తాలిముక్కలు; విచ్చిన = వికసించిన; ఉపలంబులు = తాళ్లు; అచ్చుదల = అంగీకారము.

122. ఉనికి = నివాసము; శిలోచ్చయంబు = పర్వతము; నిజయోష = నీభార్య; రథీకృతరత్నగర్భ! = రథముగాఁ జేయఁబడిన భూమి కలవాఁడా! శిలాశకలమండపము = రాతిముక్కల నగ.

123. రేపాడి = ఉదయము; అర్చావ్రతహంత = పూజానియమమును నశింపఁజేసినవాఁడు.

124. భర్గునకున్ = శివునకు; ఎల్లి = రేపు; ఇందునకున్ = దీనికి; తీపు = తీపి - ఆశ.

125. పిడి యేనుఁగులు = ఆఁడేనుఁగులు; ఉడుగని = విడువని; వెడవిల్తు వేఁడిమి = విరహతాపము; తెమలని = కుదురుపడని - నశింపని; మిహిరదాహము = సూర్యుని వేఁడిమి; మెసఁగక = తినక; వెట్టలు = ఉష్ణతలు; పంచబంగాళమై = చెల్లాచెదరై; చింత యన్ వేఁకి = విచారమను జ్వరము; లోను చేసికొనియెన్ = స్వాధీన పఱచుకొనెను.

126. ఆత్మసీమమునకుఁ = తన స్థానమునకు; బుగ్గిగుడు అయ్యెఁ = మునిఁగియుండు.

128. ప్రాగ్వధూమణి = తూర్పుదిక్కను కాంత; చెంగల్వ బంతి = ఎఱ్ఱకలువబంతి; చరమాద్రి = పడమటికొండ; మహీరుహము = చెట్టు; రథాంగము = బండి - చక్రము, సెలపంజ = సంధ్యారాగము; చందురుకావి పచ్చడంబు = చంద్రకావి (ఎఱ్ఱ) శాలువ.

129. తారాలోకము = నక్షత్ర సమూహము; తమః పటల సంతానంబు = కాఱుచీఁకట్ల సమూహము; గళ దశ్రుధారలు = కాఱు చున్న కన్నీటిధారలు; కల్హారవ్రాతము = ఎఱ్ఱకలువల గుంపు; లోకనయ నుండు = సూర్యుఁడు.

130. తిమిరము = చీఁకటి; గుహాలీఁగి = గుహాలలో దూఱి; అభ్రము = ఆకాశము; పన్నగలోకము = నాగలోకము; పతంగదేవుఁడు= సూర్యుఁడు; తుత్తుమురుగఁ = శిథిలము లగునట్లుగా.

131. విపులాలవాలము = భూమి యను ఆలవాలము - పాదు వేళ్వారి = వ్రేళ్లు పాఱి; శాఖల్ = కొమ్మలు; వియత్తలము = ఆకాశము; తారల్ = చుక్కలు; తదీయ...క్రియఁ - తదీయ = దానియొక్క; పలాశాంతర = ఆకుల నడుమ; దర్శిత = చూపఁబడిన—కనఁబడిన; ఊర్ధ్వ భువన = పై లోక మను భవనము యొక్క; ఉద్యత్ = ప్రకాశించుచున్న; దీప్తిఖండక్రియఁ = కాంతివేశమురీతిని.

132. నిర్జరాధీశ్వరాదికులు = ఇంద్రాదులు; అభవుఁడు = శివుఁడు; అద్దేవుండు = ఆ విష్ణువు; శశాంకాకృతిఁ = చంద్రుని యాకారమున. అలం. ఉపమ.

133. ఉదయగ్రావము = తూర్పుకొండ; అభిషేకోద ప్రవా హంబు = అభిషేకము చేసిన నీటి ప్రవాహము; వార్ధి = సముద్రము;

కౌముది = వెన్నెల; తారానివహంబులు = నక్షత్రముల గుంపులు; అర్పిత సుమంబుల్ = పూజ చేసిన పుష్పములు; శీతగభస్తి బింబము = చంద్రబింబము. అలం. రూపకము.

134. గగనాహార్యమృగేంద్రశాబకము = ఆకాశ మను కొండ పై నుండు సింహపు పిల్ల; నక్షత్రాంబు......హంసంబు=నక్షత్రములను తామరల నడుమ నుండు హంస; నిశా...గుచ్ఛము = రాత్రి యను వనిత చేతిలోని మల్లెపూగుత్తి; అధ్వగ...చ్ఛత్రము = బాటసారులకు బాధను కలిగించు మన్మథుని ప్రదేశమునకు పోవుటకైయిన ముత్యాలగొడుగు; తొల్దెసన్ = తూర్పుదిక్కునందు. అలం. ఉపమ.

135. గరుడా నీతసుధాఘటంబు = గరుడునిచే తీసికొనిరాఁబడిన అమృతకలశము; నిర్జరశ్రేణి = దేవతలగుంపు; చూడారత్నసందోహము; తలపైఁ గల మాణిక్యముల గుంపు; ఉడూత్కరము = నక్షత్రములగుంపు; చిందు = చిందుచున్న.

136. కుముదవనాళికిన్ = కలువల గుంపునకు; బలుపు = బలకరము; కోకములాట = చక్రవాకముల సయ్యాట; దిగ్వధూ సమితికిన్ = దిక్కులను స్త్రీలగుంపునకు; పూఁత = మైపూఁత; నవశాబచకోరక రాజికిన్ = క్రొత్తవైన చాతకపక్షులగుంపునకు; మేఁత = ఆహారము; ఇందుకాంతములు = చలువ రాళ్లు; దర్పక శాస్త్రము = కామశాస్త్రము.

137. మహా...వేదనన్ = గొప్ప పూజావ్రతమునకు విఘ్నము కలుగు నను విచారమువలని బాధచేత.

138. పూర్వాద్రి = తూర్పుకొండ; నీపప్రసూనము = కడప పువ్వు; అభిరామము = మనోహరము; భాను...పంకము - భానుభిల్ల = సూర్యుఁ డను భిల్లునియొక్క; గభస్తిభల్ల = కిరణములను బల్లెములచే; భగ్న= ఛేదింపఁబడిన; తమోఽచ్ఛభల్ల = చీఁకటి యను ఎలుఁగుబంటి నుండి; నిర్యత్ = జాఱుచున్న; రక్తపంకము = బురదరక్తము; పద్మరాగప్రభా పట

లము = కెంపుల కాంతిగుంపు; ద్యుమణిశిఖి = సూర్యుఁ డను అగ్ని; అరుణశోణాంశురాజి = అనూరుని యొక్క ఎఱ్ఱని కాంతిపుంజము - సంజ కెంజాయ. అలం. ఉత్ప్రేక్ష, రూపకమును.

139. పన్నగంబు = పాము; కర్మసాక్షి = సూర్యుఁడు.

141. కుంభీనసవల్లభుండు = పాముఱేఁడు; పేర్చిన = అతిశయించిన; కటారుకాని చంచానన్ = వీరునిరీతిని; కదిసి = సమీపించి.

142. తీర్తున్ = చంపుదును; నిటలాక్షుఁడు = శివుఁడు.

143. పిన్నరూపము = చిన్నరూపు కలది; బిల్వశాఖ = మారేడు కొమ్మ; అంబుజనాళము = తామరతూఁడు; దంతి = ఏనుఁగు.

144. విఘ్నకర్త = విఘ్నమొనర్చువాఁడు; సంత్రాసము=భయము; కళానిధిశేఖర మౌళి = చంద్రశేఖరుఁడు - శివుఁడు.

145. దాయ = శత్రువు; రోషదహనశిఖలు = క్రోధాగ్నిజ్వాలలు; ఇభవరుండు = గజరాజు; కాన = అడవి.

146. నీరేరుహామాలూర దళభరంబులు=తామరపూవులు; మారేడు పత్త్రియు; సమీరంబు = వాయువు; నడలచప్పుడు = నడకలధ్వని; నిర్మాల్యంబు = వెనుక పూజ చేసిన పూవులు మున్నగునవి.

147. శుండాలంబు = ఏనుఁగు; భర్గుండు = శివుఁడు; ముక్కుంగ్రోళ్లలోన్ = నాసికారంధ్రములలో; కుంభకుహరస్థానంబు = గుహావంటి కుంభస్థలము; గీపెట్టుచున్ = ఘీంకరించుచు.

148. మొగలేరు = సువర్ణముఖరీనది (చూ. ప. 67). కలఁగంగన్ = కలఁతపడఁగా; పెడమర్లుగాన్ = వెనుకకుఁ దిరుగునట్లుగా; పొడపెట్టి = రూపముంచి - ఉండి యనుట. ఉడివోని వేదనన్ = తీరని (తగ్గని) బాధచేత; ఉన్నచో నుండక = ఉన్నచోట నిలువక; సామజంబు = ఏనుఁగు; వెరవు = ఉపాయము.

149. ఏను = నేను, ఉమాధీశోపకంఠంబునన్ = శివుని సమీప మున; ఉరగేంద్రంబు = పాము; అవాచీనస్థాణునగంబె = దక్షిణకైలాస పర్వతమే.

150. చిత్తజాహితుఁడు = శివుఁడు; కాళము = పాము; వీకను మన్ = విరంధ్రముసుండి; తుండను = తొండము; ఇఱియంగాఁ జుట్టి = దగ్గఱగా - కుదిసియుండునట్లు చుట్టి వక్త్రస్థలంబునన్ = నోటిలో; పిఱిం దికిన్ = వెనుకకు; కూటంబులు = చరియలు; ఊటాడఁగన్ = చలింపఁగా.

151. గుండులు = గుండ్రాళ్లు; పడియె గట్టి = గద్దకట్టెను—'పడి యగట్టి' అను పాఠమున రక్తయతోడి పల్ల మేర్పడె నని చెప్పవలెను; అపుడు 'పడియె' అని అధ్యాహారముచేయవలెను.

152. కాద్రవేయము = పాము; భద్రగజంబు = గొప్పయేనుఁగు; హృషీకేశుఁడు = విష్ణువు; బర్హిర్ముఖులు = దేవతలు.

153. కలశీ...రుహా! = అగస్త్యపర్వతముపుత్రిక యగు సువర్ణ ముఖరీనదియొద్దుల నున్న కల్పవృక్షమా! జ్ఞానప్రసవాచలకన్య=జ్ఞానప్రసూ నాంబిక యను పేరి పార్వతి; పరిరంభణము = ఆలింగనము; పరితోషిత = సంతోషించువాఁడా! భవబంధవిమోచన = సంసారబంధమును విడుదల చేసినవాఁడా! సంవిత్సుఖము = జ్ఞానమువలని ఆనందము; మోదాపాదక= సంతోషమును కల్గించువాఁడా! నిక్షిప్తవిపచ్ఛేదక = ఆపదలను నశింపఁ జేయువాఁడా! కలుషేంధనపావక = పాపము లను కట్టెలకు అగ్ని యైన వాఁడా! రమా వాగ్దేవీవల్లభులు = విష్ణువును బ్రహ్మయు; సోహమ్ము = ఆ బ్రహ్మమునే నేను; దాసోఽహమ్ము=నేను నీ సేవకుఁడను; కుండలి = హృద యస్థ ముగు పాము; మారుతము = ప్రాణవాయువు; చిద్రూపము = ఆనంద స్వరూపము; నిధి = నిధానము - గొప్పగని; అర్థము = ధనము - వస్తువు; భవ దుర్వాసన = సంసార మను చెడ్డ జన్మాంతరవాసన; వాసింపక = నివసింపక; చవులు = రుచులు; కఁదవు = చలింపవు; మరగింపక = లొంగునట్లుచేయక.

154. ఈఁదీది = ఈఁదియీఁది; ఆసల్ = కోరికలు, ప్రాణప్రయాణోన్ముఖాయాసంబుల్ = ప్రాణములు పోవుచున్నప్పటి శ్రమలు; మిథ్యా సౌఖ్యంబులు = సుఖాభాసములు.

155. వ్యాయామంబు = విశాలమైనది; అదృశ్యవస్తువు = అవాఙ్మానసగోచరము; పుష్కరప్రాయంబు = ఆకాశమయము.

157. నీలగ్రీవుఁడు = శివుఁడు; జీవేశ్వరులు = భర్తలు.

158. కామ...అర్క = కామము, క్రోధము, మదము మున్నగు నంధకారసమూహమునకు గొప్ప సూర్యుఁడగువాఁడా! వేధో...ప్రపంచా = బ్రహ్మాండముల నాశనకాలమునందలి తాండవమున తిరుగుడువడి నశించు ప్రపంచము కలవాఁడా! పుర...ప్రభావ = త్రిపురముల గొప్పతనమును నశింపఁజేయు ప్రభావము కలవాఁడా! దశదిక్చేల = దిగంబరా!

159. లుంటీకృతాఘ = నశింపఁజేసిన పాపములు కలవాఁడా! ముక్తి...రత = ముక్తికాంతా గాఢాలింగనమున ఇష్టము కలవాఁడా! చిద్విద్యా...చర = ఆనంద విద్య యను రాజమార్గమున తిరుగువాఁడా! తారకఘంటారవ = తారకమంత్రపు గొప్ప ధ్వని కలవాఁడా! వ్యాధేశుఁడు = వేఁటకాఁడు.

160. దివా...మండితా - దివానిశోదయావసాన = రాత్రింబగళ్లు, ఉదయాస్తమయములు; దిగ్వితాన = దశదిక్కులు, అనువానిచే; మండిత = అలంకరింపఁబడిన; అజవంజవాంధకార = సంసారాంధకారమున; సత్యసంవిదభ్రమండితా = సత్య మగు జ్ఞాన మను ఆకాశముచే అలంకరింపఁబడిన వాఁడా! దివా...ధవా = సూర్యాదిగ్రహములకు గొప్ప కాంతి నిచ్చుటచే; వాగ్ధవాండభాసక = బ్రహ్మాండమును ప్రకాశింపఁజేయు; ఆదితత్త్వ= తొలి తత్త్వమయిన; తారకేషుపాధవా = నక్షత్రచంద్రులు కలవాఁడా!

## తృతీయాశ్వాసము

1. శ్రీధర...రాజీవ - శ్రీధర = విష్ణువుయొక్క; నయనాబ్జ = పద్మనయనములచే; సమారాధిత = పూజింపఁబడిన; దివ్యాంఘ్రిశోణరాజీవ! = ఎఱ్ఱని పాదపద్మములు కలవాఁడా! మనో...వైద్య - మనోబాధావహ = మనస్సునకు బాధను కలిగించు; సంసార = సంసారమనెడి; వ్యాధివ్రజ వైద్య = వ్యాధులసమూహమునకు వైద్యుఁడయినవాఁడా! విష్ణువు శివునిఁ బూజించుటకు సహస్రకమలములలో నొకటి తక్కువ కాఁగా, తనకంటిచే నర్చించె నని శైవపురాణకథ. దీనిచే ఇందు తిన్నఁడు తన కంటిని శివుని కర్పించు విషయము సూచితము; సంసారరోగమునకు వైద్యుఁడని చెప్పుటచే నత్కీరునికథ సూచితము.

2. కారుణ్యరసపూరితేక్షణములన్ = దయామయదృష్టులతో.

3. పొత్తపినాఁడు = పొత్తపి ముఖ్యగ్రామముగాఁ గల సీమ; ఈయూరు కడపమండలములో నున్నదఁట! ఆటపట్టు = నివాసము; లోకోత్తరవన్యవస్తువు = గొప్ప అడవివస్తువులు కలది; పక్కణము = బోయపల్లె; తద్రమోదాత్తమహత్త్వము = ఆయూరి గొప్పసంపద; మేదినీ...... వాహమై = కొండచరియలఁ బ్రవహించు నదులలోని తామరపువ్వుల పరిమళముతోఁ గూడిన వాయువు కలదై. అలం. ఉదాత్తము.

4. స్తబ్ధరోమవిషాణములు = పందికొమ్ములు; ముక్త...ఫలంబులు = పాముల తలలలోని మణులు; కురువిందులు = గురివెందలు; వేణుజాతములు = వెదుళ్లనుండిపుట్టినవి; గంధ...చయము = కర్పూరము, అగురు మున్నగువృక్షములకట్టెలు; పందికొమ్మున్నగువానినుండి ముత్యములు లభించు నందురు; పందికొమ్ములనుండి లభించు ముత్యములు రేఁగుపండ్లంత ఉండు ననియు, పాముల శిరోమణులు గురిగింజలంతేసి యుండు ననియు, ఏనుఁగు కుంభములలోని ముత్యములు ఉసిరికకాయలంత ఉండు ననియు, వెదురు ముత్యము లాఁదుగపండ్లంత ఉండు ననియు భావము.

5. సంకుమదంబు = మృగమదము - ప్రత్యహముఁ = ప్రతిదినము; కూలంకష = నిండుగా; తదీయభూతి = దాని సంపద.

6. పాఱుటాకులు = ఒకవిధమైన ఆకులు; భారము = బరువు; ఏటికిఁ = ఎందులకు ?

7. అగురుత్వామహాకాష్ఠఖండములు = అగురుచెట్టుకట్టెలు; మృగనాభి = కస్తూరి; ధమ్మిల్లంబు = కేశపాశము; పెఱబొమ్మలు = పక్షులు భయపడుటకై చేయు దిష్టిబొమ్మలు; తవిదచేలు = రాగిచేలు.

8. ఆరఁబములకుఁ = పైరులకు; పసరంబు = పశువు.

9. వరాహపంక్తులు = పందిమూఁకలు; ప్రోగుఁద్రాళ్లు = వేఁటల కుపయోగించు ఒకవిధమైన త్రాళ్లు.

10. మంచెలు = పొలములందలి ఎత్తయిన ఆసనములు; కటిమండలిఁ = మొలలందు; వ్రేయుదురు = కొట్టుదురు; ఒడిసెళ్లఁ=పక్షులనుకొట్టు సాధనములగు త్రాళ్లచే; బాహుమూలాంచితదీధితుల్ = చంకల నిగనిగలు; పర్వఁగఁ = వ్యాపింపఁగా.

11. మదపుంస్కోకిలము = మదించిన మగకోయిల; వేఁటలాడు = వేఁటకువచ్చిన; ఎఱుకుగోవాళుల్ = యువకులగు బోయలు; ప్రసూనా... వృత్తులు=మన్మథునిబాణములచే ప్రేరింపఁబడిన మనోవ్యాపారము కలవారు.

12. శబరకాంత=బోయెత; శాతకుంభకుంభయుగములఁ = రెండేసి బంగారు గిండ్లయందును; కరకరి = కలఁతపాటు; అజునకైనఁ = బ్రహ్మకును.

13. మోవి = పెదవి; కబరీభరము = తలకట్టు; అబ్బురపుఁగౌను = ఆశ్చర్యముగొలుపు నడుము.

14. అధరమధురిమ = పెదవితీయఁదనము.

15. తెరువుకొని = దారియాయని - సందీయనట్టి; బర్హాంబరము = నెమలిపురివస్త్రము; వీఁకగల = బలమైన; కుఱుచగేసుపులవెదురువింటఁ =

చిన్న చిన్న (దగ్గఱగా) గనుపులు గల వెదురుతో చేయఁబడిన వింటిలో; చాఁగపురి = చాఁగనారదారము; సంతరించి = కూర్చి; గసికకోలలు = కొయ్యమేకులబాణములు; ఆత్మనాయకులు = తమ భర్తలు.

16. సామ్యవర్గము = పోలికలు; పాటింపంగనో = చూడఁదలఁపు ననోయేమో! నిజాగారంబులన్ = తమయిండ్లయందు; హరిణము = జింక; ఇభశాబము = గున్న యేనుఁగు; అలం. ఉత్ప్రేక్ష, క్రమము.

17. ఆలవాలంబు = మూలము - నివాసము.

18. హర్యక్షము = సింహము; అక్షీణగరిమ = తక్కువకాని గొప్ప తనము; కాంతారదంతావళము = అడవియేనుఁగు; నవీనవైధవ్యకరము = క్రొత్తగా వైధవ్యమును కలిగించునది; కురంగ...యశము = జింకదంపతుల గుంపుల సంసారములను నశింపఁజేయుటలో గొప్ప కీర్తికలది; మృగాదనము= ఒకజాతిమృగము; ప్రాణగంధవాహము=ప్రాణవాయువు; దందశూకేంద్రము= పాములరాజు; నారాచబృందవర్షము = బాణపరంపరల వాన; కంధరము = మేఘము; కోదండము = విల్లు; అరణ్యభూనాథుఁడు = ఆటవికరాజు.

19. సర్వలోకేశుఁడు = శివుఁడు; పుళిందవిభుఁడు = బోయలఱేఁడు.

20. గిరికందరసానువనీ నిర్ఝరములన్ = కొండగుహలు, చరియలు, అడవులు, సెలయేళ్లు - మున్నగుచోటులందు.

21. మందస్మితజితకుంద = చిఱునవ్వుచే గెలువఁబడిన మల్లె కలది- మల్లెపువ్వును బోలిన నవ్వు కలది. ఉపగూహనము = కౌఁగిలింత; వచనామృత నిష్యంద = వాగమృతప్రవాహము కలది; సెలమసలెన్ = సెల తప్పెను.

22. భసితాంగరాగము = బూడిదమైపూఁత; ప్రతివచ్చు=సమాన మగు; ఆనన పాండుగరిమ = ముఖముయొక్క గొప్పతెల్లఁదనము; హాలాహల కాళిమచ్ఛవి = విషముయొక్క నల్లనికాంతి; అణుతరంబు = మిక్కిలి సూక్ష్మము; సరభసానంగసంక్రీడ = తొందరపాటుతోడి రతి.

23. మృగరాజమధ్య శృంగారగరిమ = సింహామధ్యమువంటి మధ్యముయొక్క ఎక్కువ యందము.

24. పంచాననము = సింహము; అనేకపము=ఏనుఁగు; వ్యాఘ్రము= పులి; కోలము = పంది; శైలోపకంఠనిర్ఝరసైకతస్థలి = కొండలదరి నున్న ఏటి యిసుకతిన్నెలుగలచోటు; ఖండేందుశేఖరుఁడు = శివుఁడు; గండూషితాంబు ధారలు = ఉమిసిన నీటిప్రవాహములు; ఘోణిమాంసమ్ము = పంది మాంసము. గర్భస్థుఁడగు శిశువు (తిన్నఁడు) మునుముందు చేయఁబోవు పనులిందు సూచింపఁబడినవి, గర్భవతికిఁ గలుగు కోరికలు, ఆమె చేష్టలును శిశువు లక్షణమును తెలుపు నని యభిజ్ఞుల యాశయము.

25. సొమ్ములు = నగలు; ఒద్దిక = చేరిక; శ్రాంతి = ఆయాసము.

26. బిడ్డకుట్లు = నొప్పులు; భిల్లపురంధ్రులు = ఆటవికస్త్రీలు; నిలువఁగనీకురే = నిలువనీయకుఁడు.

27. శివభక్తి, మును పైన = తొట్టతొలుతనే శివభక్తి గల; జంబాలంబు = బురద. అంతరంగమలాపహంబు = మనోమాలిన్యమును పోఁగొట్టునది; కడ్పునకుఁ బెట్టి = కుడిపి.

28. జ్ఞాన...సుషుప్తుండు = జ్ఞానప్రసూనాంబిక భర్తయైన శివుని పాదధ్యానమువలని గొప్పసౌఖ్యమున గాఢనిద్ర పొందినవాఁడు; ఘస్రంబులు = దినములు.

30. శివభక్తిరహితము = శివభక్తి లేనిది; ధృతి = ధైర్యము; విదుల్చుకాడఁజొచ్చెన్ = విదలించి యాడసాఁగెను. [ఇచట విదుల్చుకొని, యాడఁజొచ్చె యనుటకు బదులు—'వ్యావహారికముగ 'విదుల్చుకాడఁజొచ్చె' అని ప్రయుక్తము]. భవపరాఙ్ముఖుఁడు = సంసారము చూడని వాఁడు - ఒల్లనివాఁడు; బోరలఁబడియెన్ = బోర్లపడెను; శ్రేయోమహారాజ్యము = కీర్తిసామ్రాజ్యము; వసుంధరాస్థలము = భూమి; విశ్వపతితత్త్వము=శివతత్త్వము; దర్పకారి = శివుఁడు.

31. అనూనంబులు = గొప్పవి; కల్యంబు = ప్రారంభము.

32. కటి = మొల; గుంజాబీజసంకీర్ణ మేఖల = గురిగింజలు కూర్చిన మొలత్రాడు; మయూరపక్షలతికాకాండంబులు=నెమిలిపురి యీఁకలగుంపు.

33. ఉద్దించుకొఁడెక్ = ఎక్కువ యుత్సాహముతో నాఁడెను.

34. కొంచెపు వింటిబ్రద్ద = చిన్న విల్లు; బరిగోలలు = అలుగులు లేని బాణములు; సలంఘనగతిక్ = ఛంగున గంతులువేయు గమనమున; లుబ్ధకుల్ = వేఁటకాండ్రు.

35. వీఁక = బలము - శక్తి; తడవిల్లు = తడబద్దలతో చేసిన విల్లు; సెలసువిల్లు=సెలసుకఱ్ఱతోఁ జేయఁబడిన విల్లు; చేఁగవిండ్లు=బలమైన ధనుస్సులు.

36. మృగయా=వేఁట; తెఱంగు = పద్ధతి; ఎఱుకుతేఁడు=బోయెల దొర; ఆటవిక పుటభేదనంబు = బోయపల్లె; అనుపమ = సాటిలేని; ఇంద్ర నీల నీలకుటిలకుంతల జాల ఫాల పట్టికలు = ఇంద్రనీలములవలె నల్లనై వంకరగా నున్న జుట్టుతోడి నొసటి భాగములు; మంజరీ మంజులు = పూ గుత్తులచే మనోహరములైన; బిస...దండంబులు = తామరతూండ్లచే అలంక రింపఁబడిన; భుజములు; అవతంసీభూత = అలంకరింపఁబడిన; జఘనంబులు= మడికట్టులు; కురువక ప్రసవగుళుచ్ఛంబులు = గోరింట పూలగుత్తులు; లాక్షా రసంబులు=లత్తుకపూఁతలు; సాటువ=సామ్యము - పోలిక; తుటారించు = తిర స్కరించు; మరునమ్ములు=మన్మథుని బాణములు; చమరు, బౌసటంబు=రాచిన ఒకవిధమగు లేపనము; వనచరవనరుహనయనలు=ఆటవికస్త్రీలు; గునుకుంబ్రాలు = ఒకవిధమైన యడవి ధాన్యము; కీచకతండులంబులు = వెదురుబియ్యము; కొట్రఁబోసి=ఎసరుపోసి; ఉప్పి=ఆవిరితో ఉడికించి; ఆవించిన=ఆవిరికిఁబెట్టిన; కాళింగభంగ=పుచ్చకాయముక్కలు; లశున= వెల్లుల్లి; పిశితంబు=మాంసము; వెసళ్లు = వంటకుండలు; ఆటికలు = చిన్నకుండలు; గుడా...కలశంబులు = ద్రాక్ష, బెల్లము, ఇప్పపువ్వు, తాడి, యీత, బియ్యము - మున్నగువాని నుండి

తీసిన మద్యముల కుండలు; వనక్రోడము = అడవిపంది; తామ్రచూడము= కోడి; మహిషము = దున్న; అజ = మేఁక; అవి = గొఱ్ఱె; బంతి = వరుస; మొఱయించు = ధ్వనిచేయు; మ్లేచ్ఛులు = కిరాతులు; సరకట్లు = వీణె మెట్లు; గుమ్మెట = తుడుము.

37. ఉదకమాడి = స్నానముచేసి; ఒక్కప్రొద్దు = ఉపవాసము; చతురలంకారములు=నలువిధముల నగలు - కర్ణాభరణ, కంఠాభరణ, హస్తాభరణ - పాదాభరణములు. కైసేయుము = అలంకరించుకొనుము.

38. తొడి = తొడిగి; కట్టుక = కట్టుకొని; శిరోపరిష్ఠనీలాలకంబులు = తలపై వృద్ధిపొంది - పెరుఁగుచున్న నల్లని ముంగురులు; పితృస్వాంతంబులు = తలిదండ్రుల మనస్సులు.

39. విరిదండలు = పూలమాలలు; జోతులు = దీపములు.

40. ప్రణతులు = నమస్కారములు; పక్కణము = బోయపల్లె.

41. వ్రీడావిహీనులు = సిగ్గులేనివారు; తొడరి = యత్నించి ఉపదంశభాండముల్ = ఊరుగాయలకుండలు; మృగయాధిదైవతయాత్ర = కాట్రేనిజాతర; సానములుచేసి = త్రాగి.

42. ఉపనాథుఁడు = విటుఁడు; అధికాసవము=ఎక్కువ మద్యము; అల్లాతనిన్ = ఆ విటుని; హాలాతురతాత్మికాకృతిన్ = మధుపానమువలన ఆతురమైన మనస్సు కలదానివలె.

43. పుచ్చుక = తీసికొని; ఉగ్మలి = స్త్రీ; మక్కువ = ప్రీతి.

44. మధుపుకుండలన్ = కల్లుకుండలయందు.

45. విడిసి = ప్రవేశించి; మీనాంక...లీలన్ - మీనాంకసరోజరాగ = మన్మథుని పద్మరాగములతో; కలిత = కూడిన; ఆభరణాంతర = నగలోని; నీలలీలన్ = నీలమాణిక్యమువలె; హాలాం...ద్యుతుల్ - హాలాంకురిత = మద్యమువలనఁ గలిగిన; అరుణచ్ఛవి=ఎఱ్ఱనికాంతితో; సమంచిత =

ఒప్పుచున్న; లోచనతారకద్యుతుల్ = కనుపాపలకాంతులు; పెక్కువన్ = ఆధిక్యముచేత.

46. ఆమోదమేదురవినోదంబులన్ = సంతోషముచే ఎక్కువయిన వినోదములతో; నిషాదమిథునంబులు = బోయదంపతులు; ఆఖేటకంబు = వేట; పాటి = సమానము; ప్రోగుచుట్టలు = త్రాళ్లచుట్టలు; దొడ్డివల = మృగములు గుంపులుగా పడుట కుపయోగించు వల; కృష్ణకురంగంబు = జింక; దిద్దిన = తయారుచేసిన; ఓరణంబు = ఒకజాతి డేగ; సెలకట్టెలు = ఒకజాతి డేగలు; సాళువంబులు = డేగలు; వేసడంబులు = కంచరగాడిదలు; గిద్దలు = ఒకజాతిడేగలు; విడివేట = పక్షులపై పక్షులను విడిచెడు వేట; కేరజంబు = పొంచి వేటాడుపక్షి; సాదివేట = పెంపుడుపిట్టల నొకచో నుంచి, వానిధ్వనులచే ఇతరములైన పిట్టల నాకర్షించి చేయునట్టి వేట; శరము = బాణము; శరాసనము = విల్లు; టెంకి = స్థానము.

47. ఉగ్రసత్త్వంబులు = క్రూరమృగములు; సారమేయము = కుక్క; స్థబ్ధరోమంబులు = అడవిపందులు; దీమంబు = మచ్చుమృగము, లేకమచ్చుపిట్ట; అదను = ఉపాయము; తూపు = పూనిక.

48. కరటిపోతములు=ఏనుగుగున్నలు; కిటుల్ = పందులు; కొర్నవ గండ్లు = కొరసానిగండ్లు.

49. మెకము = మృగము.

50. ఏకలంబులు = పందులు; కమర్చి = వెంట్రుకలు కాల్చి; పెంచులన్ = కుండపెంకులలో; చివ్వచున్ = వేయుచు; ఏర్చి = కాల్చి; కఱకుట్లు = కఱ్ఱలకు గ్రుచ్చిన మాంసములు; కల్లువృక్షలనీడ = కపీతనవృక్షముల నీడ.

51. ఇంజెట్లు = ఒక తెగ కందలు; పెరతేనియలు = పట్టుతేనెలు.

52. పూర్వావనిభృత్తటాటవులు = తూర్పుకొండ సమీపమందలి యడవులు, పాళియమెత్తి = దండువిడిసి - బసచేసి; కుంభజగ్రావసుతాప్రతీర = సువర్ణముఖరీ నది యొడ్డునందలి.

53. అంజినాడు = దేశ విశేషము. చండసత్త్వములు = క్రూర మృగములు; చండసంహారతాండవంబు = భయముగొల్పునట్లు చంపుట యనెడి క్రీడ.

54. ఆఖేటకఖేల = వేఁట యను నాట; వికచ ప్రసూనవకుళప్రకరంబులు = వికసించిన పూవులు కల పొగడ చెట్లగుంపులు.

55. కెంజడలు = ఎఱ్ఱనిజడలు; ఆత్మైక విచారనిశ్చల దృగబ్జాతంబులు = ఆత్మవిచారమున నిశ్చలముగా నున్న పద్మములవంటి కన్నులు; అచ్చైన = స్పష్టమైన; కచ్చడము = గోఁచి; అంసంబు = బుజము; రుండమాల=తలపుఱ్ఱెలదండ; గళదేశస్థాణువు = మెడలోని లింగము; క్రాలఁగాన్ = ప్రకాశింపఁగా; ఒడయండు = గొప్పవాఁడు.

56. శిలావటమూలంబు = సెలయేటి గట్టునందలి మఱ్ఱిచెట్టుక్రింద.

57. అంతర్ధానము సేసినన్ = మాయము కాఁగా.

58. పీఁకెలు = ఊఁదుసాధనములు; సన్నతప్పుటయు = తమ సైఁగ తప్పిపోఁగా - తమ యత్నము ఫలింపకపోఁగా; రొక్కారొక్కముల్ దిట్టి = పెక్కువిధములుగా తిట్టి; శార్దూల క్రోడ మృగాదులన్ = పెద్దపులి, పంది, జింక మున్నగువానిని; బోధింపంగన్ = మేలుకొల్పుటకు.

59. ఆఖేటకస్థలము = వేఁటాడుచోటు; ఉల్లంఘన సేసి=దాఁటి; లుబ్ధకులు = వేఁటకాండ్రు; ఘూర్ణిల్లఁగాన్ = ప్రతిధ్వనింపఁగా; ధనుః కాండోల్లసత్పాణి = ధనుర్బాణములతో ప్రకాశించు హస్తములు కలవాఁడు.

60. సంవర్థితశ్రాంతి = వృద్ధిపొందిన యలసట; ఉద్దవిడిన్ = శీఘ్రముగా; దాఁటి = పరుగెత్తి; ఆశాశలన్ = నలుదిక్కులను; పాశవిముక్తుండు = బంధమునుండి విడివడినవాఁడు; యదృచ్ఛావృత్తి = స్వేచ్ఛ

61. అలయించుచున్ = శ్రమపెట్టుచు; చలమునన్ = పట్టుదలతో.

62. ఎలయించుక = ఎలయించుకొని, సంతోషించి; హిమా...విలసనములు = శివుని లీలలు; మదిన్ వివరించి = మనస్సులో నిర్ణయించి.

63. చిన్మయాంగము = ఆనందమయస్వరూపము; అవిద్యా ధ్వాంత సంతానము = అజ్ఞానాంధకారసమూహము; నిశాంతము = ప్రాతఃకాలము; అభంగరుక్కాంతాపాంగము = ఎడతెగని కాంతి కల సూర్యుని క్రీగంటి చూపయినది; వివిక్తధ్యేయ నిర్లింగము = ఏకాంతస్థానమున ధ్యానింపఁదగిన కారణరహిత మయినది.

64. రోమాంచకంచుకోదంచితాంగుఁడు = గగుర్పాటను కవచముచే ఒప్పిన దేహము కలవాఁడు - గగుర్పాటుపొందిన వాఁడు; ముకుళిత హస్తుఁడు = నమస్కరించినవాఁడు.

65. గాసింబెట్టెదు = బాధించెదు; కుట్రు నట్టడవిలోన్ = చిట్టడవి నడుమ; ఏటిగడ్డన్ = ఏటినేలపయి; ఇలు = ఇల్లు; ఆఁకొన్నచోన్ = ఆఁకలియైనచో; ఏసుట్టంబులు = ఏచుట్టములు - ఏబంధువులు.

66. చెండినన్ = చంపఁగా; చిన్నక = చిన్నయక్క; పెద్దక = పెద్దక్క; కారుకమ్మగాన్ = మిక్కిలి రుచిగా.

67. ఒడిపిళ్లు = ధాన్యవిశేషములు. సవరపుమెకములు = చమరమృగములు.

68. తోఁచి తోఁచి = ముంచి ముంచి.

69. గంగరేచుపండ్లు = గంగరేఁగుపండ్లు. కూడి మాడి = కలిసి మెలిసి.

70. పోఁడిమిన్ = పోఁడిమియును - సౌష్ఠవమును - సౌకర్యమును; తెప్పలన్ గాఁగన్ = సమృద్ధిగా.

71. కాలినకొఱంతన్ = కాలిన కఱ్ఱయందును; ఇగురుంబోండ్లు = యువతులు.

72. మానంబు = మాటలాడకుండుట. కస్తింబెట్టన్=కష్టపెట్టఁగా.

73. బ్రుంగిన = మునిఁగిన; ఒడి తప్పక = క్రమము తప్పక.

74. అలయించి = శ్రమపెట్టి; మఱుఁగరే = దుఃఖింపరే.

75. నిఱ్ఱనీల్గి = బాగుగా ఒడలు విఱుచుకొని; మట్టువడక=లొంగక; అసియాడంగన్ = తిరుగఁగా.

76. పోటుకోలాకటియున్ = పోటుకోల యొక్క టియును; పుచ్చ లేదు = తీయలేదు; వేడుక+ఎల్లన్ = వేడుకెల్లన్; మాజాలి = మా విచారము.

78. అలమట = దుఃఖము.

80. కడదాఁకన్ - చివరివఱకును; తుందుడుకు = కలఁతపాటు.

82. కస్తిపడఁగాన్ = దుఃఖపడఁగా; కారాకూరంబులు = బలాత్కారము; పోకార్తున్ = విడుతును.

83. వనరుచున్ = దుఃఖించుచు; వనచరులు = కిరాతులు.

85. పస్తున్నాఁడు = ఉపవాసమున్నాఁడు; నెగులు = కష్టము.

86. ఆసన్నగ్రావమహాటవుల్ = దగ్గఱికొండలు, అడవులు; కడపి = చంపి; వ్రాల్చెన్ = మీఁఱఁజేసెను; ప్రేల్చెన్ = వేఁచెను.

87. అంపపొది = బాణములపొది; కాంచనముఖీజలము = సువర్ణముఖినదినీరు; నంజుడు=మాంసము; అద్రిరాజల్లుఁడు=అద్రిరాజు నల్లుఁడు - శివుఁడు.

89. తేఁకువ = నిలుకడ; సాఁకఁగదే = పాలింపుమా! అఱ్ఱాకలఁ బెట్టక = బాధలఁబెట్టక; పలాశనాసక్తుఁడు = మాంసాహారమున ఇష్టము కలవాఁడు.

90. నెపము = మిష - సాకు; కఱకుట్లులు = కొయ్యకుఁగుట్టి కాల్చిన మాంసఖండములు.

91. జీవనము = బ్రతుకు; పదరాజీవములు = పాదపద్మములు.

92. ఏడుపుడిపి = ఏడుపు పోఁగొట్టి; సరగునన్ = వేగముగా; అవధానమునన్ = నిదానముగా.

93. ముదమునన్ = సంతోషముతో; మిన్నందు = ఆకాశమునందుకొని.

94. పంచాక్షరీ...భాగములు = పంచాక్షరీ మంత్రముచే పవిత్రమగు విభూతితోడి పుండ్రము (రేక) లచే చిహ్నితము లగు ద్వాదశభాగములు; స్నానార్ద్ర శాఖ = స్నానము చేయుటచే తడిగా నున్న జుట్టుముడి; క్రమ...భూషణంబులు = క్రమముగా వేయఁబడిన ముడులతోఁగూడిన రుద్రాక్షమాలల అలంకారములు; ఆగుల్ఫ...తోత్రంబు = చీలమండవఱకును వ్రేలాడు మునికోల. ఉపవీత సూత్రములు = యజ్ఞోపవీతములు; పుష్పకరండకంబు = పూల సజ్జ.

95. చాఱికలయ్యెన్=నీటిచారలు కలదయ్యెను; ఎంగిలిపుల్లియలు= ఎంగిలి యూఁకులు.

96. కైసేయన్ = అలంకరింపఁగా; కతంబేమి = కారణమేమి? నిర్మలతోయస్నపనంబు = నిర్మల జలస్నానము; నీరువట్టులు = నీటిచాఱికలు; కూడుంగా = తగునా?

97. కసుమాలము = కశ్మలము - రోఁత; కేల్దోయి=రెండుచేతులు; వెఱపు = భయము.

98. పోఁడిమి = అందము - కాంతి; బూటకము = మాయ.

99. తుందుడుకు = కలఁతపాటు.

100. ప్రాఁతలు = తోళ్లు; ప్రాఁతి = ప్రేమ; మెసంగితి=తింటివి; కుంటెన = విటకత్తె; శవభూతి = శవములబూడిద; రోయుదువే = అసహ్య

పడుదువా ? - పడ వనుట. నీచుపొత్తునఁ గుడుచుట వీరచోడవ కథలోఁ గలదు. ఇందలి భక్తుఁడు సుందరమూర్తినయనారు.

101. కూడుగ్గఁబట్టి = ఆహారము విడిచి.

102. తారాధిప కళాశిఖామణి=చంద్రశేఖరుఁడు - శివుఁడు; అత నికిన్ విని = అతని పల్కులు విని.

103. తవతవ పడన్ = ఆయాసపడఁగా - కలఁతపడఁగా; శ్రుతి వ్యవహారేతర మతము = వేదబాహ్యపద్ధతి.

105. మోదించి = సంతోషించి; హరద్విజుండు = శివ బ్రాహ్మ ణుఁడు; చెంచు = కిరాతుఁడు - తిన్నఁడు; పోవం ద్రోచి = త్రోసివేసి; గండూష జీవన సేకంబు=పుక్కిటినీటి స్నానము; ఏసి = కొట్టి; కోలామిష ఖండముల్ = పందిమాంసపు ముక్కలు.

106. ఏమొకో = ఏమికారణమో; అభవుఁడు=శివుఁడు.

107. కించిత్...గతిన్ = కొంచెము వికసించిన యొఱ్ఱని తామర పూవురేకుల మొత్తమునుండి జాఱుచున్న తేనెధారవలె; ముకుళితనేత్రము నన్ = మూసిన కంటినుండి; ఘనమైనన్ = దట్టము కాఁగా.

108. ఆందోళము = కలఁతపాటు; కంటినంటిన నొప్పిన్=కంటికిఁ గలిగిన బాధవలన.

109. తరంగంబులైన = పొంగి పొరలుచున్న.

110. కోకపొట్లంబు = పొట్లముగా కట్టిన వస్త్రము; కమఠోష్ఠకరథ భాగమునన్ = అఱచేతిలోఁ చిటికినవ్రేలి క్రిందిభాగమున రాపిడిచేత వెచ్చనైన భాగముచేత; రేచకి = కరకకాయ; నిమ్మపంటిపుల్సు = నిమ్మపండు రసము; పెరుగువత్తులు = పెరుగులో ముంచిన మెత్తని దూదివత్తులు; సంకు=చమిరి = శంఖముతో రాచి; కన్నుతోడిఁబడి = కంటిరంధ్రమునుండి.

111. చిల్లిఁగదిసిన = రంధ్రమునకుఁ బెట్టిన; వ్రాలు = అక్షరములు; నెరయన్ = నిండఁగా.

112. పదరినకతనఁ = చలించిన కారణమున; నెట్టు, అవిసెనో = ఎక్కువగా అదరెనో - పగిలెనో.

114. వేఁకి = జ్వరము.

115. భంగము నొందునో = నశించునో; నాక = అనక; తూణికా బాణము = అమ్ములపొదిలోని బాణము; తిగిచి = లాగి; భల్లముఖాగ్రము = బాణముయొక్క వాఁడియైన కొన; రక్తపద్మదృక్కోణము = ఎఱ్ఱతామర వంటి కనుఁగొలికి; గుడ్డు = కన్ను; శోణిత ద్రోణిక = రక్తపుగుంట.

116. మోహావహమై = అందమై; తన కన్ను = శివుని కన్ను; ఉమాపతి = శివుఁడు, శోణిత క్లిన్నత = రక్తము కాఱుట.

117. లాలాటలోచనము = నొసటికన్ను; కీలాలము = రక్తము.

118. సునిశితబాణంబు = వాఁడిబాణము.

119. కన్నప్ప = తిన్నఁడు; ఖండపరశువు=శివుఁడు; ఆశుగంబు = బాణము; ఎలుఁగు = గొంతుక.

120. అరవిందసూతి = బ్రహ్మ; వియచ్చరులు = దేవతలు; శీతవసుధాధర కన్యక = పార్వతి.

121. శివగోచర = శివభక్తా! అవిరళతరము = తక్కువకానిది - ఎక్కువయినది.

122. దరహాసము సెలవుచుఁ=చిఱునవ్వు నవ్వుచు; పరిసరము = సమీపము; పిల్చుక = పిల్చుకొని - పిలిచి; కృత్తివాసుఁడు = శివుఁడు.

123. జగ...పారీణత = లోకము మిథ్య యను విషయమును స్థిరముగా ప్రతిష్ఠించు నేర్పు; తీఁపుఁ = వాంఛయును; చీఁకటి = అజ్ఞానము.

124. నిగమాంతులు = వేదములు; అడఁగాఁ = పలుకఁగా; భవన్మయమైన = నీతో నిండియున్న; పూర్ణచిద్గగనము = నిండియున్న ఆనందాత్మకమగు నాకాశము; క్రమ్మఱఁ బుట్టెడుబాధ = పునర్జన్మదుఃఖము.

126. భవప్రయాణము = సంసారసంబంధము; ఎడలింపఁగ వేఁడెడి కోర్కె పలయును.

127. వారినిధానంబు = సముద్రము; తాదాత్మ్యంబు=నీలోఁ కలిపి కొనుట - మోక్షము.

128. తద్విమల - భావములై = ఆతని నిర్మలతేజస్సును ధ్యానించుటయందు మునిఁగిన మనస్సు కలవారై; ఆత్మరూపమునఁ గూర్చెన్ = తాదాత్మ్యము నొసఁగెను.

129. అపవర్గోదగ్రభాగ్యంబులు = గొప్ప మోక్షసంపదలు; హాలాహాలభక్తభోక్త = అమృతాహారమును భుజించు శివుఁడు; హేరంబ... ప్రభృతుల్ = వినాయకుఁడు, విష్ణువు, బ్రహ్మ, దిక్పాలురు, యోగులు, గంధర్వులు మున్నగువారు; అంతర్ధినొందెన్ = అంతర్ధానముపొందెను.

130. పునరభివాదనము = తిరిగి నమస్కారము.

131. కపటచతుష్షష్టిగతులు = అఱువదినాలుగు లీలాభేదములు; వాలవాయి = తిరువాలవాయి - హాలాస్యుఁడు; చొక్కేశుఁడు = చొక్కలింగేశ్వరుఁడు; మీనేక్షణ = మీనాక్షి; ఇరవు = నివాసము; దక్షిణాం... వైఘ = దక్షిణసముద్రునికి భార్యయగు తామ్రపర్ణినదికి సవతి యైన వైఘనది; నిజ...కంఠ = తన కన్నుఁదామరలచే పూజింపఁబడిన శివుఁడు కలది; కూడలళఘుమవైకుంఠకుంఠితామ = కూడలళఘుయ విష్ణుదేవులచే నశింపఁజేయఁబడిన పాపములు కలది; నిఖిల...తాపంబు = సమస్తమైన సంపదల సమూహముచే నుంచేఁబడిన లోభి అనుతాపము గలది; మధురాభిధానపురము = మధుర యను పేరి పట్టణము.

132. ఇందుధరుఁడు = చంద్రమౌళి - శివుఁడు.

133. మహోగ్రాపాంగము = మిక్కిలి ప్రతాపముకల క్రీఁగంటి చూపు; అంగయకన్నంబ = మీనాక్షీదేవి; అంగజుదేవి = మన్మథునిభార్య-రతీదేవి; ఐదువ = ముత్తయిదువ.

134. పశ్చిమతటము = పడమటిగట్టు; నికటకూలము = సమీప మందలి యొద్దు; లోకమాతృక = లోకజనని.

136. ప్రసాదంబు = అనుగ్రహము; అంగయకన్నె = మీనాక్షి.

137. లేమల్ = స్త్రీలు; శివాభోగవేళామంజూక్తులు = శివుని పూజాసమయమందలి మధురములైన మాటలు.

138. అప్రశర్క్య...ధీనిధి = ఊహింపరాని రాజ్యపరిపాలనమున పేరుపడిన గొప్ప బుద్ధి కలవాఁడు; సంజ్ఞాపతి = సూర్యుఁడు.

139. మూర్తి = స్వరూపము; హిమ...కీర్తి = మంచుకాంతివలె మిక్కిలి ప్రకాశించు గొప్ప కీర్తి కలది; మిహికామహీధరము = హిమవత్పర్వతము; కులగోత్రపాత్రుఁడు = కులపర్వతమునకు అర్హుఁడు, కులము, గోత్రములకు అర్హుఁడు.

141. కలశతనూజుండు = అగస్త్యుఁడు; శబ్దశాస్త్రము = వ్యాకరణము; అష్టాదశాక్షరమాతృక = పదునెనిమి దక్షరముల మూలము; శంఖఫలకంబు = శంఖనిర్మితమగు పలక; ఎనయైనవారు = సమానులు.

143. పాండ్య...నిధి - పాండ్యధాత్రీధౌరంధర్య = పాండ్య రాజ్యభారమును వహించుటచే; ప్రమోదిత = సంతోషించిన; గ్రావ = పర్వతములు; హరిద్వారణ = దిగ్గజములు; భుజగపతి = ఆదిశేషుఁడు; భూదార = ఆదివరాహము; కమఠపరివృఢ = ఆదికూర్మము అనువాని; ప్రథానిధి = ప్రఖ్యాతికి నిధియైనవాఁడు.

144. ద్రావిడభాషాదేవీగ్రైవేయకము=తమిళసరస్వతికి కంఠహారము.

145. దివిష...ప్రతిభులక్ - దివిషదన్నప్రాయ = అమృతప్రాయమైన; వాగ్గుంభసంపత్ = రచనాసంపదకలిగిన; కావ్యప్రతిపాదక = కావ్యములను రచించుటయందు; ప్రతిభులక్ = గొప్ప మేధాసంపద కలవారిని; పన్నిద్దఱక్ = పండ్రెండుగురిని; శైవ...రత్నములక్ = శైవమతవిజ్ఞాన

మను సరస్సున గొప్ప హంస లయినవారిని; భూభృత్కంఠీరవుఁడు = గొప్ప రాజు.

147. అర్థులు = యాచకులు; పడఁతులు = భార్యలు; బొంకమి = అనృతమాడకుండుట; పొడవడఁగించి = గర్వమును నశింపఁజేసి.

148. గ్రహ...క్షోభంబు = గ్రహముల వక్రగమనమున కలిగిన యశుభములతోడి గొప్ప కఱవుబాధ.

149. ధూమకేతువు = తోఁకచుక్క; ఏఁచెన్ = వృద్ధిపొందెను; రేపాడి = ఉదయము; తుషారంబు = చినుకు; మిన్ను = ఆకాశము; కర్వలి= గాలి; వర్షగర్భను నడవకపోయెన్ = గర్భఋతువులందు వర్షించెను; కుము దాప్తధారణ = చంద్రునియునికి; కొమ్ము దఱిగెన్ = ఒక కొమ్ము తగ్గెను - విదియనాఁటి చంద్రునికొమ్ములు రెండును సమముగానుండినచో వస్తువులవెలలు సరసముగా నుండు ననియు, కుడిచేతిప్రక్క కొమ్ముతగ్గిన యెడల కొలువఁదగిన వస్తువులును, ఎడమచేతి వైపు గలకొమ్ము తగ్గినయెడల తూచఁదగిన వస్తువులును-బాగుగా ఫలింపక ధరలు పెరుఁగు ననియు పెద్దలందురు. కన్య భిన్నింప దర్యొకన్ = సూర్యుఁడు కన్యారాశియందుఁ బ్రవేశించినను, చినుకులు పడ లేదు - ఇది కఱవు లక్షణము; జముదెసన్ = దక్షిణదిక్కున.

151. ఇంజెట్లు = కందలోని భేదములు.

152. ఆఱవడు = ఒక జాతి సస్యము; పఱిపఱియై = చిందరవంద రయి; మల్లెవడి = తెగులుపట్టి.

153. ఎమ్ములు = ఎముకలు; వెచ్చపోవువారు = కమలినవారు; నిరస్తసస్యము = నశించిన పంట కలది.

154. నవయుచున్ = బాధపడుచు; జీవానిలముల్ = ప్రాణవాయువులు - ప్రాణములు.

155. కరవెఱుఁగక = నేర్పు తెలియక - ఉపాయము తోఁచక. [సురసుర = తీవ్రతను తెల్పుననుకరణము].

156. మానిసి=మనుష్యుఁడు; మూలస్థాన హరద్విజుఁడు = మూలస్థానమునందలి శివభక్తుఁడగు బ్రాహ్మణుఁడు.

157. ముడుపు = ధనము; వెచ్చంబున కొదవుక్ = ఖర్చునకుఁ బనికివచ్చుచు; సింధుర...గంధంబు = గజగామిని యగు నందకత్తె కేశపాశము సహజమగు సువాసన కలది.

158. నత్కీరుండు=అఱవవాఙ్మయమున ఈ పేరు నక్కీరుఁ డని కలదు; సుభాషితములు కలవాఁ డని దాని యర్థము, తెలుఁగునఁ గన 'నత్కీర' పదమున కర్థము విచార్యము.

160. సిగ్గుచెడిలిక్ = సిగ్గుతో చెడితిని.

161. సర్వజ్ఞత్వము = సమస్తము నెఱిఁగియుండుట.

162. పరవిద్యాధీనత = ఇతరుల విద్యపై నాధారపడియుండుట.

163. క్షామవ్యథకోలఁది = కఱవుబాధకంటె ఎక్కువైనది.

165. ఏభావ్యంబు = ఏమి న్యాయము? భైక్షము=భిక్షాటనము.

166 కుంభినీపతిసభ = రాజసభ.

167. సాహిత్య....ప్రౌఢిమక్ = సాహిత్యముచేఁ బ్రకాశించు మాధుర్యమున అందమగు నేర్పుతో; మాత్సర్యంబు = అసూయ.

168. గిరితనయ = పార్వతి.

169. అగజ = పార్వతి; గగనప్రసూనవాదము = కారణరహితమగు = నిరాధార మగు వాదము.

170. లాలామాలపుమాటలు = మోసపుఁబల్కులు.

171. తలచుట్టువాఱక్ = తలకుఁ జుట్టును.

172. ప్రతిభాషలు = ఎదురు జబాబులు.

173. ఉద్యత్కృపాధామా = ఉదయించుచున్న దయకు స్థానమయినవాఁడా! భక్తరక్షామందారుఁడు = భక్తుల రక్షణయందు కల్పవృక్షమయినవాఁడు; కుందుచుక్ = దుఃఖించుచు.

174. చార్వాకము = వాదులాట; వెండిగుబ్బలి = కైలాసపర్వతము.

176. హిమపయోధారాళవర్షంబులు = ఎక్కువగా మంచు కురియు చుండునవి; ఉద్ధురసంఘర్షణబాధకోపలములు = ఎక్కువయిన రాపిడివలన బాధను కలిగించు రాళ్లు కలవి.

177. తిమ్మిరి = స్పర్శజ్ఞానము లేనట్లు చేయు వ్యాధి; గాత్రము, విగ్రహము = దేహము; వెడరూపు = వికారపురూపు కలది; పరిహరింపన్ = తప్పింపఁగా.

178. ఉడిగి = లేక - విడిచి. అలం. రూపకము.

180. భీషణాంహోలతల్ = భయంకరమైన పాపము లను తీఁగలు; తెవ్వన్ = తెగఁగా; తీవ్ర...వ్యథల్ = మిక్కిలి తీవ్రమై బాణములు గ్రుచ్చుకొని మండింపఁజేయున ట్లున్న దేహములోని బాధలు; వివ్వన్ = నశింపఁగా; తీఱని = తనివితీఱని; ఉత్కంఠతన్ = ఔత్సుక్యముతో.

181. హిమా...సర్వాంగము-హిమాత్మజా = పార్వతీదేవియొక్క; ఉత్తుంగకుచ = ఉన్నతములయిన స్తనములయొక్క; ఉపగూహన = కౌఁగిలిచే; విధూత = పోఁగొట్టఁబడిన; మనోజభూతి లేపసర్వాంగము = మన్మథునిదైన భస్మము కల సమస్తదేహము కలది; లోచనీ...పతంగము = కన్ను లుగాఁ జేయఁబడిన చంద్రాగ్నిసూర్యులు కలది; వినిర్లింగము = కారణరహితము - స్వయంసముద్భూతము; జంబుకేశ్వరమున జలలింగమును, అరుణాచలమున (తిరువణ్ణామలలో) అగ్నిలింగమును, చిదంబరమున ఆకాశలింగమును, తిరువాలూరున పృథివీలింగమును, శ్రీకాళహస్తియందు వాయులింగమును - ఇట్లు పంచ లింగములును కలవు.

182. కవేరకన్య = కావేరినది; జీవన...సైన్య - జీవనశితఖడ్గ = నీరను వాఁడికత్తిచే; ఖండిత = ఖండింపఁబడిన; భవప్రభవాఘ = సంసారమునఁ గలుగు పాపములను; విరోధిసైన్య = శత్రుసేనలు కలది; పావన...

దైన్య = పవిత్రమగు తన నామము స్మరించుటచేఁ బోఁగొట్టఁబడిన మను ష్యులదీనత కలది; నిత్య...వదాన్య = ఎల్లపుడును స్నానాసక్తులగు జనుల గుంపునకు మోక్షపదము నిచ్చునది.

183. తటినీరత్నంబు = గొప్పనది; ఉత్తరించి = దాఁటి.

184. అరుణగిరీంద్రకూటము = అరుణాచలము; కృతాఘకపోలచపేటము = పాపములకు చెంపపెట్టిచ్చునది; నిరంతర...కృపీటము = నిరంతర = ఎడతెగని; భవదావపావక = సంసారదావాగ్నిని; విదావాకృపీటము= ఆర్పివేయు నీరు కలది; పుణ్యకోశమందిరవిలసత్కవాటము = పుణ్యకోశము భవనమునకు తలుపు అయినది; పరిహృత...ఘోటము - పరిహృత = ఆడ్డఁబడిన; సంతత భ్రమణ = ఎల్లపుడును తిరుగుటయందలి; భార = బరువు కల; పదశ్రమ = కాళుల ఆయాసము కల; భానుఘోటము = సూర్యుని గుఱ్ఱములు కలది.

185. ఉణ్ణాములజగదంబిక = అపీతకుచాదేవి; అణ్ణామల = తిరువణ్ణామల - అరుణాచలము; మణ్ణాస = భూమిపైఁగల ఆశ; పొన్నాస = బంగారముమీఁది కోరిక; పెణ్ణాస = స్త్రీమీఁది యాశ.

186. కాంచనగర్భుఁడు = బ్రహ్మ; ఒజ్జ = గురువు.

187. ఏకరసాలేశ్వరుఁడు = ఏకామ్రనాథుఁడు; కాంచికాధరమణుఁడు = కాంచీపట్టణప్రభువు.

188. అపవర్గము = మోక్షము; విక్రమసింహనగరము = నెల్లూరు; గౌతమగంగ = గోదావరి, అంహోమతంగ సింహము = పాపము లను ఏనుఁగులకు సింహము; విదళితోభయకర్మంబు = నశింపఁజేయఁబడిన సంచిత, ప్రారబ్ధకర్మములు కలది; కలుషానీక మండూకగోకర్ణంబు=పాపములగుం పను కప్పలకు పా మయినది; కృత్తివాసోనివాసంబు = శివునికి నివాసమైనది.

189. కాంచన...సారంగ - కాంచనపంకజాత = బంగారుతామర పూలయందు; విలసత్ = ఒప్పుచున్న, గంధ = పరిమళముచే, అంధ=మదిం

చిన; సారంగ = తుమ్మెదలు కలది; ఫేనాంచత్తుంగతరంగ = నురుగుతో ఒప్పు ఎత్తయిన అలలు కలది; వారినిధిశీతాగాంతరా భంగ = సముద్ర హిమాద్రుల నడుమ ఎడతెగక ప్రవహించున దగుట, రోమాంచ.. సంగ - రోమాంచ = గగుర్పాటు; స్వేదజల = చెమట; అశ్రుపూర = ఆనంద బాష్పములు అను వీనిని, జనక = పుట్టించు; ఆత్మానందసంపత్ = ఆత్మానంద సంపద గల మనోమంచాగ్రస్థిత = మనస్సను సింహాసనముపయి కూర్చున్న; విశ్వనాథ = విశ్వేశ్వరుని యొక్క; పద = పాదములకు; సమ్యక్సంగ = బాగుగా లగ్నమయినవి.

191. విశ్వపతి = విశ్వనాథుఁడు; పాపాంగారప్రజవృష్టి = పాపములను అగ్నిగంపునకు వర్షమైనది; ఢుంఠిద్విపాస్యక = ఢుంఠి విఘ్నేశ్వరుని.

192 గుహ్యకసమ్రాడాశ = కుబేరునిదిక్కు - ఉత్తరము.

193. తొంగి దోగి=వంగి వంగి; జంగలు = అడుగులు; ఉత్తాల = ఎత్తయిన.

194. తములు = తామరలు; కమ్మఁ దెమ్మెరలు = మలయమారుతములు; బిసినీలతాంగి = తామరతీఁగ యను వనిత.

195. హంస సంపదభీష్ట విహారహేతువు = హంసలు తమ యిచ్చ వచ్చినట్లు తిరుగుటకు కారణమైనది - యోగుల స్వేచ్ఛావిహారమున కాలవాలమైనది; అప్రతర్క్యము = ఊహింపరానిది; అద్వంద్వము = సుఖదుఃఖాది ద్వంద్వాతీతము. అలం. శ్లేష, ఉపమ.

196. రజోవికారము = పుప్పొడి, రాజసగుణము; వాసనలు = సువాసనలు, జన్మాంతర సంబంధములు, ఊరులు = అలలు, షడూర్ములు; భవము = సంసారము. అలం. శ్లేష, ఉపమ.

197. దళములు = పూవురేకులు, సేనలు; రథాంగనినదంబు = చక్రవాకముల యఱపు, రథచక్రముల ధ్వని; రాజహంస సంకులము = రాజ

మాంసలతో కూడినది, గొప్ప రాజులతోఁ గూడినది; పరాగము = పుప్పొడి, దుమ్ము; శిలీముఖభ్రమణఘోషము = తుమ్మెదల తిరుగుటలు, ధ్వనులు కలది, బాణప్రయోగధ్వనులు కలది; నవ్యకదంబముల్ = క్రొత్తవైన కడిమి చెట్లు - వాఁడిబాణములు: పుండరీకములు = తెల్లతామరలు, కత్తులు; మహాహవము = గొప్ప యుద్ధము.

198. పలాశశ్రేణి = ఆకులగుంపు; ఊర్ధ్వశాఖావితానంబు = మీఁది కొమ్మల గుంపు; హర్మ్యములు = మేడలు; దిశాంత...చ్ఛాయ = దిక్కుల చివరవఱకు తిరుగు గొప్ప చిగుళ్లకాంతి; శాద్వలము = పచ్చిక బయలు.

200. క్రూరనిరీక్షణప్రభిలు=వాఁడిచూపుల కాంతులు; నీరద నీలగాత్రము = మేఘమువలె నల్లనైన శరీరము; అట్టహాసముల్ = పెడనవ్వులు; ఫేరవ కంఠనిస్వనము = నక్కగొంతుధ్వని; హేతి = ఆయుధము, మానవాస్థి హారారవముల్ = మనుష్యుల ఎముకలమాల చప్పుళ్లు.

201. జెట్టిదముగన్=కఠినముగా; కట్టెఁబడిన = కంచము (పళ్లెము) లోఁబడ్డ.

205. నూఱుక = నూఱుకొని; నూఱును నిండెన్ = నూఱేండ్ల యాయుస్సు నిండెను.

206. పురభిత్తనయుఁడు = శివుని పుత్రుఁడు; తారకదమనుఁడు = కుమారస్వామి; తలఁకు = భయము.

207. దారుణశక్తిధరుండు = భయంకర మగు కాసూశక్తిని ధరించినవాఁడు; పన్నగాహారహయుండు = నెమిలి వాహనముగాఁ గలవాఁడు; షణ్ముఖ . కటాహుఁడు - షణ్ముఖాట్టహాసారభటీ=ఆఱు ముఖములనుండియు వెడలిన పెడనవ్వుయొక్క గొప్ప ధ్వనివలన; విపాటిత = బ్రద్దలుకొట్టఁబడిన; దిగంతకటాహుఁడు = కటాహమువంటి దిక్కులచివరి భాగము కలవాఁడు.

208. మన్నిగొన్న = చంపిన; దొడ్డు = గొప్ప; నిర్ఘాతము = వజ్రము - పిడుగు.

209. బ్రహ్మణ్యోక్తి = బ్రాహ్మణహితోక్తి. అనుకంపా=దయ; తిగిచి వైచి = లాగివైచి.

210. కాశవనప్రభవ = రెల్లువనమున నుద్భవించినవాఁడా !

211. రౌప్యనగంబు = కైలాసపర్వతము; కుధరము = పర్వతము.

212. ఖేదోల్లోలోర్మి రోగజలనిధివేల = దుఃఖ మను చలించుచున్న అలలు గల రోగ మను సముద్రముయొక్క యొడ్డు.

213. కాలగ్రీవుఁడు = శివుఁడు.

214. మహత్త్వము = గొప్పతనము; డాఁచి = దాఁచి.

215. సేనాని = కుమారస్వామి; అవాచీనస్థాణునగంబు = దక్షిణకైలాసము; సింధుప్రతీరంబునన్ = నదీతీరమునందు.

216. కదిసి = సమీపించి; కల్లోలభూయిష్ఠౌఘంబు = అలలతో నిండిన ప్రవాహము.

218. భవద్భవము = నీ పుట్టుక.

219. నిటలంబునన్ = నొసట.

222. అవిద్యాసూత్రదాత్రంబు = అవిద్య యను త్రాటికి కొడవలి యైనది; జీవన...ముఖము = సంసారదుఃఖ మను వస్త్రమునకు కత్తెర చివరిభాగము; కైవల్యా...రత్నంబు = మోక్ష మను వస్తువు నిచ్చుటకు చింతామణి; జాంపత్యము = దాంపత్యము.

223. అపవర్గమార్గము = మోక్షమార్గము.

224. యోగి...వాగురిక = యోగులమనస్సు లనెడు పక్షులకు వలయైనవాఁడా ! సర్వోపాధిశూన్యా = సర్వకారణ రహితుఁడగువాఁడా ! జగద్యోగాయోగవిహీన = జగత్తుయొక్క యోగాయోగములు లేనివాఁడా!

భూ...గణ్యా = భూమి, ఆకాశము, వాయువు, క్షీరము, అగ్ని, అంతరాత్మ అను రూపులచే గొప్పవాఁడగువాఁడా! స్వాభావ...పక్షీశ్వరా - స్వాభావ తేజః = స్వభావసిద్ధమైన తేజస్సుచే; గంధూషిత = ఆక్రమింపఁబడిన; పద్మజాండభవ = బ్రహ్మాండమున పుట్టిన; చక్షుః శ్రోత్రపక్షీశ్వరా = ఆదిశేష గరుడులు కలవాఁడా!

225. అష్టాపదగిరిచాపా = స్వర్ణగిరి (మేరుపర్వతము) విల్లుగాఁ గలవాఁడా! అష్టాపదగర్భుఁడు = హిరణ్యగర్భుఁడు - బ్రహ్మ; అష్టాపదము ఖరి = సువర్ణముఖరి; అష్టాపద కమలము = సువర్ణకమలము.

226. మునీంద్ర...సముక్త = మునీంద్రుల మానముద్రచే బాగుగా వ్యాఖ్యచేయఁబడినవాఁడా! ముక్తవాసనా = వాసనను విడిచినవాఁడా! సనాతనా...ఘనా = సర్వదా తన సేవకులబాధ లనెడు తామరలగుంపునకు మంచగువాఁడా! ఘనాఘనాఘనప్రకాశ = వర్షకాలపు మేఘమువలె గొప్ప తేజస్సుకలవాఁడా! కాయజాగ్ని జీవనా = మన్మథుఁ డనెడు అగ్నికి జలమైనవాఁడా! వనాధి......పావనా! ఆటవికరాజపుత్రుఁ డగు తిన్నని, బ్రహ్మను పవిత్రుల నొనరించినవాఁడా!

## చతుర్థాశ్వాసము

1. కంఠభూషిత కాకోదరవర = మెడయం దలంకరింపఁబడిన గొప్ప పాములుకలవాఁడా! వరాక...దూర = నీచులగు విమతమతవ్యాఖ్యల కోలాహలమునకు దూరమైనవాఁడా! చిదాకృతి=చిదానందస్వరూపా! జితకాల= యముని జయించినవాఁడా!

3. ఘోరాజులలోన్ = ఘోరయుద్ధములలో; వలరాజులు = మన్మథులు; జయరతి = విజయమను రతీదేవికి; కొమ్మలగమి = స్త్రీలగుంపు; నిలింపకుజము = కల్పవృక్షము; నాగావళి = పాములసమూహము; చందనా...ద్వారము = చందనవృక్షముమీఁది గాలియొక్క ఆస్వాదనము వచ్చు దారి;

అగదిత+అనఁగన్ - ఇచట అకారసంధి; శతకోటి...కోటి = వజ్రకాంతి గల రత్నములు తాపఁబడిన మేడలవరుసయొక్క కాంతిపుంజము; హేళి = సూర్యుఁడు; ప్రతికోటి = సమానము. పౌరుషౌన్నత్యము = పౌరుషమున ఆధిక్యము, నిమ్నతాభావిభూతి = సంపదయందు అణఁగియుండుట.

4. శ్రీవనజాక్షి = సంపల్లక్ష్మి; జననసింధువు = పుట్టిన సముద్రము, నానావసథంబులు = అనేకములగు గృహములు.

5. పార్థివాన్వయము = రాజవంశము; వైశ్యవీధి = వేశ్యాసంఘము; అలం. సారము.

6. గాణిక్యకలశజలనిధి=వేశ్యాకుల మను పాలసముద్రము; ఏణాక్షి= జింకకన్నులఁబోలు కన్నులుకల - అందమైన - స్త్రీ.

7. వామేక్షణ = అందకత్తె; అరోచకంబు = అరుచి.

8. తనువులెత్తిన పగిదిన్ = మూర్తీభవించిన రీతిని.

9. మనోరాజీవము = మనస్సను పద్మము.

10. పంకించిన = పూసిన; కజ్జలము = కాటుక; కంధర = మెడ.

11. మన్ననన్ = మట్టితో; మట్టుపఱచుచున్ = కుదురుపఱచుచు.

12. సడల్పక = కదలనీయక; తారక...రతులు = తరింపఁజేయు యోగమార్గమునందు ఆసక్తి కలవారు.

13. కొక్కోక కళావిలాసము = కామశాస్త్రీయ కళావిలాసములు; వారధర్మము = వేశ్యాధర్మము.

14. ముకుందుఁడు = శ్రీకృష్ణుఁడు; నిశాకరుఁడు = చంద్రుఁడు; పృథాబ్జహితులు = కుంతీసూర్యులు.

15. చతుర్జాతివయోవనజాక్షులు = పద్మిని, హస్తిని, చిత్తిని, శంఖిని అను నాల్గుజాతుల యువతులు.

16. నిరుపమకలనాద పరివాదినీవీణలు = సాటిలేని మధురధ్వనితో నొప్పు ఏడుతీగల వీణెలు; లాస్యాగమములు = నాట్యశాస్త్రములు; సంతరించెన్ = కూర్చెను. అలం. క్రమము.

17. విసివి = విసిగి; పంచకరపాట్లు = కష్టములు; పణ్యాధర్మంబు = వేశ్యాధర్మము.

18. జననాంతరవాసన = పూర్వజన్మసంబంధము; కళానిధిశేఖరుఁడు = చంద్రశేఖరుఁడు - శివుఁడు.

20. భూమిభృత్కన్యక = పార్వతి; ఉమాగిరిశస్తుతి = పార్వతీపరమేశ్వరస్తుతి.

21. కనకశలాకలు = బంగారుకడ్డీకెలు; బోనము = భోజనము.

22. మదనామ్నాయతదంగశాస్త్రములు = కామశాస్త్రమును, దాని కంగము లగు ఇతర శాస్త్రములును; చిద్రసాస్పద శైవాగమము = ఆనందరసమునకు స్థానమగు శివధర్మములఁ దెల్పు శాస్త్రము; ఏకవారము = ఒక్కసారి.

23. పెక్కువ = వృద్ధి - పెరుఁగుదల; తనులతాప్రభ = తీఁగవంటి యొడలికాంతి; ఉడిగిపోవన్ = తగ్గిపోఁగా; శాంభవంబు = శివసంబంధమైనది; శైశవాపగమము = యౌవనము; అంగకంబులు = అవయవములు.

24. పుంశ్చైత్యు...మతల్లి = మన్మథవిద్యయందు దాటిలేటిన గొప్పవనిత.

25. కాణాచి = తగినస్థానము; గారాము = గారాబము, ముద్దు; భావ్యంబె = న్యాయమా ? లలాంతాస్త్రకళావిధిజ్ఞులు = మన్మథకళల ధర్మమర్మముల నెఱింగినవారు.

27. సత్త్వంబులు = స్తంభాదులగు సాత్త్వికగుణములు; తెలుపఁగవలదే - వెల్లడింపవలదా ? - పేరెక్కునట్లు చేయవలదా ?

28. పారయనికరణిక్ = అంటని రీతిని.

29. రిత్తమాటలు = వ్యర్థములైన పలుకులు.

30. తరితీపులు = ప్రేమములు; చాయవాటులు = మెఱుఁగులు; గాయకములు = ప్రియములు; నైసర్గికములు = స్వాభావికములు.

31. ననవువిటుఁడు = ప్రియుఁ డగు విటుఁడు; అనువుగన్ = అనుకూలముగా - బాగుగా.

33. తొలుకారుమెఱుంగులు = తొలకరిమెఱుపులు; తర్జనోక్తి = భయపెట్టుమాట; పల్లవావళి = విటులగుంపు, చిగుళ్లసమూహము; ప్రోది సేయక = పెంచక; అర్థము = ధనము.

34. దృక్ప్రసనాస్త్రపావకున్=మారుములికివంటి చూపు అను నగ్నిని; గందపుఁగొండగాడ్పు = మలయానిలము; కూర్మితుంపరన్ = ప్రేమ యను జల్లుచే.

35. జాణలు = నేర్పరులు; చూఱవోసు = కొల్లపోదు; పల్లవుల్= విటులు; పార్థివుల్ = రాజులు.

36. వెలయాండ్రపోణిమి = భోగమువారిసీతి.

37. పదశోకనదారాధనంబె = పాదపద్మముల పూజయే; చిద్విద్యాకారస్మృతి=చిదానందరూపముయొక్క-ధ్యానము; కాణయాచి = కాణాచి-చిరకాలానుభవము కలది.

38 తమకున్ శ్రీ = మావు సంపద.

39. అపేక్షించిన = కోరిన; చిత్తజాయత్తము = మన్మథునికి లొంగినది; కుంటెనలు = తార్పుకత్తెలు; కాయంబు = దేహము; జిహ్వక=నాలుక.

40 బోటిగేహము = చెలికత్తెయిల్లు.

41. దారు...భుజంగుఁడు=దారువనమునం దుండిన మునుల భార్యలకు విటుఁడైనవాఁడు - [తొల్లిదారుకావనమునందలి మునులు శివభక్తి

శూన్యులు కాఁగా, శివుఁడు నగ్నజంగమవేషమునఁ బోయి వారివనితల పాతి. వ్రత్యమును చెఱిచెనఁట. భక్త...భుజంగుఁడు - [పూర్వము శివుఁడు తన భక్తుఁడగు భల్లాణునిభక్తిని పరీక్షింపఁగోరి జంగమవేషధారియై యతనిభార్యను కోరిన కథ యిం దనుసంధేయము; అంగభూషణభుజంగుఁడు = శరీరమున పాములు నగలుగా ధరించినవాఁడు; భుజంగుఁడు = విటుఁడు.

42. మగువకు శరీర మొసఁగిన మగఁడు = అర్ధనారీశ్వరుఁ డనుట; మగఁడు = మొనగాఁడు; మగఁడు = భర్త.

43. అమరమహీరుహంబు = కల్పవృక్షము; యమిజనులు = యోగి జనులు.

45. కేళీసదనంబులు = విలాసగృహములు; మృగమదంబు=కస్తూరి; చంద్రము = కర్పూరము; కాశ్మీరము = కుంకుమపువ్వు; తులాంబరములు = చీనాంబరములు; కరండనిచయంబు = బరిణెలసమూహము; కన్యార్థముగా = కూఁతులకొఱకు.

46. ఏయుని = కొట్టని; శృంఖళా = సంకెల - గొలుసు; శంబర జిత్తు = మన్మథుఁడు; ప్రసన్ననినవ్వు = చక్కని నవ్వు.

47. పక్వబింబములు = పండిన దొండపండ్లు; పుష్పమంజరులు = పూలగుత్తులు.

48. గ్రైవేయముల్ = కంఠహారములు; వమ్ము = వ్యర్థము.

49. నెఱజాణలు = మిక్కిలి నేర్పరులు; చాతురీమహిమ = గొప్ప నేర్పు; ఈశ్వరజ్ఞానము = శివసంబంధమైన జ్ఞానము.

50. కుమతోక్తులు = చెడ్డమాటలు; ఈండ్రింపఁగా = పీడింపఁగా; ఆరాటము = కలఁతపాటు; ఇప్వీటఁ = ఈపట్టణమున; నెమ్మి = ప్రీతి; ఉద్యుక్తులు = సిద్ధపడినవారు.

51. సంసారాంబోధితరణి = సంసారసముద్రమునకు పడవ; కొంచుఁ బోయెదరు = తీసికొని పోయెదరు.

52. తొంగుండెదు = పండుకొని యుండెదు; కన్నగాండ్రు = దొంగలు; కనుంబ్రామి = ఏమఱించి.

53. తిరుకాళహస్తిపతి = శ్రీకాళహస్తీశ్వరుఁడు; తిరుసోఱహాంబు= దాసోహము.

54. తామ్రతాటంకములు = రాగికమ్మలు; కంథలు = బొంతలు; కప్పెరల్ = భిక్షాపాత్రలు; జోలెలు = సంచులు; కుఱుమాపుఁబుట్టములు = కొంచెము మాసిన బట్టలు; డాకేలు = ఎడమచేయి; భసితభస్త్రికలు=బూడిద సంచులు; జంగమాంగనావిలాసంబు = జంగమస్త్రీలవేషము; కాంక్ష=కోరిక.

55. తపస్విమ్రుచ్చులు = దొంగజంగములు; నచ్చి = ఇచ్చపడి; అద్దమరేయి = అర్ధరాత్రి; రెండరామడ = ఇరువదియైదుమైళ్లు; భూధర కూటములు = కొండశిఖరములు.

56. చొప్పు = మార్గము; శశరేఖావతంసుఁడు = చంద్రశేఖరుఁడు - శివుఁడు.

57. ఇక్క=స్థానము; తాండవ...అంగదుక్ = తాండవమున ఎత్తఁబడిన పాదముఁనుండి పడిన అందె కలవానిని; అనారతంబు = ఎల్లపుడును.

58 నిటలోగ్రాక్షుఁడు = నొసటియందు భయంకరమగు కన్ను కలవాఁడు - శివుఁడు; కనకసభానిలయుఁడు = చిదంబరవాసుఁడు.

59. ఉచ్చరత్...స్వనము = ఎగురుచున్న జలచరముల దాఁటులచే భయంకరమగు ధ్వని కలది; ఉచ్చావచ...పటలము - ఉచ్చావచవీచీ = వివిధములగు అలలను; పాటచ్చర = దొంగలచే; హృత = హరింపఁబడిన; వియదసితపటలము = ఆకాశము కల నల్లని సమూహము కలది.

60. దరి = ఒడ్డు; గుములుగూడుక = గుంపులుకూడుకొని; కంధరములు = మేఘములు; కసరెత్తి= వానగాలి యెత్తి; పూర్వాపరాహ్ణవేళలు= సూర్యోదయానంతరమును, సాయంకాలమునకు ముందును.

61. భంగము=అల, శకలము; సముద్భూత = పుట్టినది; అభంగుర మౌక్తికవితానము = తక్కువకాని ముత్యములసమూహము. అలం. ఉపమ.

62. ఇభరత్నము = ఐరావతము; తరురత్నము = కల్పవృక్షము; వధూరత్నము = లక్ష్మీదేవి; ధేనురత్నము = కామధేనువు; గ్లౌరత్నము = చంద్రుఁడు; అమృతరత్నము = శ్రేష్ఠమగు నమృతము; హరిరత్నము = ఉచ్చైశ్శ్రవము; రత్నాకరము = రత్నములకు నిలయమైన సముద్రము.

63 నీలవర్ణుఁడు=విష్ణువు; హేళి=సూర్యుఁడు; తిమిరంబు = చీఁకటి; జంబూఫలద్యుతి = నేరేడుపండుకాంతి. నీరద వ్రాతము = మేఘములగుంపు; పురుహూతనీలము = ఇంద్రనీలము; కజ్జలము = కాటుక; అతసీపుష్ప = నల్లయవిసిపువ్వు; అళిజాత = తుమ్మెదలగుంపు; సన్నిభచ్ఛాయ = సమానమగు కాంతి.

64. వచ్చిననొప్పి = దారిబడలిక; చిచ్చుఱకంటికిన్ = అగ్నిరూప మైన మూఁడవకంటికి; చిత్తజుఁడు = మన్మథుఁడు; ఒజ్జన్ = గురువును - శివుని; నింగిరచ్చన్ = అంబరసభయందు.

66. కూయి = ఆఱపు - మొఱ; వాటము = అనుకూలము.

67. కపాలభృద్రాజు, రాజధరుండు = శివుఁడు.

68. విడిదిండ్లు = విడిదియిండ్లు - బసచేసిన గృహములు; శ్రీకాళ హ్యపేశుండు = శ్రీకాళహస్తీశ్వరుఁడు; యోషారత్నంబులు=ఉత్తమస్త్రీలు; వ్యాజము = నెపము; ఉడుగంగాఁ జేయున్ = పోఁగొట్టును; నక్తంబులన్= రాత్రులందు.

69. తెగి = సాహసించి; మందర...శృంగంబులన్ = మంథరము ననుకరించు శ్రీకాళహస్తిశైలముయొక్క స్వభావవిరుద్ధమగు శోభను నశింపఁ జేయు (గొప్ప) శిఖరములను.

70. ఆరణీకటిని = ఆరణి నది; తోఁచి = ముంచి; సైకతావనిన్ = ఇసుకతిన్నెయందు; అపవర్గరమావిభుఁడు = మోక్షలక్ష్మికి భర్త - శివుఁడు;

అణిమాదిసిద్ధులు = అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము అనునవి.

72. కపిరాజు = కోతులఱేఁడు; ఉద్వసింపఁబోఁ = ఉద్వాసన చేయఁబోఁగా; తక్కినన్ = తప్పిపోఁగా.

73. తివిసినన్ = లాగఁగా; మోకారించుక = మోకరించుకొని; భేదిలకున్నన్ = కదలకపోఁగా.

74. ఉక్కు = బలము; ఊరులు = తొడలు; కెంపు = కోపము.

75. నతదిక్పాలుఁడు = నమ్రులగు దిక్పాలకులు కలవాఁడు - శివుఁడు; తఱుఁలుపడుటయున్ = మాంసఖండములు పడఁగా.

76. రోసి = అసహ్యముచేసికొని.

77. భక్తమరుద్ధేనువుకి = భక్తుల కామధేనువు.

79. ఇంద్రజుఁడు = వాలి; పొరలఁగన్ = దుఃఖింపఁగా; విరతి = ఇష్టములేకుండుట.

80. గోత్రభిత్తనయుఁడు = ఇంద్రపుత్రుఁడు - వాలి.

81. నిర్ఝరము = ప్రవాహము.

82. దవాగ్నివ్యథ = కార్చిచ్చుబాధ; పంక...త్రిదశుల్=విష్ణువు, బ్రహ్మ మున్నగు దేవతలు; ఇమ్ములన్ = సుఖముగా.

83. అయోమయసాధనములు = ఇనుపపనిముట్లు; వ్యాధులు = బోయలు; వన్యాశనంబులు = అడవిలో లభించు ఆహారవస్తువులు; దృశ్యమగువారు = కనఁబడువారు; నిధివ్రజంబు = నిధుల సమూహము.

84. వాసవసుతుఁడు = వాలి; గాసిఁబడి = దుఃఖించి; బలు నిట్టూర్పులుసేసి = పెద్దనిట్టూర్పులు విడిచి.

85. వాణీశుఁడు = బ్రహ్మ; ద్విజిహ్వేశుఁడు = శేషుఁడు; రామల్ = స్త్రీలు...

86. మాపు = రాత్రి; శయించుటకున్ = నిద్రించుటకు; సజ్జనగేహము=ఉత్తముల గృహము; విచారము చేసి = విచారించి - వెదకి; ఒనర్చి= నిశ్చయించి; పెన్ సజ్జ = పెద్దసజ్జ; భవాసజ్జలరాశికుంభజుఁడు=సంసార మను చెడు సముద్రమునకు అగస్త్యుఁడగువాఁడు.

87. రఘుక్షితీశ్వరుఁడు = శ్రీరాముఁడు; కెంజాయన్ = సంధ్యారాగమును; తమిస్ర...పాదంబుగాన్ = చీఁకటి యను తీవ్రములగు బాణములచే తెగఁగొట్టఁబడిన పాదములు కలుగునట్లుగా; చక్రవధూధరాసుత = చక్రవాకి యను సీత; విశ్లేషవ్యథాపాది = వియోగబాధను కలిగించునది; మాయాహేమమృగంబు=బంగారు మాయలేఁడి; అలం. రూపకము. ఉత్ప్రేక్ష.

88. పంకేరుహాప్తబింబము = సూర్యబింబము; అజాండము=బ్రహ్మాండము; శంకాతమఃపరంపర = సందేహము లను చీఁకటుల గుంపు; శంకరచిద్రహితమానసంబు=శంకరరూప చిదానందము లేని మనస్సు. అలం. ఉపమ.

89. తపనుఁడు = సూర్యుఁడు; పాతకపటలంబు = పాపసమూహము; లోఁగిపఱచి = అణఁగి పోయి; పర్వి = వ్యాపించి.

90. వామాంగ...ధామాళి = ఎడమభాగమైన పార్వతి నల్లని కాంతిపుంజము; హాలాహలకాళిమంబు = విషము నలుపు; అసితచ్ఛాయ = నల్లనికాంతి; చూళికా...రుచి = పిల్లజుట్టులోని గంగానదిలోని పాచి యొక్క కాంతి; నీలిమ = నలుపు; కీలితకరటిచర్మద్యుతి = కట్టిన ఏనుఁగు తోలుకాంతి; మేచక = నల్లని; భువనలోచనుఁడు = సూర్యుఁడు; భూతేశుఁడు = శివుఁడు; సాంద్రకాంతిన్ = దట్టమగు తేజస్సుతో.

91. తిమిరదినేంద్రజాజలము = చీఁకటి యను యమునానది నీరు; పశ్చిమాశ = పడమటిదిక్కు; చెల్వ = వనిత; పద్మరాగకుంభము = కెంపుకుండ; ప్రాక్సతి = తూర్పుదిక్కను స్త్రీ; వెన్నెలవెల్లుటేటితోయము = వెన్నెల యను గంగాజలము; హేమకలశాకృతిన్ = బంగారుకుండరీతిని.

92. కాముకహృద్ధధి=కాముకుల మన స్సనెడి పెరుగు; బువ్వము= ఆహారము; పర్వము = పండువు; మవ్వము = కోమలత్వము; ఉత్పల శ్రీమతి= కలువకన్నె; చకోరమహిషీమధుపాళి = ఆఁడుచకోరములు, తుమ్మెదలగుంపు; యామవతీశబింబము = చంద్రబింబము; ప్రభాళిపెక్కువ = ఎక్కువ కాంతి సమూహము.

93. గొజ్జు = గొజ్జు, ముద్ద; కాను = నీరు కలియని మజ్జిగ.

95. తారు = తాము; రాజకళాధరుఁడు = శివుఁడు.

96. తారాప్రోష్ఠపలు = నక్షత్రము లను చేఁపలు; కాలసూతుఁడు= కాల మను జాలరి; ప్రాహ్ణారంభంబు = ఉదయము; నులివాయన్ = చిక్కు పోవునట్లుగా; ఈడ్చాఅన్ = తడియాఱఁగా; జాలము = వల; శోభాకించ నత్వంబునన్ = ఎక్కువ కాంతితో; తారానాయక మండలంబు = చంద్ర బింబము; అస్తగ్రావ కూటంబు = అస్తపర్వత శిఖరము.

97. కానచిచ్చు = దావాగ్ని; కుసుంభము = ఒక విధమైన ఎఱ్ఱని రంగు; కూఁకటిరత్నము = చూడామణి; అబ్జరమ = తామరసంపద; తేఁకువ పెంట = స్థైర్యప్రతిష్ఠ; దినేంద్రుఁడు = సూర్యుఁడు.

98. భక్తస్వాంతనిశాంతుఁడు = భక్తుల మనస్సు గృహముగాఁ గలవాఁడు; నిశాంతసపర్య = ప్రాతఃకాలపూజ; ఆశాంతములన్ = దిగం తములందు.

99. సత్త్వకులము = క్రూరమృగములగుంపు; కాఁడి = నాటి; సరస్తటంబు = కొలనియొద్దు.

100. ఇచ్ఛాప్రవృత్తిన్ = స్వేచ్ఛగా; కాంతారంబుల్ = అడవులు మాపటిసందునన్ = మాపటి యా లోపుగా.

101. అరిష్టసాధ్వసము = దుశ్శకునముల భయము; చెల్లియల్ = చెల్లెలు; అప్పా = అక్కా! కన్నె = కన్నియ, అక్క యనుట; అప్పయ్య= తండ్రి.

103. కుఱుబోడతలల = చిన్న గుండ్రని తలలు గల; గండ... కుండలములు = చెంపలపై కదలుచున్న రాగికుండలములు; ధాతురాగాంగ వస్త్రములు = కావిగుడ్డలు; తీవ్రధావనంబు = ఎక్కువగా బరుగెత్తుట, ద్రవిళజంగమవేషంబులు = తమిళనాటిలోని జంగముల వేషములు.

104. ఆకులతంబొందన్ = కలఁతపడఁగా; ఏకాకులు = ఒంటరిగాండ్రు.

105. మదనారి = శివుఁడు.

107. కరుణాతోయనిధి = దయాసముద్రుఁడు; తుహినాంశుధరుఁడు = శివుఁడు; ప్రచింత = ఎక్కువ విచారము.

108. నెట్టుకొని = పూనుకొని; జీవులం...గట్టు = దక్షిణ కైలాసము; సమీరకుమార = పిల్లవాయువులు; సోనలు = ప్రవాహములు; తానములు = చోట్లు; మధుపవితాన = తుమ్మెదలగుంపు; పటీరతరు = చందనవృక్షము; నీవారముష్టింపచ = యోగులు; శైవభారతీ పరిచయధురీణ = శైవాగమ తత్త్వవేత్తలు; వ్యాహార = పలుకుచున్న; తృణీకృత = తిరస్కరింపఁబడిన - తక్కువచేయఁబడిన; గగనమణి = సూర్యుఁడు; ఘృణి = కాంతి; హరిప్రభృతి = సింహము మొదలైన; గిరిదరీభవ = కొండగుహల నుండి పుట్టిన; రసాల = తీయమామిడి; సాల = మద్ది; హింతాల = ఈఁత; జంబూ = నేరేడు; జంబీర = నిమ్మ; కపిత్థ=వెలగ; పెదకడలన్ = వెనుకభాగములందును; కుంభ...కన్యా = సువర్ణముఖరీనది; గంగోత్తమాంగలింగాంగరాగీకృత = శివలింగము మైపూఁతగాఁ జేయఁబడిన; గంధసార = చందనము; ఘనసార = కర్పూరము; సంకుమద = జవ్వాజి; మృగమద =

కస్తూరి; ఆమోదంబు = పరిమళము; మాకంద = మామిడి; కర్ణికార = కొండగోఁగు; నమేరు = సురపొన్న; మాలూర=మారేడు; కుటజ=అంకుడు; వకుళ = పొగడ; శీతల వాతపోతంబులు = చల్లని పిల్లవాయువులు; పథి ప్రయాసంబు = దారి బడలిక; పంచాస్యంబు = సింహము. అయిదు ముఖములు కల శివుఁడు కలది; నటన్నీలకంఠంబు = నాట్యముచేయు నెమిళ్లు కలది, నటించు శివుఁడు కలది; ఆశ్రిత...కిరాతంబు = ఆశ్రయింపఁబడిన సాలెపురుగు, పాము, ఏనుఁగు, కిరాతుఁడును కలది - ఆశ్రయింపఁబడిన శ్రీ, కాళ, హస్తి, తిన్నఁడు (అను) శివభక్తులు కలది; సమున్నత...ఖతలంబు = మిక్కిలి యెత్తయిన జాళ్లచే ఒరయుచున్న గగనభాగము కలది; శతముఖావధి = ఇంద్రుఁడు అవధిగాఁ గల; నిర్జరలోచనాగోచరంబు = దేవతల కన్నులకును గోచరము కానిది; భాగధేయంబు = భాగ్యము; గణనాతీత ప్రభావంబు = లెక్కింపరాని గొప్పతనము కలది; ఎడపడని = హద్దులేని; ఒడయనిఁ = ప్రభువును - శివుని; సంగడిఁ = కలిసి; అంతర్ధానంబవ ధరించిన = మాయముకాఁగా.

109. జంగమాకృతి విభూతిఁ = జంగమాకార సంపదతో; మఱుంగు = అడ్డు - మాయము.

110. అంతకాంతకుఁడు = యమునికి యముఁడు - శివుఁడు.

111. అడఁగెఁ = పోయెను; కల్పసాలము = కల్పవృక్షము; ఉప్పెనఁబోయెఁ = వరదలో కొట్టుకొనిపోయెను. పరుసవేది = పట్టినది బంగారముచేయు మూలిక; అపవర్గము = మోక్షము.

113. సవాత్సల్య...మనీష = వాత్సల్యముతోను, కనికరముతోను కూడిన బుద్ధి.

114. కేతకీద్వీపవతి = సువర్ణముఖరీనది; దుర్గాధరాధరము = దుర్గ పర్వతము; ఘనము = గొప్పది.

115. జ్ఞానపుష్పకలిక = జ్ఞానప్రసూనాంబ. ఈశ = పార్వతి; యమాశ = దక్షిణదిక్కు; వెండిమల = వెండికొండ - కైలాసము.

116. రుద్రాక్ష స్రగలంకృతుల్ = రుద్రాక్షమాలలచే అలంకరింపఁబడినవారు; పంచ...స్వాంతులు = పంచాక్షరీమంత్రము ననుసరించి మేల్కొనిన మనస్సులు కలవారు; అంగ...ద్రాఘిష్ఠులు = మదనుని జయించిన శివుని పూజాకృత్యమున ఎక్కువగా తత్తఱపడువారు - ఆసక్తికలవారనుట; భద్రాకారులు = శుభస్వరూపము కలవారు.

117. మొగలేటన్ = సువర్ణముఖరీనదిలో; జంబాలము = బురద; ఎడలున్ = పోవును; సన్నము = తక్కువ; అష్టపాశక్లేశము = దేశాంతరగమనము, భార్యావియోగము, ఆపత్కాలమున బంధుదర్శనము, ఉచ్ఛిష్టభక్షణము, శత్రుస్నేహము, పరాన్నమునకు ఎదురుచూచుట, మోసము, లేమి అను పాశరూపము లగు ఎనిమిది కష్టములు; కలధౌతగిరి = కైలాసపర్వతము; సుకరము = సులభము.

118. కుంభ...కన్యకన్ = అగస్త్యపుత్రిక యగు సువర్ణముఖరీనదియందు; తీర్థమాడి = స్నానముచేసి; సిక్తములగు వస్త్రముల్ = తడిబట్టలు; ధౌతపటంబులు = మడుగుబట్టలు; సైకతవితర్దికలు = ఇసుకతిన్నెల పీఁటలు; కమలాసనస్థలై = పద్మాసనములు వేసికొన్నవారై.

119. అక్షరుఁడు = శివుఁడు; పంచాక్షర పూతభూతి=పంచాక్షరీ జపముచే పవిత్రమైన విభూతి; వివిధాంగములన్ = ఆ యా యవయవములందు; క్షయము = నాశము.

120. ప్రవిశకవి = సత్కవిరుఁడు; అన్య...దూరులు = వేరే ఆలోచనలకు, ప్రసంగములకును దూరముగ ఉండువారు; భవభవనద్వారము = శివాలయద్వారము.

121. మొగము నెత్తమ్ములు = ముఖపద్మములు; సోయగము = అందము; అదుటు = ఉబుకు - తీవ్రత; తుఱఁగలింపన్ = ప్రకాశింప; విస్తరము = ప్రకాశము.

122. తొల్లిక = పాఱవంటి సాధనము; వసుంధర = భూమి; ననల్ = పూవులు; కొనలు = తీఁగలు.

123. కళికావితానము = మొగ్గతోడుగు; ప్రస్వేదవారి కణములు= చెమట బిందువులు.

124. నీలాంబుదము = నల్లని మబ్బు.

125. కదియన్ = సమీపింపఁగా.

126. ఘనతమోగ్రంథులు=గొప్ప చీఁకటి ముడులు; జవభాషలు = తొందరతోడి మాటలు; పుండరీక...అంగుఁడు - పుండరీకభవాండ = బ్రహ్మాండ మనెడి; కరండకుహర = గుహవంటి బరిణెలో; బహిరబహిః = లోపలను, వెలుపలనుగూడ; అహరహః పూర్ణ = దినదినము పూర్ణమగు; భావనాదిక = మననాదులచే; ప్రకాశాంగుఁడు = ప్రకాశించు దేహము కలవాఁడు.

127. దైన్యంబు = దీనత్వము; ఒక దేహమై = ఇద్దఱు నొక్క రూపయి - అర్ధనారీశ్వరుఁ డై.

128. మిన్నేటినీటన్ = ఆకాశగంగాజలమున; తెరలు తెరలై = అలలు, అలలుగా; ఎగసి = ఎగిరి; హత్తి = అత్తుకొని, ముత్తియంపుసేసలు = ముత్యాలతలఁబ్రాలు; తెఱఁగొప్పుచున్న = అందమై యున్న; మెఱచి = మెఱసి; మెఱపునొఱపు నెఱపు = మెఱుపుయొక్క అందమును కలిగించు; కేతకీదళంబు = మొగలిఱేకు; జడియు = తొలఁగిన; నెలవంక=చంద్రుఁడు; సుధాలవంబులు = అమృతబిందువులు; చదలేరు = గంగానది; తలఁకెడు =

చలించుచున్న; లేటి వెడలుపాటిచూపుల వెఱపు = లేడియొక్క వెడల్పు యిన చూపుల భయము; చుట్టఱికంబు = బంధుత్వము - సామ్యము; మానుపు = మాన్పుచున్న - భయము పోఁగొట్టు; నాయుపు...నివాళికలు = హిమాలయపుత్రిక యగు పార్వతి వాలుఁజూపుల యారతులు; శంకరినెల వంక = పార్వతిభూషణ మగు చంద్రలేఖ; పంకజ మిత్రమండలంబు శంక= సూర్యబింబ మను సందేహము; అంకురింపఁజేయు = కలిగించు; వట్రువ బొట్టు = గుండ్రని చుక్కబొట్టు; అడంగిన కతంబునక్ = కప్పఁబడి కాన రాని కారణమున; సైకత నితంబలు = యువతులు; కాము .దహనంబు = కామ మను పాపాటవీదాహము; అఱ = సగము; మునుకుఁ గంటిమంట = శివుని మూఁడవ కంటి మంట; కెంపు = ఎఱుపు; నీలరోలంబజాలనీలిమ = నల్లనికేశపాశపు నలుపు; పాటల జటాజూటపాటలత్వంబు = ఎఱ్ఱని కపర్దపు ఎఱుపుకాంతి; దివసావసాన సమయము = సంధ్యాకాలము; ప్రియుంబాసి= ప్రియుని విడిచి; ఉభయ...సముదయంబులు - ఉభయ తనుప్రభా = రెండిటి దేహకాంతి యను; విభాకరతనయా నభోనదీ = యమునా గంగల; సంభేద = వేఱుపాటున; సముద్భవ = పుట్టిన; హిమాంశుముకుందసముదయం బులు= = తెల్లకలువల గుంపు; జక్కవ = చక్రవాకము; పసులదుకూలము = తెల్ల పట్టువస్త్రము; తొడిఁకి పట్టు = అంకించి పట్టుకొను, అభంగురాలింగ నంబు = గాఢమైన కౌఁగిలి; నిజాంగన = తన భార్య; నొసవులు = నగలు; విషానలధూమంబులు = విషాగ్నుల పొగలు; సదలింపఁదలంచు = తీసివేయఁ దలంచు; అగజ = పార్వతి, సొబగు = అందము; దేహ...లలామ = దేహ మున ఎడమభాగమైన పార్వతి, అన్నువసెన్నడుము = సన్నని అందమైన నడుము; నెలవు = స్థానము; అంగజభంగంబు = మన్మథుని నాశము; కాల కూటకాళిమ = విషపునలుపు; కంఠసరాంతర = కంఠహారములోని; పురందర

నీలనీలిమ = ఇంద్రనీలపు నీలిరంగు; ప్రచండ...పాదంబు = భయంకరమగు తాండవమున బ్రద్దలుచేయఁబడిన బ్రహ్మాండము గల పాదము; యోగీశ్వరో పాస్య...పాదంబు = యోగీశ్వరులచే ధ్యానింపఁబడు నాట్యరహస్యముచే నొప్పు పాదము; ప్రమోదాపాదకంబులు = సంతోషము కల్గించునవి; ఎదురుకట్లన్ = కట్టెదుట; అవనీతలంబు=భూమి; కన్నియలక న్నెఱిఁగి = కన్యల యాశయము తెలిసికొని; దాక్షాయణి = పార్వతి; సాయుజ్యంబు = మోక్షము.

129. దేవస్థానము = దేవాలయము; పురంధ్రీరత్నముల్ = స్త్రీలు; చేతోవైకల్యము = మనస్సులో కలఁతపాటు.

130. స్థానమువారు=ఆచోట నున్న వారు; వెఱఁగు=ఆశ్చర్యము; అంబరవాణి = ఆకాశవాణి.

131. వార...మహిమ=భోగమువనితల హస్తములేని శివభక్తిమహిమ; అలవి = సాధ్యము.

132. మమతాజడధీజడధినిమగ్నత = మమత్వముచే మందమైన బుద్ధి యనెడు సముద్రమున మునుగుట, మోక్షసింధువు = ముక్తి యను సముద్రము.

133. శివగేహంబు = శివాలయము; సీమంబు = స్థానము; శబర సమ్రాట్ = తిన్నఁడు; ప్రియధామముల్ = ఇష్టమైన చోట్లు; నిశ్శ్రేయ సంబు = మోక్షము.

134. కృతపుణ్యులు = పుణ్యాత్ములు; తలఁకు = చలనము.

135. ఏలికసాములు = యజమానురాండ్రు.

136. పరిణామము = మార్పు; భావము = అభిప్రాయము.

137. గండూషించి = పుక్కిలించి; చప్పి = పీల్చిపిప్పిచేసి; నిక్షేపించి = దాఁచి; నూఱుక = నూఱుకొని; ఉల్లంబు = మనస్సు; గాంగేయము = బంగారము; ఒరసి = గీటుపెట్టి; చెలఁది = సాలెపురుగు; ఇభము = ఏనుఁగు; ఎఱుకు = తిన్నఁడు.

138. జంగమలింగము = కదలుచున్న (జంగమరూపుకల) శివుఁడు; అంగభవుఁడు = మన్మథుఁడు.

139. పద్మసూతి = బ్రహ్మ; మదంబు = అహంకారము; ఊర్ణనాభుఁడు = బ్రహ్మకొడుకు, సాలెపురుగు.

141. ఎన్నక = లెక్కింపక - తలఁపక; తుది = అంతము-శాపాంతము; వేధ = బ్రహ్మ; విధూతవిరోధచిత్తుఁడు = పోయిన విరోధము కల మనస్సుకలవాఁడై.

142. ధిషణ = బుద్ధి; లూత = సాలెపురుగు.

143. అగజేశుఁడు = శివుఁడు; ఎఱుక = జ్ఞానము.

144. బిల్వకద్రుమము = మారేడుచెట్టు; నిజ... ప్రవీణత = నీవలని దారముచే వస్త్రముల నేయు నేర్పు.

146. అలిగి = ద్రోహము తలఁచి.

147. ద్విదంతవనము = గజవనము; మాలూరద్రు = మారేడుచెట్టు.

149. వేణు...పుటి = వెదురుబద్దలతో చేయఁబడిన పూలసజ్జ; శ్రీకంఠుఁడు = గరళకంఠుఁడు - శివుఁడు.

150. కేతకీతటిని = సువర్ణముఖరి; తత్పయో... దేహుఁడు=అందలి నీటిచేఁ గడుగఁబడిన శరీరము కలవాఁడు; కల... గేహుఁడు = కైలాసనగ నివాసి; అంతనుండి = అదిమొదలు.

151. అవార్యంబు = అడ్డరానిది; సాయుజ్యము = మోక్షము.

152. దీధితులు = కాంతులు; తమ.. గుహాలు = చీఁకటిచే ఆక్ర మింపఁబడిన గుహాలు.

153. భావభవుఁడు = మన్మథుఁడు; అళికేక్షణము = నొసటికన్ను; సాను = కొండచరియ; జగత్త్రయగాహకము = ముల్లోకములను నిండినది.

154. శాద్వలములు = పచ్చికచిగుళ్లు; దంతిముఖవాహనము = వినాయకుని వాహనమైన యెలుక; కుధర...తటంబులన్ = ఆకొండచరియ లందు జాఱు (ప్రవహించు) చున్న గంగానదియొడ్డులందు.

155. అనవరత = ఎల్లపుడు; కూడుక = కూడుకొని; సంభేదశంకన్ = నదీసంగమ మను భ్రాంతితో.

156. పారదము = పాదరసము; కుముదినీపతికాంతి = వెన్నెల; ము క్తి...గతిన్ = మోక్షలక్ష్మియొక్క విలాసార్థమయి వెన్నెలగుంపుతో చేయఁబడిన మేడవలె

157. అంభోజ... స్తంభంబు=బ్రహ్మాండ మను గృహము నాలుగిండ్ల వాకిట ప్రకాశించు స్థలమునందలి మనోహరమగు స్తంభము; రజతశైలము = కైలాసము.

158. రాజహంసము బ్రహ్మవాహనము; గంధగజ మింద్రుని వాహ నము; మేఁకపోఁతు అగ్నివాహనము; కాసరము యమునివాహనము; నరుండు కుబేర వాహనము; నక్రము వరుణ వాహనము; ఇఱ్ఱి (జింక) వాయువు వాహనము; గుఱ్ఱము నిర్‌రృతి వాహనము; ఎద్దు ఈశానుని వాహనము.

159. తొంగిలి = వాలి; క్రొన్నెలవిరి = నెలవంక యను పూవు; శేష, కర్కోటక కంబళాశ్వతర తుంబురుకాళములు సర్పవిశేషములు; శ్రవ ములు = చెవులు; చిలువకులము = పాములగుంపు.

160. దైత్యభేది = విష్ణువు.

161. అక్షోభువనంబు = పాతాళము; వికలత్వము = కలఁతపాటు.

162. తాల్మి = ధైర్యము.

163. ద్విజిహ్వుంబు = పాము; తారాగంబు, అవాచీనము = దక్షిణ కైలాసపర్వతము.

164. ఆహవము = యుద్ధము.

165. అంతరాయనిధానములు = విఘ్నములకు నిధులు.

167. ఘర్మజల = చెమటనీరు; ఏకతంబునన్ = ఏకాంతముగా.

168. చేతస్తపవృత్తి = మనస్సుయొక్క కొంచెపుతనము; వాస్తువు= గృహము - కేళీగృహము; కస్తి = దుఃఖము.

171. మత్సరంబు = మాత్సర్యము - పగ.

172. వాతాశనము = పాము; గంధనాగంబు = మదపుటేనుఁగు.

173. మాలూరచ్ఛదనములు = మారేడుపత్తిరి; కేతక్యాపగ = సువర్ణముఖరీనది.

174. కరటిగ్రామణి = మదగజము.

177. దివిజేశతనూభవుఁడు = ఇంద్రపుత్రుఁడు - అర్జునుఁడు. ముక్తా-శనుఁడు = ఉపవసించినవాఁడు; ప్రాగ్వరముఖ్యులు = ఇంద్రుఁడు మున్నగు వారు.

178. కేకిపింఛపుద్రాటిచుట్ట = నెమిలిపురికెంద్రుకలతో పేనిన దారపుచుట్ట; బిసరుహాహితరేఖ = చంద్రలేఖ; పీఁకె = నాగస్వరము మున్నగువాని చివర ఊదుటకుపయోగించు సాధనము; శ్రుతిఫణి = చెవి-పోగుగా నున్న పాము; తామరలు = తామరపూసలు; ఒడదోలు = తోలు చొక్కా. జాగిలములు = వేఁటకుక్కలు; భర్గుఁడు = శివుఁడు; చొరఁగన్= ప్రవేశింపఁగా.

179. కాకోలాశనుఁడు = గరళము భుజించు శివుఁడు; మాయా కోలము = మాయపంది; కోలాంగూలకేతుఁడు = గోలాంగూలమగు హనుమంతుఁడు జెండాగా కలవాఁడు.

180. విహ్వాలత = కలఁతపాటు; తూణముల్ = అమ్ములపొదులు; ధూర్జటి = శివుఁడు; విజయుఁడు = అర్జునుఁడు.

181. ఏసిన = ప్రయోగించిన; ఇరుబరులు = రెండుప్రక్కలు; కిరి = పంది; నట్టువ = నాట్యముచేయు ఆడుది; తిరుపుగొనుట = తిరుగుట.

182. కాఁడన్ = నాటగా; తివియన్ = లాగుటకు.

183. బిరుదు = గొప్పది; నరుఁడు = అర్జునుఁడు; తచ్ఛరములన్ = వాని బాణములచే.

184. తాను = నేను; కిటుకై = కపటముచేయువాఁరై; భీముఁడు = శివుఁడు; భీమాహవకేళి = భయంకరమైన యుద్ధక్రీడ.

185. సూనశరారి = మన్మథునిశత్రువగు శివుఁడు; నముచిసూదనుఁడు = ఇంద్రుఁడు; భానుఁడు = సూర్యుఁడు; భానుపరంపర = కాంతి పుంజము.

186. చెంచు = బోయ; ధనంజయుఁడు = అర్జునుఁడు; చీరికిఁ గైకొనక = లెక్కచేయక; పురభేది = శివుఁడు; నీతి = పద్ధతి.

187. తూణము = అమ్ములపొది; అంబకము = బాణము; సహస్రాక్షసుతుండు = ఇంద్రపుత్రుఁడు - అర్జునుఁడు; విశిఖాసనము = విల్లు; పాటల = ఎట్టని.

188. బేడిదము = బెట్టిదము - గొప్పది; క్రీడి = కిరీటి.

189. కోదండంబులు = విండ్లు; అంసము = మూఁపు; రోదోంతంబు = భూనభోఽంతరాళము; అట్టహాసములు = పెడనవ్వులు; మల్లసంగరము = మల్లయుద్ధము.

190. మల్లచఱచికొనుచుఁ = భుజములు తట్టుకొనుచు. మహి = భూమి; అప్పళించి = చఱచి; తెఱపి = అవకాశము.

191. ఒడికిపట్టుక = చిక్కించిపట్టుకొని; ఊఁదిన = నొక్కిపెట్టిన; విఱియఁగ = విఱుగఁగా; అక్కు = ఱొమ్ము; హెచ్చుకుందు = ఎక్కువ. తక్కువ; హరిహయసుతుండు = అర్జునుఁడు.

192. సింధురార్భకము = ఏనుఁగుపిల్ల; గాండీవి = అర్జునుఁడు; కదనంబు = యుద్ధము.

193. వైకుంఠుఁడు = విష్ణువు; ద్రుహిణుఁడు = బ్రహ్మ; వామసీమావరోధాకారుండు = ఎడమవైపు భార్యరూపము కలవాఁడు - అర్ధనారీశ్వరుఁడు; కాకోదరము = పాము; వళక్ష = తెల్లని; కరాళుండు = భయంకరుఁడు.

194. సకలాదిత్యులు = సమస్తదేవతలు; కాత్యాయని = పార్వతి; అభీష్టము = వరము.

195. మదీ...నీకంబులు = నా యజ్ఞానమువలనఁ బుట్టిన అపరాధసమూహములు; ప్రభా...శ్రేష్ఠము = కాంతివర్షధారలను వర్షించు. ప్రళయకాలమేఘ మగు పాశుపతాస్త్రమంత్రరాజము.

196. భక్తదురాశాపాశలవిత్ర = భక్తుల దురాశలను త్రాళ్లకు కొడవలి యగువాఁడా!

197. కాంక్షఁజేసితి = కోరితివి; మృగహంత = కిరాతుఁడు; ఆఖేటకము = వేఁట; ఫల్గునుఁడు = అర్జునుఁడు.

201. సాహిణి = అశ్వపాలకుఁడు; పల్లన = పల్యాణము - జీను. సారంగజవంబు = జింకవేగము; చిద్వనధి = ఆనందసముద్రము.

202. అంతక......తాత్మక = దక్షిణకైలాసపర్వతవిహారముచే సంతోషించు మనస్సు కలవానిని; సరోరుహదృగంబకుఁడు = విష్ణువు బాణముగాఁ గలవాఁడు; ధరారథుఁడు = భూమి రథముగాఁ గలవాఁడు; సరోజభవసారథి = బ్రహ్మ సారథిగాఁ గలవాఁడు; సారస...శరీరుఁడు - సారసహితేందు = సూర్యచంద్రులు; ధరణీ. రస, హుతాశన, సమీర, ఖ = పృథివి, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశము నను పంచ భూతములు; మఖేశ్వరశరీరుఁడు = యజమానుఁడు నను ఎనిమిది దేహములు కలవాఁడు - అష్టమూర్తి; తుషారగిరిపుత్రి = పార్వతి.

203. నభోనది = ఆకాశగంగ; తిరుకాళహస్తీశుఁడు = శ్రీకాళహస్తీశ్వరుఁడు; ఆఖువాహుఁడు = ఎలుక వాహనముగాఁ గల వినాయకుఁడు.

204. నీవారాగ్రశిఖాంత = వరివెన్ను చివరివలె (పింగళవర్ణము గలిగి)యున్న జడల చివఱిభాగములు కలవాఁడా! నీవారముష్టింపచులు = యోగులు; రూఢ...కవాటా - రూఢ = స్థిరమగు; భేదప్రతిష్ఠావష్టంభ = భేదభావమువలని గర్వమువలన; విజృంభిత = చెలరేఁగిన; అననినికార్యద్వాక్కవాటా = ముఖవికారము కలిగించు మాటలను తలుపగువాఁడా - నిరోధించువాఁడా అనుట. జన్మ...సంహరకా = జన్మము, ముదిమి, చావు, ఆపద, నాశము మున్నగు కష్టములను నశింపఁజేయువాఁడా!

205. బంధత్రయనాశక = ప్రారబ్ధ, సంచిత, ఆగామికర్మబంధములను మూఁడు బాధములను నశింపఁజేయువాఁడా! భవ...బంధుర = సంసారబంధము మున్నగు బంధముల సమూహమును బంధించు విద్యచే మనోహరుఁడగువాఁడా! సమస్త...రేశ = సమస్తప్రాణులను సేనాసమూహమునకు నాయకుఁ డగువాఁడా! కల్పమహీజము = కల్పవృక్షము.

**206.** వటక్షమాజవాస = మఱ్ఱిచెట్టు నివాసముగాఁ గలవాఁడా! భేదవాదివాదఖండితా = కల్పితు లగు భేదవాదులవాదములను ఖండింపఁ జేయువాఁడా! జటా...మండితా - జటాకుటీవిటంక = జడ యను కుటీరపు ముంజూరున; లగ్న = లగ్నమైన; చంద్రఖండ = నెలవంకచే; మండితా = అలంకరింపఁబడినవాఁడా! కిటీపటీభవద్దిగంత = ధరించు వస్త్రముగా నున్న దిగంతములు కలవాఁడా! - దిగంబరుఁడా యనుట. కాలకూటఘస్మరా = హాలాహలమును మ్రింగినవాఁడా! నటత్...స్మరా = నాట్యముచేయు అగ్నిమయ మగు చూపుచేత జయింపఁబడిన మన్మథుఁడు కలవాఁడా!






చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.— 2006. కాపీలు 1000.